# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

200

25 ఏళ్ళ నక్సల్బరీ శ్రీకాకుళ పోరాట ప్రతిస్పందన

నిర్బంధ నిషేధ నిరసన

చరిత్రలో నిషేధాలు - సెన్సార్‌షిప్ గురించి మార్క్స్

నూరేళ్ళ 'కన్యాశుల్కం'కు నూలుపోగు

అమరుడు ఎం. ఎస్. ఆర్. కవిత పాట లేఖ

కథ - జాడ

పాటలు - మెతుకు లేని ఊరు సారాపై పోరు

సంపాదకీయం - అయోధ్య పరిణామాలు


నిర్వహణ

'సాహితీ మిత్రులు'

# సృజన

## ఆధునిక సాహిత్య వేదిక

200 మాసపత్రిక

ఈ సంచికలో...



నిర్వహణ : 'సాహితీమిత్రులు'

విడి ప్రతి : రూ. 5/- సంవత్సర చందా : రూ. 50/-

Edited Printed and Published by P. Hemalatha, Flat 3, Floor 2, Lakshmi Apartments, Nalgonda X Roads, Malakpet, Hyderabad-500 036 and Printed at Nagendra Press, Vijayawada-520 002

Working Editor : Vara Vara Rao

# విధ్వంస'కరసేవ'

ఆనందపట్వర్ధన్ 'రామ్ కే నామ్ సే' అనే ఒక డాక్యుమెంటరీ తీసాడు. అది లాల్‌కృష్ణ అద్వానీ రథయాత్ర రోజులకు సంబంధించినది. అందులో అయోధ్యలో దళితులైన 'భంగీ' లను వాళ్ళ గుడిసెలు తొలగించి నిరాశ్రయులను చేసిన ఉదంతం ఉంది. ఒక భంగీ మహిళ లక్ష్మి అడుగుతుంది - మాజన్మ భూమిలో మేం వేసుకున్న గుడిసెల నుంచి మమ్ములను తొలగించి ఆకాశం కిందికి తోసేసి రాముని గుడి కట్టాం రమ్మంటే మాకేమిటి సంబంధం - అని. ఈ ప్రశ్న జ్ఞానం, వివేకం, చైతన్యం గల పీడితులందరూ రోజూ ఈ దేశంలో అడగవలసిందే. ఇవేవీ ఉన్నా, లేకున్నా ఇటువంటి భయంకర అనుభవం గల నోరులేని అశేష ప్రజానీకం మౌనంగా అడుగుతున్నదీ ఇదే. ఆదివాసుల్ని అడవుల్లోకి నెట్టేసిన ఆర్యులు మొదలు (తన అరణ్యవాసంలోనూ, శబరి తిండిని, శంభూకుని తపస్సును, వాలిరాజ్యాన్ని, శూర్పణఖ ప్రేమను వాళ్ళకు చెందకుండా చేసిన అంటే గిరిజన, శూద్ర, వానర, స్త్రీ జాతులకు అన్యాయం చేసిన "చరిత్ర" రామునిది.) నిత్యమూ గ్రామాల్లో దళితులను అస్పృశ్యులను చేసి సాంఘిక బహిష్కరణ మొదలు సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ దోపిడికి గురిచేస్తున్న చరిత్ర ఈ దేశపు అగ్రవర్ణాలదీ, వర్గాలది. చింతపల్లిలో సామంత గిరిజనుల గుడిసెలను తగలబెట్టి, చుండూరులో 20 మంది దళితులను హత్యచేసి, కిలవెన్మణిలో 40 దళిత ఆవాసాలను తగులబెట్టి .... ఇటువంటి దాఖలాలు లేని రోజు ఉందా.

చిరకాలం సంతానం లేని దశరథుడు యజ్ఞ యాగాదులు చేసి పశుబలులు చేసి వరాలు పొందాడు. సరయూనదీ తీరంలో నీళ్ళు తాగుతున్న శ్రవణ కుమారుడిని (ఇది శ్రమణుడై ఉంటుంది. శ్రమణుడు జైనుడు.) మృగ మనుకొని చంపాడు దశరథుడు. ఆ పిల్లవాని తండ్రి 'తప్పు లేదులే, అతడు బ్రాహ్మణుడు కాదు కనుక పాప భీతి అక్కరలే'దంటాడు. తల్లి మాత్రం పుత్ర శోకం పట్టలేక 'నీకు పుత్ర వియోగం కలగాల'ని శాపం పెడుతుంది. వాల్మీకి ఎందుకోసం ఈ కావ్యం రాసినా ఈ కథలోని కొన్ని చేదు నిజాలు ఈనాటికీ కొనసాగుతున్నాయి. జైనుల, బౌద్ధుల ధర్మాలనూ, నిర్మాణాలనూ విధ్వంసంచేసి హిందూమతంగా ప్రచారం చేయబడుతున్న వర్ణాశ్రమధర్మం "వర్ధిల్లింది". రామాయణమంతా రాముని ధీరోదాత్త

ధీరోద్ధత నాయకత్వం బ్రాహ్మణ, క్షత్రియ ప్రయోజనాలు, స్వప్రయోజనం తప్ప ప్రజల ప్రయోజనాలు తీర్చడానికి పరాక్రమం ప్రదర్శించిన నిదర్శనాలు లేవు. విశ్వామిత్రుని యజ్ఞం కాపాడడానికి స్త్రీలనికూడ చూడకుండా చంపాడు. సీతను పెళ్ళాడడానికి శివ ధనుర్భంగం చేసాడు. మనకు తెలిసిన 'రామరాజ్యం' భరతునిదే. రాముని పాదుకలు 14 ఏండ్లు అయోధ్యను పాలించాయి. జ్ఞానులు ఏం చెప్పినా ప్రజల్లో ఈనాటికీ రామరాజ్యం గురించి ఉన్న సామెత 'రాముని రాజ్యం, భరతుని పట్టం. రామ పట్టాభిషేకం తర్వాత ఆయన చేసిన ముఖ్యమైన ధర్మ నిర్వహణ సీతను అనుమానంతో అడవులకు పంపడం. ఆ తర్వాత అగ్నిప్రవేశం చేయించి భూగర్భానికి పంపడం.

ఈ శ్రీరామచంద్రుని కోసం ప్రభుత్వనిధిని దుర్వినియోగం చేసి భద్రాచలంలో గుడి కట్టించిన కంచర్ల గోపన్న అనే తాసీల్దారు తానీషా కాలంలో జైలుపాలయ్యాడు.

పురాణ, రాజుల కాలం గడిచి సెక్యులర్, ఆధునిక కాలంలో ప్రవేశించాక వలసవాద చరిత్రకారులు రాసిన చరిత్ర ప్రమాణంగా రాముడు బాబ్రీ మసీదులో ప్రవేశించి అది తన విగ్రహ జన్మస్థానం చేసుకున్నాడు. 1949లో ఒక హిందూ సెషన్స్ జడ్జ్ నాయర్ సహాయంతో బాబ్రీ మసీదులో ప్రవేశించి ఈ డిసెంబరు 6న ప్రభుత్వ సహాయంతో బాబ్రీ మసీదు విధ్వంస'కరసేవ'లో విజయం సాధించాడు.

మతవిశ్వాసాల విషయంలో ప్రభుత్వాల ప్రమేయం ఉండకూడదు. కాని ఈ విశ్వాసాలు మానవ మారణకాండకు దారితీస్తుంటే ఈ మారణకాండ రాజకీయాధికారం కోసం ఒక కుట్ర పద్ధతిలో ఉధృత ఉన్మాద ప్రచారంగా, ఆచరణగా సాగుతుంటే మానవసేవయే మాధవసేవ కాదు గదా కనీసం మాధవసేవ మానవసేవగా కూడా కాకుండా 'కరసేవ' మొత్తం సమాజానికి ప్రమాదకర చర్యగా పరిణమిస్తే.... ఐతే అది కళ్యాణ్‌సింగ్‌దే కానక్కర్లేదు. వి.పి. సింగ్, పి.వి. నర్సింహారావులదే అయినా ఈ ప్రైవేట్ మతవిశ్వాసాలను "సెక్యూలర్" ప్రభుత్వాల నిర్మాణానికి, ఉనికికీ ఆధారం చేసుకున్నారు. భూస్వామ్య సామ్రాజ్యవాద, దళారీ, నిరంకుశ స్వభావమే కాదు. ఇవ్వాళ రాజ్యాంగ యంత్రానికి మెజారిటీ మత ఫాసిస్టు స్వభావం కూడా అబ్బింది. వర్ణాశ్రమ ధర్మంలోని అసమానత, హింస, బ్రాహ్మణ క్షత్రియేతర వర్ణాలపై అమలైన చరిత్ర ఇవ్వాళ బ్రాహ్మణ్యేతరులపై, హిందూయేత

రులపై రాజ్యం అమలు చేస్తున్నది. ఇది ప్రత్యక్షంగా విశ్వహిందూ పరిషత్, ఆర్ ఎస్ఎస్, భజరంగ్‌దళ్ వంటి నిషేధింపబడిన సంస్థల రూపంలో కనిపించవచ్చు. (బి.జె.పి, శివసేన వంటివి రాజకీయ పార్టీలు కనుక నిషేధించకూడదన్నాడు ప్రధాని. కనుక ఈ నిషేధింపబడ్డ మతశక్తులు నేరుగా ఈ మతరాజకీయ పార్టీల్లో చేరి పని చేయవచ్చన్నమాట. ఎల్.టి.టి.ఇ, పీపుల్స్‌వార్‌లను నిషేధించినపుడు ఈ సూక్ష్మ వివక్ష ప్రధానికి తోచలేదు.) పరోక్షంగా అన్ని పార్టీల్లోనూ ముఖ్యంగా కాంగ్రెసులో ఉన్నవి ఈ మతశక్తులే. ఇరవై ఏళ్ళ క్రితం హైదరాబాద్ ఉస్మానియా ఇంజనీరింగ్ కాలేజ్ ముందు జార్జిరెడ్డిని హత్య చేసిన హిందూ మతోన్మాదులు అప్పటి విద్యా మంత్రి పి.వి. నర్సింహారావు ఇంట్లో తలదాచుకున్నారు. చాతుర్వర్ణ ధర్మాన్ని అమోఘంగా ప్రశంసించి పునఃస్థాపించాలని కోరుకున్న విశ్వనాథ 'వేయిపడగలు' నవలను అనువదించిన మేధావి పి.వి. అంత గతంలో కెందుకూ ఆయన ప్రధాని అయ్యాక మరొక న్యాయనిపుణుడు అయ్యపురెడ్డి పాములపర్తిని వేయిపడగల స్వామిగా కీర్తించాడు. ఈ సహస్ర ఫణి రాజ్యం ఆయన సీట్ల పడగల మీద కాక (అవి వెయ్యికాదు గదా మెజారిటీ కూడా లేవు) బి.జె.పి. మద్దతు మీదనే నిలిచింది. అందుకే ఆయన 'రామజన్మభూమి' నిర్మాణం విషయంలో మహంతులతో, సాధువులతో, విశ్వహిందూ పరిషత్ నాయకులతో కూడా చర్చలు జరిపాడు. (మనం ఆయనకిచ్చిన మాట నిలబెట్టుకోలేదని వాజ్‌పేయ్ లోపాయకారిగా ఆవేదన చెందుతున్నాడు.)

ఇవన్నీ ప్రజల్ని ఒకపక్షం చేసి పాలకవర్గ పార్టీలు ఆడిన నాటకాలూ, చేసిన కుట్రలూ కాకపోతే మూడు సంవత్సరాలుగా పార్లమెంటు స్థాయిలోనూ, ప్రజల స్థాయిలోనూ (ప్రజలను అవచేతనకు గురిచేసే క్రమంలో) ప్రభుత్వ పరంగానూ, పార్లమెంటరీ పార్టీల పరంగానూ దేనికి అంకితమయ్యాయి అని ఆలోచిస్తే అది అయోధ్యలో రాముని గుడి కట్టడానికి- అంతకన్న బాబ్రీమసీదును కూల్చడానికి ముహూర్త నిర్ణయానికే అని తేల్తుంది.

"సెక్యులర్" ప్రభుత్వాధినేతలకు విశ్వాసాలు కాక హేతుబద్ధత, చట్టబద్ధత, ప్రజలపట్ల బాధ్యతా ఉండేకద ఇతరుల విశ్వాసాలను కోర్టులలోనయినా ప్రశ్నించడానికి వీలయ్యేది. వెంకట్రామన్, శంకర్ దయాళ్‌శర్మ వంటి రాష్ట్రపతులు పుట్టపర్తి సాయిబాబాకు సాష్టాంగ ప్రమాణం చేస్తారు. పి. వి. వంటి ప్రధాని పబ్లిక్‌గా సాయిబాబాకు పాదాభివందనం చేస్తాడు. భారత రాష్ట్రపతి, సుప్రీంకోర్టు

ప్రధాన న్యాయమూర్తి, లోక్‌సభ స్పీకర్, దేశప్రధాని, దేశీయ వ్యవహారాలమంత్రి, గవర్నర్లు, ముఖ్యమంత్రులు, న్యాయమూర్తులు- ఒకరేమిటి ప్రభుత్వ శాసన, పరిపాలన, న్యాయశాఖల అధిపతులంతా ఆయన పల్లకీ మోసే బోయీలవుతారు. ప్రజల సొమ్ముతో భద్రతా ఏర్పాట్లు చేసుకొని ఎగిరివచ్చి పబ్లిక్‌గా ఆయన కాళ్ళమీద పడతారు. వీళ్ళందరిముందూ మహిమచేసి పుట్టపర్తి సాయిబాబా ఒక భక్తుడు మొమెంటో కిందపెట్టి ఇచ్చిన బంగారు గొలుసును ఒడుపుగా తీసుకొని గాలిలోంచి సృష్టించినట్లు ఇంకొక భక్తునికి ప్రసాదిస్తాడు. సైన్స్‌ను మాత్రం మోసంచేయలేని ఈ కనికట్టు దాఖలాను ప్రధాని ఆజ్ఞలతో దూరదర్శన్ రికార్డులు లేకుండా చేస్తుంది. గాలిలోంచి బంగారుగొలుసును సాయిబాబా తీయగలడని విశ్వసించిన ప్రధాని రామభక్తుల స్వప్నాల్లో బాబ్రీమసీదునే రామజన్మ భూమిగా చూసారంటే నమ్మకుండా ఎలా ఉంటాడూ. (అందుకే రామజన్మభూమి వివాదం విషయంలో బి. జె. పి. ని విమర్శించిన సాయిబాబా "ధార్మిక అధికారాన్ని" బి. జె. పి. సవాల్ చేసింది.) తాను గాలినుంచి బంగారుగొలుసు కాదుకదా బూడిద కూడా సృష్టించలేనని సాయిబాబాకు తెల్సు. ఆ విషయం రాష్ట్రపతి, ప్రధాని, ప్రధాన న్యాయమూర్తి వంటి ప్రముఖులకూ తెల్సు. రాముడు కలలో వచ్చి వుండనక్కర్లేదనీ, వచ్చాడనే భ్రమతో లేదా సాకుతో ఏ భక్తుడైనా వింత కోరిక కోరితే అది నెరవేర్చదగిన వాస్తవం అనుకోనక్కర్లేదని మత సంస్థలకూ, పార్టీలకూ తెల్సు. ఎందుకంటే ఈ పార్టీలన్నీ, సంస్థలన్నీ విశ్వాసాలతో ఏర్పడినవి కావు. ప్రయోజనాలతో ఏర్పడినవి. ఈ స్వార్థ ప్రయోజనాలకు కావల్సింది తమకు విశ్వాసాలు ఉండడం కాదు, ప్రజల్లో విశ్వాసాలుండడం. ముఖ్యంగా ప్రజల్లో మూఢ విశ్వాసాలు పెంచి పోషించడం. అందుకే మహబూబ్‌నగర్ జిల్లానుంచి, అయోధ్యకు "కరసేవ"కు వెళ్ళి వచ్చిన ఒక భక్తుడు (ఒక పట్టణ మున్సిపాలిటీకి డిఫాక్టో ఛైర్మన్) "మేం బాబ్రీ మసీదును ముట్టుకోను కూడా లేదు. లక్షలాదిమంది రామ భక్తులం 'శియారామ్‌జీకి జై' అని భూనభోంతరాలు దద్దరిల్లేలా ధ్వనిస్తే మసీదు గుంబజులు వాటంతటవే కూలిపోయాయి." అని పత్రికల వాళ్ళతో నమ్మబలికాడు. ఓం మంత్రోచ్చాటనకున్న శక్తి, రామనామానికి, బాణానికీ ఉన్న శక్తి పురాణ విజ్ఞానఖని అయిన పి. వి. కి తెలియంది కాదు, వేల సంవత్సరాల భారతీయ

(మిగతా 145వ పేజీలో)

# అప్పాబరి నక్సల్బరి

—సునితికుమార్ ఘోష్

ఇరవై ఐదేళ్ళ క్రితం నక్సల్బరీ ప్రేరణగా పనిచేయకముందు కొంత కాలం నుండే భారతదేశం రాజకీయంగా అతలాకుతలంగా ఉండింది.

సామ్రాజ్యవాదం తాను పెంచి పోషించిన "ఏ విశ్వాసపూర్వక స్నేహ హస్తాలకు" 1947లో అధికారాన్ని బదలాయించిందో, ఆ సామ్రాజ్యవాద తాబేదార్ల పాలన భారత ప్రజలకు దీర్ఘకాలిక పీడలాగా వుంటూ వచ్చింది. అధికార బదలాయింపుకు ముందుగానీ, ఆ తర్వాత గానీ ఏ సామాజిక విప్లవం జరగలేదు. వలస పాలన పెంచి పోషించిన బడా దళారీ బూర్జువా, భూస్వామ్య వర్గాలు భారత దేశ పాలక వర్గాలైనాయి. ఒక దేశపు ఆర్థిక వ్యవస్థ తన ప్రయోజనాలకు లోబడి వుండడం, ఆ దేశపు వనరులను దోచుకోవటమే అంతిమ సారంగా వుండే సామ్రాజ్యవాద పాలన ఈ 'స్వేచ్ఛ', 'స్వాతంత్ర్యపు' కొత్త ముసుగులో కొన సాగింది. స్వతంత్ర, స్వయంపోషక, అభివృద్ధి చెందిన ఆర్థిక వ్యవస్థను నిర్మించే పేరుతో అవి సామ్రాజ్యవాద దేశాల పెట్టుబడి ప్రత్యక్ష పెట్టుబడి గానీ, రుణ పెట్టుబడి గానీ, సాంకేతిక పరిజ్ఞానంపై మరింత ఆధారపడేట్టు చేసింది. అభివృద్ధి, పారిశ్రామికీకరణ పేరుతో అవి దళారీ బూర్జువాజీ త్వరితగతిన పెరిగేందుకు తోడ్పడ్డాయి. భారత ఆర్థిక వ్యవస్థలో అన్ని రంగాలపై సామ్రాజ్యవాద పెట్టుబడి పట్టును పెంచాయి. దేశంలో దీర్ఘకాలంగా సలుపుతున్న రోగంలా వున్న భూస్వామ్య సంబంధాల్లో ఎటు వంటి మార్పు తీసుకురాలేదు. విదేశాంగ విధానంలో అలీన విధానం పేరుతో ఆంగ్లో అమెరికన్, సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదులిద్దరితో సంబంధం పెట్టుకునే పద్ధతి ననుసరించింది. అందరికీ సమానావకాశాలు, ప్రజాస్వామ్యం పేరుతో ప్రజల ప్రజాస్వామిక హక్కులను కాలరాచి, స్వయం ప్రతిపత్తి, స్వాతంత్ర్యాల కోసం విభిన్న భారత జాతులు చేస్తున్న పోరాటాలను అణచివేసే ప్రయత్నం చేసాయి. 1966 కల్లా పాలక వర్గాల ఈ విధానాలు ఒక రాజకీయ, ఆర్థిక సంక్షోభంగా పరిణతి చెందాయి.

ఈ సంవత్సరాలలో, ముఖ్యంగా 1951 నుండి భారత కమ్యూనిస్టు ఉద్య మానికి నాయకులుగా పోజులు కొడుతూ తిరిగినవాళ్ళు పాలక వర్గాల విధానాలను

అందంగా చిత్రీకరించడాన్ని, అన్నిరకాల సైద్ధాంతిక మోసంతో ప్రజలను అణచి వేతకు లోన్కు చేసి వుండడాన్ని తమ కర్తవ్యంగా స్వీకరించారు. వాళ్ళలో పీకల వరకు పాతుకుపోయిన అవకాశవాదం, కాంగ్రెసు నాయకులకు తోకలా వ్యవహరించ డంలో వాళ్ళ దీర్ఘకాల చరిత్ర, ప్రజలకు, మార్క్సిజం-లెనినిజానికి కాకుండా వాళ్ళకు నెహ్రూ, ఆయన కుటుంబీకుల పట్ల వున్న విధేయత, మావో ఆలోచనా విధానం పట్ల వాళ్ళకుండే నిరంతర ద్వేషం, శాంతియుత మార్గానికి వాళ్ళు అలవాటు పడిపోవటం, భారత-చైనా యుద్ధ కాలంలో వాళ్ళ సైద్ధాంతిక, రాజకీయ స్థితి, సిపియం, దాని సిద్ధాంతం, రాజకీయాల ఆవిర్భావం, ప్రజాపోరాటాలకు వాళ్ళ ద్రోహం, కాంగ్రెసు ప్రభావం తగ్గిపోతుంటే ప్రజా వ్యతిరేక పాలకులను రక్షించ డానికి కమ్యూనిస్టులుగా పిలవబడే ఉభయ వర్గాలు కాంగ్రెసేతర అవకాశవాద శక్తు లన్నింటితో పొత్తు కట్టడం, సిపియం ప్రధాన భాగస్వామిగా పశ్చిమ బెంగాల్‌లో మంత్రివర్గ ఏర్పాటు— ఇవన్నీ కమ్యూనిస్టు ఉద్యమంలోనే వున్న పాలకవర్గాల ఏజంట్లను గురించి కార్యకర్తల్లో భ్రమలు తొలగించాయి.

అంతర్జాతీయ రంగంలో జరుగుతున్న అద్భుత ఘటనలు- సోవియట్ నాయకుల నాయకత్వంలో వున్న ఆధునిక రివిజనిస్టులకు వ్యతిరేకంగా మావో నాయ కత్వంలో మార్క్సిస్టు-లెనినిస్టులు చేస్తున్న చారిత్రక పోరాటం, వియత్నాం తది తర ప్రాంతాల్లో జాతి విముక్తి పోరాటాల దిగ్విజయ యాత్ర, చైనాలో అప్పుడే ప్రారంభమవుతున్న మహత్తర శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం మొదలైనవి— భారతదేశంలో కొనసాగుతున్న సైద్ధాంతిక, రాజకీయ పోరాటానికి ఇతోధికంగా తోడ్పడినాయి. "ప్రతీఘాతుకానికి వ్యతిరేకంగా తిరగబడటం సరియైంది" అన్న మావో శంఖారావం ఇతర ప్రదేశాల్లోలానే భారతదేశంలో కూడా కమ్యూనిస్టు కార్యకర్తలను తట్టి లేపింది. అటువంటి సందర్భంలో భారతదేశంలో వసంత మేఘం గర్జించింది. దీర్ఘకాలంపాటు కమ్యూనిజంగా చలామణి అయిన అవకాశవాదానికి, విప్లవకర కమ్యూనిజానికి మధ్య స్పష్టమైన విభజన రేఖను గీయడానికి నక్సల్బరీ తోడ్పడింది.

ఎంత తక్కువదైనప్పటికీ ఎంత అపరిపక్వమైన దైనప్పటికీ మావో ఆలోచనా విధానాన్ని భారతదేశ పరిస్థితులకు అన్వయింపజేసిన ప్రయత్నం నక్సల్బరీ. వలసలు, అర్ధ వలసల్లో విప్లవానికి మావో రచించిన వ్యూహాన్ని మొట్ట

మొదటి సారిగా అమలుపరచ పూనుకున్నది తెలంగాణా విప్లవకారులు. అందులో బ్రహ్మాండమైన విజయం వరించింది. కానీ, సి. పి. ఐ. రివిజనిస్టు నాయకత్వం తెలంగాణా కార్యకర్తలకు, రైతాంగానికి ద్రోహం చేసి, నెహ్రూ సాయుధ కిరాయి మూకలకు ఆయుధాలు అప్పగించేలా బలవంతం చేసింది. అంతులేని రివిజనిస్టు మాటలతో తెలంగాణా రాజకీయాలను కలుషితం చేసే ప్రయత్నం చేశారు.

ఇతర అభివృద్ధి నిరోధక శక్తులతో కలిసి 'యునైటెడ్ ఫ్రంట్' ఏర్పాటు చేసి బెంగాల్‌లో మంత్రి వర్గాన్ని ఏర్పాటుచేసిన ఉభయ రివిజనిస్టు వర్గాలైన సి. పి. ఐ, సి. పి. యం. 1967లో నక్సల్బరీ రైతాంగ తిరుగుబాటును అణచడానికి సాయుధ బలగాలను పంపించాయి. ఆ తిరుగుబాటునైతే వాళ్ళు తాత్కాలికంగా అణచగలిగారు గానీ, నక్సల్బరీ రాజకీయాలను – సాయుధ వ్యవసాయిక విప్లవ రాజకీయాలను — అణచలేక పోయారు. అది విస్తరించి, విప్లవకర కమ్యూనిజంలో విశ్వాసమున్న వాళ్ళంతా భారతదేశంలోని విభిన్న భాగాల నుండి నక్సల్బరీ విప్లవకారుల వెనుక సమీకరింపబడ్డారు. వాళ్ళంతా చేతులు కలిపి, సంఘటితమై అభివృద్ధి నిరోధక రివిజనిస్టు ఏజెంట్ల అవకాశవాద సాంప్రదాయం నుండి తెగతెంపులు చేసుకున్నారు.

మావో ఆలోచనా విధానపు మార్గదర్శకత్వంలో చారుమజుందారు నక్సల్బరీ రైతాంగానికి, కార్యకర్తలకు నాయకత్వం వహించాడు. అభివృద్ధి నిరోధకత్వానికి, రివిజనిజానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయమని పిలుపునిచ్చింది చారుమజుందారే. డార్జిలింగ్ జిల్లా, సిలిగురి సబ్-డివిజన్‌కు చెందిన అత్యధిక కార్యకర్తలు అతని పిలుపుకు ప్రతిస్పందించి, మావో బోధనలను అమలు పరచాలని ప్రయత్నం చేశారు. దాని ఫలితమే నక్సల్బరీ.

నక్సల్బరీ తరువాత భారత కమ్యూనిస్టు ఉద్యమం మునుపటివలెనే లేదు. వలసలు, అర్ధ వలసల్లో విప్లవం గురించిన మావో బోధనలు విప్లవ కార్యకర్తల చైతన్యంలోకి బాగా ఇంకిపోయాయి. 1962 భారత-చైనా యుద్ధకాలం నుండీ, మరీ ముఖ్యంగా సి. పి. యం. 1964లో ఏర్పడినప్పటి నుండి సైద్ధాంతిక విషయాల గురించి, భారత విప్లవ వ్యూహం గురించి తీవ్ర వాదోపవాదాలు, చర్చలు జరిగాయి. కానీ ఈ చర్చలన్నీ రాజకీయ కార్యకర్తల గ్రూపులకు మాత్రమే పరిమితమైనాయి.

మావోయిస్టు వ్యూహాన్ని ఎత్తిపట్టడమే కాకుండా, ఆచరణలో పెట్టడానికి ప్రయత్నం చేసింది మాత్రం చారుమజుందారు. భారతదేశంలో మొట్టమొదటిసారిగా ఆయన మావో ఆలోచనా విధానాన్ని ప్రజల్లో విస్తృతంగా వ్యాపింప జేయవలసిన ప్రాముఖ్యాన్ని నొక్కి చెప్పాడు. మావో బోధనలను అనుసరించకుండా భారత దేశంలో విప్లవమే లేదని భారత విప్లవ కమ్యూనిస్టులను చైతన్యపరచాడు.

భారత విప్లవ వ్యూహానికి సంబంధించిన కొన్ని ప్రధాన సమస్యలను నక్సల్బరీ పరిష్కరించింది. ఇతర విషయాలతోపాటుగా అది, "నూతన సమాజాన్ని గర్భంలో ధరించి ఉన్న పాత సమాజానికి బలప్రయోగం మంత్రసాని" వంటిదనే మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఎత్తిపట్టింది. శాంతియుత, పార్లమెంటరీ పంథాను, పార్లమెంటరీయేతర ఆర్థిక పోరాటాలతో కలిసిన పార్లమెంటరిజాన్ని అది తిరస్కరించింది. 'శాంతియుత పరివర్తన' రివిజనిస్టు సిద్ధాంతం కమ్యూనిస్టు ఉద్యమాన్ని దీర్ఘకాలం పాటు కప్పిపుచ్చి, దానిపై అదుపు సంపాదించిన సుదీర్ఘ మౌనాన్ని బద్దలు చేసింది. రెండవది, మావో ఆలోచన మార్గదర్శిగా వున్న దాని నాయకుడు (చారు మజుందార్-అను.) భారత విప్లవం దీర్ఘకాలిక విప్లవమని నొక్కి చెప్పాడు. అసమాన ఆర్థిక, సామాజిక, రాజకీయ అభివృద్ధి కారణంగా పట్టణ తిరుగుబాట్ల ద్వారా గానీ, కార్మికుల, రైతుల ఏక కాల తిరుగుబాటు ఉండే దేశవ్యాపిత తిరుగుబాటు ద్వారాగానీ అధికారం చేపట్టటం అసాధ్యం. దీర్ఘకాలిక ప్రజాయుద్ధం ద్వారా మాత్రమే- ఇతర ప్రాంతాల్లో కంటే వస్తుగత, స్వీయాత్మక పరిస్థితులు అనుకూలంగా వున్న పల్లె ప్రాంతాల్లో మొదట విముక్తి ప్రాంతాలను సృష్టించి, వాటిని మెల్లగా విస్తరించి, దేశవ్యాపితంగా అధికారం చేజిక్కించుకోవటం ద్వారా మాత్రమే-అధికారం చేపట్టటం సాధ్యం. మూడవది, వ్యవసాయిక విప్లవం ప్రధాన సారంగా వుండే భారత విప్లవంలో రైతాంగ పాత్ర యొక్క ప్రాముఖ్యాన్ని ఆయన నొక్కి చెప్పాడు. కార్మిక వర్గ నాయకత్వంలో రైతాంగం విప్లవం యొక్క ప్రధాన చోదక శక్తిగా వుంటుందని ఆయన సూచించాడు. పీడిత ప్రజలతో మమేకమై పెటీ బూర్జువా బుద్ధి జీవి వర్గం విప్లవకర పాత్ర నిర్వహించగలదని ఆయన నొక్కి చెప్పాడు.

ఇవన్నీ ఈనాడు భారతదేశంలో విప్లవ కమ్యూనిజంలో అంతర్భాగ మయ్యాయి. అప్పుడప్పుడూ విప్లవ కమ్యూనిస్టు శిబిరంలోనే కొత్త తరహా రివిజ

నిస్టులు పుడుతున్నారు, ఇకముందు కూడా పుట్టవచ్చు. విప్లవ కమ్యూనిజం వాటికి వ్యతిరేకంగా ప్రతి దశలోనూ పోరాడటం ద్వారా మాత్రమే ముందుకు కొనసాగు తుంది కానీ, వెనుతిరగటమన్నది మాత్రం ఇక ఎన్నడూ ఉండదు. తెలంగాణా తర్వాత విప్లవ పోరాట కొనసాగింపులో విరామం ఉంది, కానీ నక్సల్బరీ తర్వాత వెనుకంజ వేయటం వుంది, విరామం మాత్రం లేదు. జెండా దించడం మాత్రం లేదు. పోరాటం ఒక ప్రాంతంలో వెనుకంజ వేస్తే, మరోచోట రాజుకుంది.

నక్సల్బరీ, శ్రీకాకుళం, బీర్‌భూం తదితర పోరాట ప్రాంత యోధులు తెలంగాణా నేర్పగలిగే పాఠాలు నేర్చుకోలేకపోయారు. భారత కమ్యూనిస్టు ఉద్యమ రివిజనిస్టు నాయకత్వం సాహసిక తెలంగాణా పోరాట యోధులకు మాత్రమే ద్రోహం చేయలేదు. తెలంగాణాను ఒక పాలిపోయిన స్మృతిగా చేసేందుకు తీవ్రయత్నం చేసారు. డెబ్బైలలో తెలంగాణా పోరాట జ్యోతిని నక్సల్బరీ, శ్రీకాకుళాల్లో తిరిగి వెలిగించిన తరువాతనే సుందరయ్య, రాజేశ్వరరావు వంటి రివిజనిష్టాగ్రేసరులు తెలంగాణా గురించి రాసారు. అదీ కూడా ఆ మహత్తర పోరాట చరిత్రను వక్రీక రించేందుకే. 1948లో నెహ్రూ పంపించిన యూనిఫాం హంతకులు తెలంగాణాలోకి ప్రవేశించిన తరువాత కూడా సాయుధ ప్రతిఘటనను కొనసాగించటం తప్పని తేల్చే సారు. అయితే, ప్రాముఖ్యత కల్గిన అంశం ఏమిటంటే, నెహ్రూ మిత్రుడు, అమెరికా రాయబారి అయిన ఛెస్టర్ బౌల్స్, చైనాలో అమెరికా ఓడిపోయిన తర్వాత తెలివి తెచ్చుకుని, తన రాయబారి నివేదికలో "సాయుధ శకటాల నిరంతర పహారా, కాన్‌సంట్రేషన్ శిబిరాలు, కొద్ది మైళ్ళకో పోలీసు ఔట్ పోస్టు" ఉన్నప్పటికీ తెలంగాణా రైతాంగపు గెరిల్లా పోరాటాన్ని అణచలేకపోయింది" అని రాసాడు. కమ్యూనిస్టులుగా పోజులు పెట్టిన తీవ్ర రివిజనిస్టులు అర్ధవలస దేశంలో వున్న పార్లమెంటు పందుల దొడ్డిలోకి ప్రవేశించేందుకు, 1951 అక్టోబరులో బేషరతుగా దానిని ఉపసంహరించుకొని, ఆయుధాలన్నీ ఒప్పగించి, విప్లవ కార్యక ర్తలను, ప్రజలను శత్రువు దయాదాక్షిణ్యాలకు వదిలివేసిన తరవాతే ఆ పోరాటం ముగిసింది. తెలంగాణా మార్గం మావో ఆలోచనా విధానంతో వెలుగొందిన మార్గం. విజయం సాధించడానికి వలస, అర్ధవలస దేశాల్లో అనుసరించవలసిన మార్గం — అది వదిలి వేయబడింది.

II

నక్సల్బరీ తిరుగుబాటు జరిగిన వెంటనే, దేశంలోని విభిన్న ప్రాంతాల కామ్రేడ్లు – పక్కనే వున్న బీహార్, ఒరిస్సాల నుండి మొదలుకొని, తమిళనాడు, కేరళ దాకా - అందరూ సిలిగురిలో చారు మజుందారును, కలకత్తాలో సుశీతల్ రాయ్ చౌదరి తదితర కామ్రేడ్స్‌ను కలవటం జరిగింది.

1967 నవంబర్ 11న కలకత్తాలోని షహీద్ మినార్ మైదాన్‌లో 'నక్సల్బరీ, కృషక్ సంగ్రామ్ సహాయక కమిటీ' ఆధ్వర్యంలో ప్రజా ప్రదర్శన జరిగింది. ఆఖరులో మాట్లాడిన చారు మజుందార్ కొద్ది మాటలు మాత్రమే మాట్లాడాడు. ఆ తరువాతి రెండు రోజుల్లో అంటే 12, 13 నవంబర్‌లో ఏడు రాష్ట్రాల కామ్రేడ్లు- తమిళనాడు, కేరళ, ఉత్తరప్రదేశ్, బీహార్, కర్నాటక, ఒరిస్సా, బెంగాల్- కలిసి "సిపియం లోని విప్లవకారుల అఖిలభారత సమన్వయ కమిటీ"ని (ఎఐసిసిఆర్ ఇన్ సిపిఐఎం) ఏర్పరచారు. ఆ తర్వాత 1968 మేలో తదుపరి సమావేశం జరిగినపుడు దాని పేరు "అఖిలభారత కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ కేంద్రం"గా (ఎఐసిసిసిఆర్) మార్చటం జరిగింది.

పశ్చిమ బెంగాల్ కమిటీ కన్వీనర్‌గా వున్న సుశీతల్ రాయ్ చౌదరి అఖిల భారత కమిటీకి కూడా కన్వీనర్ అయ్యాడు.

ఎఐసిసిసిఆర్ ఏర్పాటు ఒక చారిత్రకమైన అడుగు. నిజమైన కమ్యూనిస్టు పార్టీని నిర్మించడానికి అవసరమైన అడుగు. దాని మొదటి ప్రకటన చెప్పినట్టుగా, అటువంటి పార్టీకి పునాదులు వేయటం దాని ఉద్దేశ్యం. మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానాన్ని ప్రచారం చేయటం, ఈ ప్రాతిపదికపై కమ్యూనిస్టు విప్లవకారులందరినీ ఐక్యం చేయటం, రివిజనిజానికి వ్యతిరేకంగా రాజీలేని పోరాటం నలపటం, రైతులు, కార్మికులు తదితర పీడిత ప్రజల విప్లవ పోరాటాలను అభివృద్ధి పరచి సమన్వయం చేయటం, సరియైన విప్లవ కార్యక్రమాన్ని, ఎత్తుగడల పంథాను రూపొందించటం దాని ప్రధాన కర్తవ్యాలు.

ఎఐసిసిసిఆర్ చారిత్రక ప్రాముఖ్యత వున్న కొన్ని సూత్రీకరణలు చేసింది. ఇతర సోదర మార్క్సిస్టు–లెనినిస్టు పార్టీల కంటే ముందుగా, అది అధునిక రివిజనిస్టుల నాయకత్వంలోని సోవియట్ యూనియన్‌ను 1968 మే ప్రకటనలో

"నయా వలసాధిపతి"గా వర్ణించింది. "అమెరికా సామ్రాజ్యవాదం, సోవియట్ రివిజనిజం, భారత బడా భూస్వాములు, దళారీ బ్యూరోక్రటిక్ బూర్జువాజీ భారత ప్రజల ప్రధాన శత్రువులు"—అని ప్రకటించింది. అదే 1968 మే సమావేశంలోనే "ప్రస్తుత యుగంలో బూర్జువా పార్లమెంటరీ సంస్థలు భారతదేశం వంటి అర్థవలస-అర్థ భూస్వామ్య దేశాల్లో విప్లవానికి ఒక అడ్డంకిగా తయారయ్యాయని ప్రకటించింది. రివిజనిస్టు, అభివృద్ధి నిరోధకులు పార్లమెంటరీ పంథాను విప్లవ పంథాకు వ్యతిరేకంగా తేజూస్తున్నారని చెప్పి, 'ఎన్నికల బహిష్కరణ'కు పిలుపు నిచ్చింది.

దేశంలోని వివిధ భాగాల్లో వున్న కమ్యూనిస్టు విప్లవకారులను ఐక్య పరచటానికి ఎఐసిసిసిఆర్ ప్రయత్నించి, చాలామేరకు విజయవంతమయ్యింది. బీహార్, తమిళనాడు, కేరళ, ఉత్తరప్రదేశ్, ఒరిస్సా, కర్నాటక, పంజాబ్, అస్సాం, ఢిల్లీ, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, త్రిపుర మొదలైన రాష్ట్రాల్లో రాష్ట్ర సమన్వయ కమిటీలు ఏర్పడ్డాయి. బెంగాల్ రాష్ట్ర సమన్వయ కమిటీకి జిల్లా స్థాయి, ఇంకా కింది స్థాయి కమిటీలు ఏర్పడ్డాయి. కొన్ని గ్రూపుల కమ్యూనిస్టు విప్లవకారులు ఎఐసిసిసిఆర్ వెలుపలే వుండి విడిగానే పనిచేశారనేది కూడా వాస్తవం. బెంగాల్‌లో కమ్యూనిస్టు విప్లవకారులలోని ఒక ముఖ్యమైన గ్రూపు ఎఐసిసిసిఆర్‌లో గానీ ఆ తర్వాత ఏర్పడిన సిపిఐ (యం ఎల్)లో గానీ కలవలేదు.

నక్సల్బరీ ఒక ప్రతీకగా వున్న రాజకీయాలు భారతదేశంలోని వివిధ ప్రాంతాలకు వ్యాపించాయి. ఎఐసిసిసిఆర్ పతాకం కింద రైతాంగ పోరాటాలు నిర్వహించబడ్డాయి— బీహార్, ఉత్తరప్రదేశ్, తమిళనాడు, కేరళ, అస్సాం, పంజాబ్, ఆంధ్రప్రదేశ్, బెంగాల్, త్రిపుర తదితర రాష్ట్రాల్లో రైతాంగ పోరాటాలు ఎఐసిసిసిఆర్ పతాకం కింద నిర్వహించబడ్డాయి. కొన్ని రైతాంగ పోరాటాలకు ఇతర గ్రూపులు నాయకత్వం వహించాయి. ఛోటా నాగపూర్‌లో వలె మరికొన్ని చోట్ల నక్సల్బరీ ప్రభావంతో యాదృచ్ఛికంగా పోరాటాలు పెల్లుబికాయి. నక్సల్బరీ ఎన్నో పారిశ్రామిక కేంద్రాల్లో కార్మికులను ఉత్తేజపరిచింది. బెంగాల్‌లోని కలకత్తా తదితర పట్టణాలెన్నోచోట్ల కార్మికులు ఎఐసిసిసిఆర్ పతాకం కింద కదిలారు. అదే విధంగా పదుల వేల సంఖ్యలో యువకులు, విద్యార్థులు-రైతాంగం, కార్మికులతో మమేకమయ్యేందుకు ఉత్సాహంతో కదిలారు.

సిపియం లో తిరుగుబాటు రగులుకోసాగింది. ఉత్తరప్రదేశ్‌లోని సిపియం రాష్ట్ర కమిటీ సభ్యుల్లో అత్యధికులు సిపియంతో తెగతెంపులు చేసుకున్నారు. అదే విధంగా ఆంధ్రప్రదేశ్‌లో కూడా రాష్ట్ర కమిటీ, ఇతర కమిటీ సభ్యుల్లో అత్యధికులు కూడా సిపియంతో సంబంధాలు తెంపుకున్నారు. నక్సల్బరీ సిపియం రివిజనిస్టు నాయకత్వపు ముసుగు చించివేయగానే, సిపియంకు ఆ రాష్ట్ర కమిటీగా పనిచేస్తున్న జమ్మూ-కాశ్మీరు ప్రజాస్వామిక కాన్ఫరెన్సు సిపియం నుండి విడిపోయింది. కేరళ, తదితర రాష్ట్రాల్లో కూడా ఎందరో కామ్రేడ్లు సిపియం నాయకత్వాన్ని తిరస్కరించారు. అటువంటి ఎందరో కామ్రేడ్లు ఎఐసిసిసిఆర్ యూనిట్లను ఏర్పరచటం గానీ, యూనిట్లలో చేరటం గానీ చేశారు.

శ్రీకాకుళంలో అభివృద్ధి చెందిన సాయుధ రైతాంగ పోరాటం 1969 ప్రారంభంలో ఒక ఉన్నత దశకు- గెరిల్లా పోరాట దశకు- చేరుకుంది. అప్పటికే ప్రారంభమైన రైతులు, కార్మికులు తదితర పీడిత ప్రజల, విద్యార్థి, యువజనుల అసంఖ్యాక పోరాటాలను సంఘటితపరచి, వాటికి నాయకత్వం వహించేందుకు పార్టీని ఏర్పాటు చేయవలసిన సమయం ఆసన్నమైంది. 1969 ఫిబ్రవరిలో సమావేశమైన ఎఐసిసిసిఆర్ పార్టీని ఏర్పాటు చేయాలని ఏకగ్రీవంగా నిర్ణయించింది.

1969 ఏప్రిల్‌లో ఎఐసిసిసిఆర్ మళ్ళీ కొద్ది రోజుల పాటు సమావేశమయ్యింది. లెనిన్ శత జయంతి ఐన ఏప్రిల్ 22న ఒక రాజకీయ, నిర్మాణ తీర్మానాన్ననుసరించి సిపిఐ (ఎం ఎల్) ఏర్పాటు జరిగింది. చారుమజుందార్ కార్యదర్శిగా ఒక సెంట్రల్ ఆర్గనైజింగ్ కమిటీ ఏర్పడింది. ఈ నిర్ణయాలు ఏకగ్రీవంగా తీసుకున్న తరువాత ఎఐసిసిసిఆర్ తనను తాను రద్దు చేసుకుంది.

సిపిఐ (ఎం ఎల్) ఆవిర్భావంతో నూతన ఆశ, ఉత్సాహాల వెల్లువ వ్యాపించింది. మరో కొత్త పోరాట వెల్లువ, మరీ ముఖ్యంగా సాయుధ రైతాంగ పోరాటాల వెల్లువ విరిసింది.

## III

లెనిన్ నాయకత్వంలోని మహత్తర అక్టోబరు విప్లవంతో ఏర్పడిన సోవియట్ యూనియన్ ఈ మధ్యనే విచ్ఛిన్నమైపోయింది. ప్రపంచ వ్యాపితంగా

వున్న అభివృద్ధి నిరోధక వర్గాలు, వాళ్ళ కిరాయి రచయితలు సంతోషంతో తల మునకలై ఈ సంఘటనను సోషలిజపు చావుగా వర్ణిస్తున్నారు. ప్రజల జ్ఞాపక శక్తి చాలా తక్కువని వాళ్ళు ఆశిస్తున్నారు. కానీ వాళ్ళు పొరబడుతున్నారు. చాలా కాలం క్రిందటే, అరవైలలోనే, మావో నాయకత్వంలోని చైనా కమ్యూనిస్టు పార్టీ, ప్రపంచ వ్యాపితంగా వున్న విప్లవ కమ్యూనిస్టులందరూ సోవియట్ యూనియన్‌లో "తిరోగమనం" జరిగిందనీ, ఆ దేశంలో పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరింపబడిందనీ ప్రకటించారని ప్రజలకు ఇంకా గుర్తే. ముందే అన్నట్టుగా, ఎఐసిసిసిఆర్ 1968 మే ప్రకటనలోనే బూర్జువా పాలనలో వున్న సోవియట్ యూనియన్‌ను పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద దేశంగా, భారత ప్రజల ప్రధాన శత్రువుల్లో ఒకటిగా ప్రకటించింది. సోవియట్ యూనియన్‌లో, తూర్పు యూరప్ దేశాల్లో సోషలిజపు ఓటమి దశాబ్దాల క్రితమే జరిగింది గానీ, అది నిన్న, మొన్నటి ఘటన కాదు.

ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ నుండి సోవియట్ రష్యా విడిపోయినప్పుడు ప్రపంచ వ్యాపితంగా పీడిత ప్రజలందరూ దానిని ఒక నూతన యుగానికి నాందిగా కీర్తించారు. రష్యా కార్మికులు, ఇతర శ్రామికులు అద్భుత సాహసాలు ప్రదర్శించి స్థానిక విప్లవ ప్రతీఘాతకులను, నూతన శ్రామిక రాజ్యాన్ని పుట్టుకతోనే గొంతు నులమాలని చూసిన విదేశీ సామ్రాజ్యవాద దేశాలను, ముఖ్యంగా, బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా, జపానులను ఓడించింది. ఈ పోరాటంలో, సామ్రాజ్యవాద దేశాల్లోని శ్రామికులు "రష్యాపై చేయి వేయొద్దు" అనే నినాదంతో విప్లవ ప్రజానీకానికి అమూల్యమైన మద్దతును అందించారు. శత్రు దేశాలతో చుట్టుముట్టబడి వున్నప్పటికీ, రష్యాలోని శ్రామికులు తమపై తామే ఆధారపడి, ఇరవయ్యవ, ముప్పయ్యవ దశాబ్దాలలో అద్భుత నిర్మాణ పాటవాలు ప్రదర్శించి ఒక వెనుకబడిన దేశాన్ని, ఎంతో పారి శ్రామికీకరణ చెందిన దేశంగా మార్చారు. పెట్టుబడిదారీ ప్రపంచంలో విస్తృతంగా ఉత్పత్తి శక్తులను నాశనం చేసి, తనతోపాటు పెద్ద ఎత్తున నిరుద్యోగం, ఆకలిని తీసుకొచ్చిన 1929-33 వినాశకర ఆర్థిక మాంద్యపు భయంకర ఫలితాలనుండి సోవియట్ యూనియన్ దూరంగా వుండటమే కాక, విద్య, సంస్కృతితో సహా విభిన్న రంగాల్లో అంతకు ముందెన్నడూ, ఎక్కడా ఎరుగని అద్భుత ప్రగతిని సాధించింది. రెండవ ప్రపంచ యుద్ధపు తీరుతెన్నులు మార్చివేయటంలో అంతులేని త్యాగాలను వరించి అద్భుత ధైర్య సాహసాలను ప్రదర్శించింది కూడా సోవియట్

ప్రజలే. ప్రపంచాన్ని జర్మనీ ఫాసిజాన్నుండి రక్షించిన ప్రపంచ శక్తుల్లో వాళ్ళే ప్రధాన అంగం.

అయితే వాస్తవ మేమిటంటే, సోవియట్ యూనియన్‌లో సోషలిజం సుసంఘటితం కాలేదు. "ఉత్పత్తి సాధనాల యాజమాన్యం, ఉత్పత్తి క్రమం, పంపిణీ వ్యవస్థలో ప్రజల మధ్యనున్న సంబంధాలు కలిసి ఉత్పత్తి సంబంధాలు"—అని మావో అన్నాడు. ఉత్పత్తి సాధనాల యాజమాన్యం ప్రజలందరిదీ, సమష్టి బృందాలదీ కావటం సోషలిజానికి పునాది. కానీ, సోషలిజం సంఘటితం కావాలంటే - ఉత్పత్తి క్రమంలో, పంపిణీ వ్యవస్థలో ప్రజలమధ్య సంబంధాల్లో విప్లవాన్ని కార్మిక వర్గ నాయకత్వంలో తప్పకుండా కొనసాగించాలి. జాతీయ, అంతర్జాతీయ కారణాలెన్నింటి వల్లనో సోవియట్ యూనియన్‌లో అటువంటి విప్లవం జరుగలేదు. ప్రజలను మోసగించడానికి 'కమ్యూనిస్టు'నని తనను తాను పిలుచుకున్న నూతన బ్యూరోక్రటిక్ బూర్జువాజీ మెల్లమెల్లగా అధికారాన్ని పెంచు కొని, స్టాలిన్ మరణానంతరం పూర్తిగా అధికారం చేజిక్కించుకుంది. ఉత్పత్తి సాధనాల ప్రభుత్వ యాజమాన్యపు బూటకత్వాన్ని పైకి అలాగే కొనసాగిస్తూనే, పార్టీపై, ప్రభుత్వ విభాగాలపై ఫాక్టరీలు తదితర ఉత్పత్తి యూనిట్లపై ప్రాబల్యం సంపాదించిన బ్యూరోక్రటిక్ బూర్జువాజీ ప్రభుత్వ ఆస్తిని తమ సంపద పెంపు కోసం అదుపు చేసారు. సోవియట్ పార్టీ ఒక ఫాసిస్టు పార్టీగా, సోవియట్ రాజ్యం ఒక ఫాసిస్టు రాజ్యంగా అవతరించాయి. సోషలిజపు దశను పూర్తి చేసుకున్నామని అదే పనిగా వాగుతూ కృశ్చేవ్‌లూ, బ్రెజ్నేవ్‌లు, వాళ్ళ వారసులు సోవియట్ ప్రజ లను, ఇతర దేశాల ప్రజలను కూడా నిర్దాక్షిణ్యంగా దోపిడీ చేసి వాళ్ళ ద్వేషాన్ని సంపాదించుకున్నారు. అంతర్గత వైరుధ్యాల పెనుభారంతో ఇప్పుడు సోషలిస్టు బూటకం కూలిపోయింది. బ్యూరోక్రటిక్ బూర్జువాజీలో ఒక పెద్ద వర్గం, నూతన పెట్టుబడిదారీ వర్గాలు విదేశీ సామ్రాజ్యవాద పెట్టుబడితో మిలాఖత్తై సంపదలు పెంచు కొని, సోషలిజపు ముసుగును కూడా లాగివేసి, ఏర్పరచిన నిబంధనలను తొలగించివేసి, విదేశీ సామ్రాజ్యవాద పెట్టుబడి, సాంకేతిక పరిజ్ఞానంపై సంపూర్ణంగా ఆధారపడిన పూర్తిస్థాయి పెట్టుబడిదారీ విధానాన్ని కోరుతున్నారు. ఫాసిస్టులు-ఎల్సిన్‌లు - తమ బోర్డులను మార్చివేసారు ఇప్పుడు తమను తాము కమ్యూనిస్టులమని పిలుచుకోవటం లేదు. ఈ రోజు వాళ్ళ రాజకీయ, ఆర్థిక వ్యవస్థను సంస్కరించే 'ప్రజాస్వామిక

వాదులుగా', 'ఉదారవాదులుగా' ముసుగులు తగిలించుకున్నారు. తమ తమ ప్రాంతాల్లో పూర్తి అదుపును కలిగి వుండేందు కోసం వివిధ జాతుల బూర్జువాజీ సోవియట్ యూనియన్‌ను విడగొట్టి తమ బోగీలను విదేశీ సామ్రాజ్యవాద పెట్టుబడీ తారకు తగిలించారు. కమ్యూనిస్టు బూర్జువాజీ అదుపులో వున్న "కేంద్రీయ ప్రణాళికాబద్ధ ఆర్థిక వ్యవస్థ" నుండి సాంప్రదాయ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థకు ఉన్న మార్గంలో శవాలు వెదజల్లబడి ఉన్నాయి. ఈ మార్పు అంటే ప్రజలలో గందరగోళం- నింగి నంటే ధరలు, నిరుద్యోగం, ఆకలి, చలి. సోవియట్ సామ్రాజ్యానికి చెందిన తూర్పు యూరప్ ప్రజలకు కూడా అదే గతి పట్టింది.

చైనాలో కూడా "తిరోగమనం" జరిగి పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరింపబడింది. 1949 లో విముక్తి జరిగినప్పటి నుండి, మరీ ముఖ్యంగా 1957 నుండి, చైనా కమ్యూనిస్టు పార్టీలో మావో నాయకత్వంలోని కార్మిక వర్గ విప్లవకారులకు, పెట్టుబడి దారీయులకు మధ్య నిరంతర వర్గపోరాటం జరుగుతూనే వుంది. బయట వున్న వర్గపోరాటం చైనా కమ్యూనిస్టు పార్టీలో కూడా ప్రతిఫలించింది. ఎందరో పార్టీ నాయకులు దృఢంగా వ్యతిరేకించినప్పటికీ, నిరంతర విప్లవ సిద్ధాంతాన్ని ఎత్తిపట్టిన మావో ఉత్పత్తి క్రమంలో, పంపిణీ వ్యవస్థలో, విద్య, సంస్కృతి వంటి ఉపరితల రంగాల్లో కూడా సంబంధాలను విప్లవీకరించే ప్రయత్నం చేసాడు. కమ్యూన్ ఉద్యమం, సోషలిస్టు విద్యా ఉద్యమం, ఆన్‌షన్ ఛార్టరు, మే 7 ఆదేశం మొదలైనవన్నీ మూడు తేడాలను - శారీరక, మానసిక శ్రమల మధ్య అంతరం తగ్గిస్తూ క్రమంగా తొలగించటం కోసం ఉద్దేశింపబడినవి. మావో ప్రారంభించిన మహత్తర శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవం పెట్టుబడిదారీ మార్గం పట్టిన పార్టీ నాయకులను వ్యతిరేకించడం కోసం మాత్రమే కాక చైనా ప్రజల ప్రాపంచిక దృక్పథాన్ని మలచి పెట్టుబడి పునరుద్ధరణను నిరోధించి సోషలిజాన్ని సంఘటిత పరచడం కోసం ఉద్దేశింపబడింది. ఆయన "తిరోగమనాల" గురించి హెచ్చరించి లక్ష్యాన్ని చేరేందు కోసం ఎన్నో సాంస్కృతిక విప్లవాలు, ఎన్నో శతాబ్దాల కాలం అవసరమౌతుందని పలుమార్లు హెచ్చరించాడు. "సరియైన భావాలు ఎక్కడనుండి వస్తాయి?" (1963) అనే వ్యాసంలో మావో సామాజిక పోరాటంలో ఒక్కొక్కసారి అభివృద్ధికర వర్గాన్ని ప్రతిబింబించే శక్తులు ఓటమిని చవిచూడవలసి వస్తుంది. కాని, అది వాళ్ళ భావాలు తప్పుడువి అయినందువల్ల కాదు. పోరాటంలో బలాబలాల

సమతూకంలో ఆ సమయంలో అభివృద్ధి నిరోధక శక్తులంత శక్తివంతంగా ఉండక పోవడం వల్ల తాత్కాలికంగా ఓడిపోయినా త్వరలోనే విజయం సాధించడం తథ్యం".

"ప్రపంచ ఘటనల గురించి దూరదృష్టి కల" (మావో మాటల్లో చెప్పాలంటే) విప్లవకారులే, అపారమైన త్యాగాలు, ఎన్నో విజయాలు ఉన్నప్పటికీ సోషలిజాన్ని నిర్మించడంలో పొందిన వైఫల్యాలు, వెనుకంజల నుండి పాఠాలు నేర్చుకుని భవిష్యత్తులో అటువంటి వైఫల్యాలను పొందకుండా ఉండగలరు.

ఈ రోజు దేశీయ, విదేశీయ పెట్టుబడిదారీ మొసళ్ళు పెట్టుబడిదారీ వ్యవస్థ శాశ్వతత్వాన్ని, దాని విజయాన్ని, లాభాలను, సంతోషాలను గురించి ఢంకా మోగిస్తున్నాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రజలకు ఏ సంతోషాన్ని, లాభాన్ని ఇవ్వగలవు ? నిరుద్యోగం, ఆకలి, ప్రపంచ ప్రజల్లో అత్యధికులకు దిగజారిన అమానుష అస్తిత్వం- ఈ విధానం ఉన్నంత వరకు అంతులేని మూకుమ్మడి హత్యలు. భారత దేశంలో భారత పాలక వర్గాలు, వారి రాజకీయ తాబేదార్లు 1947 నుండి అనుసరించిన విదేశీ పెట్టుబడిపై ఆధారపడే మార్గం కోట్లాదిమందికి పని లేక, నిత్యావసర వస్తువుల ధరలు పైపైకి ఎగబాకుతూ, మునుపెన్నటికంటే దారిద్ర్యం, ఆకలి విస్తృతమైన పరిస్థితిలోకి ప్రజలను దించింది. భారతదేశ సార్వభౌమత్వం ఎల్లప్పుడూ ఒక మిథ్యగానే వుంది. ప్రజల ప్రధాన ప్రయోజనాలు దెబ్బతినేలా సామ్రాజ్యవాదులు ప్రత్యక్షంగా కానీ, ద్రవ్యనిధి సంస్థ, ప్రపంచ బ్యాంకుల ద్వారాగానీ చెప్పే ప్రతి ఫర్మానాను అమలుపరచాల్సిన ప్రస్తుత తరుణంలో అది మరింత వాస్తవం. ఆర్థికంగా, రాజకీయంగా, సైనికంగా సామ్రాజ్యవాద సంకెళ్ళు భారతదేశాన్ని మునుపటికంటే బలంగా బంధిస్తాయి. సామ్రాజ్యవాద మొసళ్ళు, స్థానిక దళారీలు, రాజకీయ, తదితర తార్పుడుగాళ్ళు మాత్రమే లబ్ధిదారులౌతారు.

ఒక గొప్ప సామాజిక విప్లవం మాత్రమే సామ్రాజ్యవాద సంకెళ్ళను ఛేదించి, శత్రువులను కూలదోసి దీర్ఘకాలంగా బాధపడుతున్న మన ప్రజలకు నూతన జీవితాన్ని ఇవ్వగలదు. నక్సల్బరీ అందుకు ఒక ఆరంభం మాత్రమే. ఇతర దేశాలమీద, మొత్తంగా ప్రపంచం మీదనే నిర్ణయాత్మక ప్రభావాన్ని కలుగజేయగల భారత విప్లవం విజయవంతం కావడం కోసం, విప్లవ కార్మికులతో, రైతాంగంతో మమేకమై గతంనుండి, వర్తమానం నుండి, అనుభవం నుండి నేర్చు

కుంటూ మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానాన్ని సుసంపన్నం చేయ గల కమ్యూనిస్టు సిద్ధాంతకర్తల కోసం భారతదేశం కాచుకొని వున్నది. గత కొన్ని దశాబ్దాలలో - ఆర్థిక శాస్త్రం, రాజకీయం, శాస్త్ర, సాంకేతిక రంగాలు మొద లైన రంగాల్లో బృహత్తర మార్పులు చోటు చేసుకున్నాయి. భారత, ప్రపంచ పరిస్థితులు సృష్టించే సంక్లిష్టతలను అతిగమించేందుకు మార్గదర్శకం వహించే నూతన సిద్ధాంతాలు నేడు కమ్యూనిస్టు విప్లవకారులకు అవసరం. "మార్క్స్, లెనిన్ రచనలు చదవటం తప్పనిసరి అవసరం. అదీ ప్రాథమికం. కానీ ఏ దేశంలోని కమ్యూనిస్టులైనా, ఏ దేశంలోని శ్రామికవర్గ తాత్విక బృందాలయినా తాము ఎదుర్కొనే రాజకీయ కర్తవ్యాలను నెరవేర్చేందుకు, కొత్త సిద్ధాంతం, కొత్త రచనలు, తమ స్వంత సిద్ధాంతకర్తలను సృష్టించుకోవాలి" అన్నాడు మావో. "ఏ దేశం కూడా ఎప్పుడు కూడా పాత దానిపైనే ఆధారపడజాలదు. లెనిన్ "రెండు ఎత్తుగడలు", ఇతర రచనలు లేకుండా, మార్క్స్, ఎంగెల్స్ రచనలు మాత్రమే 1905 లో తలెత్తిన నూతన సమస్యలను పరిష్కరించలేకపోయేవి. 1947 లోని భౌతికవాదం, అనుభవవాద విమర్శనం మాత్రమే, అక్టోబరు విప్లవానికి ముందు, ఆ తర్వాత తలఎత్తిన సమస్యలను పరిష్కరించడానికి సరిపోయేదీ కాదు. ఆ కాలపు అవసరం తీర్చడానికి లెనిన్ "సామ్రాజ్యవాదం, రాజ్యం మరియు విప్లవం" తదితర రచనలు చేశాడు" అన్నాడు మావో.

నవంబరులో ప్రాచ్య జాతుల కమ్యూనిస్టు సంస్థల అఖిల రష్యా కాంగ్రె సును ఉద్దేశించి ప్రసంగిస్తూ లెనిన్, ప్రాచ్య కమ్యూనిస్టుల సమస్యలకు పరిష్కా రాలు ఏ కమ్యూనిస్టు పుస్తకంలోనూ దొరకవని అన్నాడు : "కమ్యూనిజపు సాధారణ సిద్ధాంతం, ఆచరణపై ఆధారపడి", వాళ్ళ "ఆ సమస్యను ఎదుర్కొని మీ స్వతంత్ర అనుభవం ద్వారా పరిష్కరించవలసి వుంది" అని అన్నాడు.

వలసల్లో, అర్ధవలసల్లో విప్లవ సమస్యలను పరిష్కరించడానికి మావో సేటుంగ్ కొత్త సిద్ధాంతాలను సృష్టించాడు, ఎన్నో పుస్తకాలు రచించాడు. కొన్నిం టిని పేర్కొనాలంటే ఆయన రాసిన "ఆచరణ, వైరుధ్యాలు, దీర్ఘకాలిక యుద్ధం, చైనా విప్లవం, చైనా కమ్యూనిస్టు పార్టీ, నూతన ప్రజాస్వామికం, ప్రజల ప్రజా స్వామిక నియంతృత్వం" - మార్క్సిజం - లెనినిజానికి ఒక నూతన అభివృద్ధి. చైనా సోషలిజపు దశలో ప్రవేశించినపుడు, సోవియట్ యూనియన్ పెట్టుబడిదారీ

రాజ్యంగా దిగజారినపుడు, ఆ కాలపు అవసరాలు తీర్చడానికి మావో నూతన సిద్ధాంతాలు తయారుచేసాడు. ఆయన రచనలు, ఉపన్యాసాలు, ఆదేశాలు "పది ప్రధాన సంబంధాల గురించి", "ప్రజల మధ్య వైరుధ్యాలను పరిష్కరించడ మెలా ?", "మావో సెటుంగ్ ఆలోచనా విధానం వర్ధిల్లాలి" (రెండు సంపుటాలు - న్యూయార్క్ నుండి 1977 లో ప్రచురితమైన "సోవియట్ అర్థశాస్త్రంపై విమర్శ" - ఇందులో ఒక చిన్న భాగం మాత్రమే). "కృశ్చేవ్ కుహనా కమ్యూనిజం, ప్రపంచానికి దాని చారిత్రక గుణపాఠాలు" మొదలయినవి - సోషలిస్టు నిర్మాణంలో ఎన్నో సమస్యలను పరిష్కరించగలవు. సోషలిస్టు విప్లవాన్ని ముందుకు తీసుకెళ్ళడానికి, పెట్టుబడిదారీ విధాన పునరుద్ధరణను నిరోధించడానికి విప్లవకారులకు అవి మార్గదర్శకంగా ఉండగలవు.

కానీ, కాలం గడిచే కొద్దీ, కొత్త సమస్యలు తలఎత్తి పరిష్కారం కోరతాయి. సిద్ధాంతం వాటిని సరిగ్గా గ్రహించగలగాలి. ప్రస్తుత ప్రపంచాన్ని, సమాజాన్ని (లేదా సమాజాలను), నిర్దిష్ట పరిస్థితులను, వర్గ వైరుధ్యాలను సరిగా అన్వయించి వాటిని పరిష్కరించేందుకు ఒక మార్గం చూయించాలి. నూతన అవసరాలను తీర్చేందుకు భారత కమ్యూనిస్టు సిద్ధాంతవేత్తలు మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానానికి కొత్త చేర్పులు కాగల కొత్త సిద్ధాంతాలు చేయాలి, కొత్త రచనలు రచించాలి.

అంతిమ విజయం బుష్‌లదీ, ఎల్సిన్‌లదీ, రావులదీ కాదు, ప్రజలది. ప్రజల అత్యున్నత ఆకాంక్షలను కమ్యూనిజం ప్రతిబింబిస్తుంది - దోపిడీ, పీడనల నుండి స్వేచ్ఛ పొందిన ప్రపంచం, ఆకలి, దారిద్ర్యాల నుండి స్వేచ్ఛ పొందిన ప్రపంచం, నూతన విలువలు, నూతన సామాజిక సంబంధాలు, నూతన సంస్కృతితో మనుష్యులను నిజంగా స్వేచ్ఛగా, సంతోషంగా ఉంచే ప్రపంచం గురించిన ప్రజల స్వప్నమది. ఎంత అపరిపక్వమైనప్పటికీ రష్యాలో, చైనాలో కొద్దికాలంపాటు ఐనా కల్గిన సోషలిజపు అనుభవం. అది ఒట్టి స్వప్నం మాత్రమే కాదనీ, సోషలిజం పని చేస్తుందనీ నిస్సంశయంగా నిరూపించింది. లాభాల కోసం మనిషి దురాశపై మానవ విలువలు ఆధిపత్యం వహించే, పెట్టుబడిదారీ నరభక్షకత్వం గత కాలపు పీడకలగా మిగిలిపోయే దేదీప్యమానమైన భవిష్యత్తును అది హామీ ఇస్తోంది.

The Historic Turning-Point - A Liberation Anthology Vol. Iకు సంపాదకుడు సునితికుమార్ ఘోష్ రాసిన ముందుమాటకు సంక్షిప్తానువాదం.

# తెరాయి ఉద్యమం - బెంగాలీ సాహిత్యం

—మహాశ్వేతాదేవి

ఈ అంశం చాల క్లిష్టమైనది. ఉద్వేగాల వల్ల మాత్రమే ఉద్యమం కోసం కలం పట్టుకున్న నాకు కష్టతరమైనది. నా శక్తి సామర్థ్యాలు పరిమితమైనవని నాకు తెలిసినప్పటికీ ఆ కాలం చారిత్రకంగా ప్రాముఖ్యమైనదని భావించడం వల్ల దానిని పదిలపరచే ఒక ప్రయత్నం చేయాలనుకున్నాను.

ఈ ఉద్యమం గురించీ, ఈ ఉద్యమం వెంట ఉన్న సాహిత్యం గురించీ ఇప్పటికే ఎన్నో విషయాలు రాశారు, ఇంకా రాస్తూనే ఉన్నారు. ఈ ఉద్యమంలో చురుగ్గా పాల్గొన్న రచయితలకు అదీ సులభంగా ఉంటుంది. ఈ విషయంలో నాకున్న పరిమితులేమిటో నాకు తెలుసు.

పశ్చిమ బెంగాల్‌లోను, మొత్తంగా భారతదేశం అంతటా మేధావి వర్గంలో ఈ నక్సలైట్ ఉద్యమం ఒక నూతన చైతన్యం తీసుకురావడం ఆ ఉద్యమం సాధించిన ఒక ప్రధాన విజయమని నేననుకుంటున్నాను. ఈ ఉద్యమం వల్లనే రచయితలు, కళాకారులు, సాంస్కృతిక కార్యకర్తలు విప్లవ ప్రజానీకంతో మమేకం కావలసి ఉందని గుర్తించారు. ముఖ్యంగా సాహిత్య రంగంలో ఒక నూతన విప్లవ చైతన్య సాంప్రదాయం ఆవిర్భవించింది. సాహిత్యం ఒక రాజకీయ పునాది లేకుండా మనలేదని నమ్మేవాళ్ళు ఈ రచయితల మీద ప్రత్యేకమైన ఆశలు పెట్టుకున్నారు; వాళ్ళ రచనలు రాజకీయ చైతన్యాన్ని ప్రతిబింబించి, సరైన వర్గపోరాట మార్గాన్ని చూపుతాయని భావించారు. చెట్టుకు వేళ్ళు ఎంత అవసరమో సాహిత్యం జీవితపు లోతుల్లో పాతుకొని ఉండడం అంత అవసరం. కార్మికుల, భూమిలేని నిరుపేదల, రైతాంగ జీవితాలను, వారి పోరాటాలను వర్గపోరాటంలో భాగంగా సాహిత్యం చిత్రించాల్సిన అవసరం ఉందనే విశ్వాసం అప్పటినుంచే ప్రగాఢంగా ఏర్పడింది.

ఈ ఉద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొన్నవాళ్ళు కూడ అప్పటి సాహిత్యాన్ని ఎంతో ముందుకు తీసుకెళ్ళారు. అందుకు మనం వాళ్ళకు ఋణపడి ఉన్నాం. అందులోను అసంఖ్యాకంగా కరపత్రాలు, పత్రికలు ప్రచురించి కలాన్ని విప్లవ

ఆయుధం చేసిన యువరచయితలకు, చరిత్రను, సాహిత్యాన్ని నూతన ప్రమాణా లతో, విలువలతో కొలిచిన వాళ్ళకు, నూతన విలువలకు ప్రాణం పోసిన వాళ్ళకు మనం ఎంతో రుణపడి ఉన్నాం.

భారత సమాజపు పాత, ప్రస్తుత భూస్వామ్య నిజస్వరూపాన్ని, వర్గదోపిడీ మన స్తత్వాన్ని విశ్లేషించి, బహిర్గతం చేయడం ద్వారా దానిని పునర్నిర్మించడం విప్లవ సాహిత్యం చేయాల్సిన పనని భావించారు. భూ పంపిణీ గురించీ, రైతాం గానికి భూమితో ఉన్న సంబంధం గురించీ సరైన అవగాహన లేకుండా ఈ దేశ ప్రజల పోరాటాలను చిత్రించడం సాధ్యం కాదని కూడ అప్పుడే తెలుసుకోవడం జరిగింది. ఈ భూమే భారత దేశంలో కింది కులాలనబడేవాళ్ళు, ఆదివాసులు, పీడిత వర్గాలు ఉండడానికి మూలకారణం. ఈ ప్రజలకు శ్రమించే హక్కు తప్ప ఆ శ్రమ ఫలాలు పొందే హక్కు లేదు. జీవితాంతం వడ్డీ వ్యాపారులకు కట్టుబానిస లుగా ఉండడానికీ, బానిస విధానానికీ, వారిని వాళ్ళ భూముల నుంచి, వాళ్ళ ఇళ్ళ నుంచి వెళ్ళగొట్టడానికీ, వాళ్ళు వర్గదోపిడీకి గురికావడానికీ - కఠోరమైన ఉదా హరణ మహిళలపై జరుగుతున్న దోపిడీ - వీటన్నిటికీ మూల కారణాలు భూ సమ స్యలో ఉన్నాయి. విస్తృతమైన అధ్యయనం, పరిశీలన లేకుండ, సమస్యతో జీవించకుండా భారత సమాజంలోని అశేష కార్మికవర్గానికి సాహిత్యం ద్వారా సరైన న్యాయం చేయలేము. ఉద్యమంలో ప్రజల క్రియాశీల పాత్ర, ప్రజా శత్రువులను ఏకాకులను చేసి హతమార్చడం, పోలీసులు, ఇతర రాజకీయ పార్టీల హత్యలు, పోలీసు ఎన్‌కౌంటర్లు, విప్లవాశయ సాధనకై పోరాటం, ఎంతోమంది సాహసవీరుల త్యాగాలు, ఉద్యమ విజయానికై ఏర్పడ్డ విద్యార్థి, యువజన సంఘాలు- ఇవన్నీ ఆ కాలంలో సాహిత్యానికి ప్రధాన వస్తువులయ్యాయి. 1975 తర్వాత రైతాంగం, భూమి, భూపంపిణీ, ప్రభుత్వ జాప్యం, బ్యాంకు రుణాల నిరుపయోగం, రాజకీయ స్వప్రయోజనాలతో భూ సంస్కరణ చట్టాల పూర్తి వైఫల్యం, ఆదివాసీల బతుకులు, వారి పోరాటాలు - అన్నీ సీరియస్ నవలల్లో, కథల్లో చాల ఎక్కువగా ప్రతిబింబిం చాయి. 80ల తర్వాత చాలమంది ఇదే విధంగా వ్యక్తీకరించడం మొదలుపెట్టారు. అధికార హోదాలో ఉన్న ప్రభుత్వాధికారులు కూడా సాహిత్యాన్ని శాస్త్రకారుని అస్త్రంగా మార్చి జబ్బు ఎక్కడున్నదో తెలుసుకున్నారు. సాహిత్యం మళ్ళీ సాయుధం కావడం ఆరంభమైంది. రైతులు, కౌలుదార్లు, వ్యవసాయ కూలీల జీవి

తాల్లో భూస్వామ్య దోపిడీ విధానం సిద్ధాంతపరంగానే కాక ఒక కఠిన వాస్తవంగా ఉంది. రచయితలు ఈ విషయాన్ని నక్సలైట్ ఉద్యమం ముగిసిన తర్వాతనే తెలుసుకున్నారు. ఈ ఉద్యమం విఫలమైందని భావించినప్పటికీ ప్రజల మనసుల్లో ఒక నూతన చైతన్య బీజాల్ని నాటడంలో విజయవంతమైందని అర్థం చేసుకున్నారు. నేను ఈ ఉద్యమానికి పడ్డ రుణాన్ని ఎప్పుడూ నిరాకరించలేను. ఆదివాసీల, హరిజనుల జీవితాల్లోకి, వాళ్ళ సమస్యల్లోకి సాధ్యమైనంత లోతులకు వెళ్ళడం, అటవీ, భూమి సమస్య ప్రధాన పాత్రను అధ్యయనం చేస్తుండడం (ప్రతి చోటా ప్రజలు భూస్వామ్య దోపిడీకి గురి కావడానికి, ఆదివాసీలు, హరిజనులు చంపబడడానికి, కుల కొట్లాటలకు, సాయుధ తెలంగాణ పోరాటానికీ భూమిపై ఉన్న స్వార్థ ప్రయోజనమే కారణం) చివరకు నన్ను ఈ ప్రజల గడపల దగ్గరకు నడిపించాయి. ఒకప్పుడు అడవిని వింతగా చూశాను. కట్టు బానిసలకు సన్నిహితమైన 1980ల తర్వాత అడవి కూడా స్వతంత్రంగా లేదని గ్రహించాను. అడవి కూడ ఒక దావిసే. యజమానులు, మహాజన్లు, రంపపుకోత మిల్లుల యజమానులు, అటవీ కాంట్రాక్టర్లు, ఎన్నో అదృశ్య హస్తాలు అడవిని ఒలిచి దోచుకున్నాయి. ఈ అదృశ్య హస్తాలకు ప్రభుత్వ అటవీశాఖ దన్ను ఉంది. లోతైన పరిశోధనాత్మక వార్తా రచన చేసే కొత్త సాంప్రదాయం కూడా ఈ ఉద్యమ విజయాలలో ఒకటి.

ఈ కొత్త సాంప్రదాయం గురించి మాట్లాడేటప్పుడు గతంలో కమ్యూనిస్టు పార్టీకి చెందిన రచయితలు, కళాకారులు, సాంస్కృతిక కార్యకర్తల కృషిని నేను తిరస్కరించను. ఎవరైనా పాత "పీపుల్స్‌వార్" చదివితే అప్పటి విలేఖరులు భారత దేశాన్ని భూస్వామ్య దోపిడీ సంకెళ్ళకు బందీ అయినట్లుగా చిత్రించినట్టు చూస్తారు. తీవ్ర నిర్బంధం ఉన్నప్పటికీ తెభాగా ఉద్యమం గురించి, 1950 నాటి కరువు గురించి "పీపుల్స్‌వార్", "స్వాధీనత"ల్లో ప్రతిరోజూ వార్తలు వచ్చాయి. కాని ఇప్పుడు ఆ కాలం అప్రస్తుతం. ఈ ఉద్యమం మేధావి వర్గంలో నిజంగా ఒక విస్ఫోటనం సృష్టించడం వల్ల ఆ కాలం గురించి చర్చ సాగుతున్నది. అందువల్ల పాత రచయితలు, కళాకారులు దూరమైనప్పటికీ రాజ్యాన్ని ధిక్కరించే సాంప్రదాయం ఇంకా కొనసాగుతూనే ఉంది. ఈ సాంప్రదాయాన్ని చాల మంది చాల రకాలుగ విశ్లేషించారు. కాని నేనిప్పుడు వాటి జోలికి వెళ్ళను. అప్పటి స్థిరపడ్డ సాహిత్య ప్రపంచంలో విప్లవ రచయితలు చాల కొద్దిమందేనన్న విషయాన్ని

గుర్తించుకోవాలి. కాని క్రమంగా ప్రజల అభిరుచులు మారడం మొదలయ్యాయి. విప్లవ సాహిత్యాన్ని ఆదరించే ప్రజలు కూడ చాల తక్కువమందే ఉన్నప్పటికీ, అప్పటివరకూ దాదాపు అపరిచితంగా, విడిగా ఉండిన సమాజం, అసమానపు పోరాటం విశాలసాహిత్య పాఠక లోకంలో తమవైన స్వతంత్రస్థానాల్ని సంపాదించుకున్నాయి. ఇవాళ్టికి కూడా విప్లవ రచయితలు సంఖ్యలో చాల తక్కువే ఉన్నారు. అట్టడుగున దోపిడీకి గురవుతున్న ప్రజల నుంచి ఆలోచనల్లోనూ, ఆదరణలోనూ దూరమైన వాళ్ళు, తమ రచనలకు చోదకశక్తి అయిన ప్రజల మనుగడ కోసం పోరాటాన్ని అర్థం చేసుకోగలరు.

నామటుకు నాకు విప్లవం సాగుతున్నదనే అనిపిస్తున్నది. అయితే నక్సలైట్ ఉద్యమం లాగ నిర్దిష్టంగా కాకపోవచ్చు. అయినప్పటికీ విప్లవం ఇవాళ మరింత విస్తరించింది. ఇదంతా భూసంస్కరణలు అమలు పరచకపోవడం వల్లనే జరిగింది. ఇవాళ్టికి కూడ పొలాలకు నీరు, తాగడానికి మంచినీరు దొరకడం లక్షలాది ప్రజలకు ఒక కల మాత్రమే. కాని ప్రజలు ఎలా ప్రతిఘటించాలో నేర్చుకున్నారు. మోసానికి, అక్రమ పద్ధతులకు వ్యతిరేకంగా గళం ఎత్తడం నేర్చుకున్నారు. పోరాటానికి అంతం లేదనే కారణం వల్లనే ఈ విప్లవం నిజంగా విప్లవమని చెప్పవచ్చు. ఇవాళ భూస్వామ్య విధానం, మానవ మనస్తత్వపు దుష్టకోణం దేశం అంతటా నాటుకు పోయి ఉన్నాయి. ఇది కులతత్వాన్ని, మతతత్వాన్ని, మత దురహంకార విషాన్ని ముందుకు తీసుకురావడానికి ప్రయత్నిస్తోంది.

అందుచేతనే రచయితలు ఇవాళ తమ కలాలను చేత బట్టాల్సిన అవసరం ఎంతో ఉంది. తమ శ్రమ ఫలాలు దక్కనందువల్ల, తమ ఇళ్ళలోంచి వెళ్ళగొట్ట బడినందువల్ల పీడిత వర్గాలు పొందిన నిస్పృహ, అన్యాయం, కోపం నక్సల్బరీ ఉద్యమానికి జన్మనిచ్చాయి. అన్ని సాయుధ పోరాటాలకు మూలకారణం ఇదేనని చరిత్ర చెప్తున్నది.

వాళ్ళు తమ హక్కులన్నీ సాధించుకున్నారా ? దోపిడీ, దగాకు వ్యతిరేకంగా ఈ ప్రజల కోసం ఇవాళ, భవిష్యత్తులోను రచనలు చేయడం అవసరం. నక్సలైట్ ఉద్యమం మిగిల్చిన సాంప్రదాయం రచయిత ఉన్నతమైన సమాజంలో నిజమైన అంతర్భాగమని రుజువు చేసింది. తన శక్తిమేరకు తనను తాను అర్పించుకోవడమనే బాధ్యత రచయితకు ఉంటుంది. చెప్పాల్సింది ఎంతో ఉన్నా ఏమీ చెప్పకుండానే కావచ్చు, ఇవాళ్టికి ఇక్కడ ముగిస్తాను.

(అజ్‌కల్, మే 24, 1992)

స్పందనలు — I ప్రారంభం

## శ్రీకాకుళమై చిగురించిన నిప్పురవ్వ

—సిద్ధార్థుడు

అడుగు మాత్రమే పట్టే ఈ దారులన్నీ ఈ అడవి అంతా అల్లుకొని చెట్టు చెట్టుకీ గుట్టకీ తీసుకుపోతుంటాయి. చలికాలంలో చిక్కటి చీకటి తెరలు చెదిరి పోతున్న తెల్లని మంచుపొరలు అడవి కొండలకి మేలి ముసుగు కప్పేస్తాయి. పొగలు పొగలుగా ఈ మంచుగాలిలో తేలిపోతూ-సూర్యుని కిరణాల వెచ్చని కౌగిలికి కరిగి ఆవిరై పోతున్న 'మంకీకాప్' సందుల్లోంచి చెవులకి చల్లగా తగుల్తూ చిన్న చిన్న సూదుల్ని గుచ్చుతుంది. పొదల్లో- చిన్ని చిన్ని మొక్కల ఆకులమీద చుక్కలు ఖింఖించి మెరుస్తూ ఉంటాయి. అందరూ అలసి కలత లేని నిద్రలో ఉంటే సెంట్రీ వొక్కడూ దారిలో అనుమానంగా కదిలే ఆకృతి కోసం—హఠాత్తుగా వెలిగే వెలుగు కోసం-వినపడీ వినపడని సవ్వడి కోసం- కదల్నే కదల్ని ఒక గంట కాలాన్ని చూపులతో బరువుగా లాగుతూ నిలబడ్తాడు. ఇన్ని ప్రాణాలు ఆ ఒక్కడి జ్ఞానేంద్రి యాలపైన ఆధారపడి ఉన్నాయనే ఒక్క చిన్న గుర్తింపు చేతిలో తుపాకిలా విశ్వా సంగా తగుల్తుంది.

శ్రీకాకుళం........యావద్భారత దేశానికి ఒక వెలుగు చూపిన అమరనామం. అదీ కేవలం నామవాచకంగా ఉండటం మానేసి విప్లవాన్ని సంకేతించే సర్వనామం అయిపోయింది. యిక్కడి కొండల్ని-వాటిని తాకుతూ తుళ్ళిపడి చెదిరిపోయే మేఘా లని చూస్తుంటే ఒకనాడు యిక్కడ జరిగిన సంరంభం అంతా ఒక Symbolic గా ధ్వనిస్తుంటుంది. ప్రతి అంగుళం ఒక చారిత్రక ప్రదేశం అయిపోయింది. భారత దేశంలో సీతమ్మవారు మొక్కని రాయి లేదు అంటారు. ఈ అడవిలో-ఈ చెట్లలో విప్లవం స్పృశించని అణువు లేదు. రెండు దశాబ్దాల తరువాత యిక్కడ అడుగు మోపిన విప్లవకారుడికి అడవి మొదట్లో అడుగుపెట్టిన మరుక్షణం ఒక ఉత్తేజం నరనరాన సోకి హృదయ స్పందనకి అర్థం కల్పిస్తుంది. యిక యిక్కన్నుంచి అడుగుపడ్డ ప్రతి అణువు పరామర్శించి కథలు వినిపిస్తుంది. విప్లవకారుడికి యిక్కడ చారిత్రక ప్రదేశం కాని చోటు లేదు.

"మంచికో చెడ్డకో నా రచనలు కదిలించి తీరాల"ని చెలం ఆశించాడు. మంచికి చెడ్డకి రెంటికి కదిలిపోయింది ఆంధ్రదేశం. శ్రీకాకుళం మంచికి - చెడ్డకి దేశాన్ని కుదిపేసింది. అది తప్పులే చేయొచ్చు- ఒప్పులే చేయొచ్చు కాని అది ప్రతి వాణ్ని మంటల్లోకి ఈడ్చింది. దాని సెగ తగలని హృదయం లేదు-దాని ఊపిరి తగలని పూపిరితిత్తి లేదు. దాన్ని ప్రేమించారు. దాన్ని ద్వేషించారు. దానికి స్పందించారు. దానికి భయపడ్డారు. దాన్ని ద్వేషిస్తూ ప్రేమించారు. దాన్ని ప్రేమిస్తూ ద్వేషించారు. దానికి భయపడుతూ స్పందించారు. ఎవరు ఎలా కదిలినా శ్రీకాకుళం ఊహల్లోని విప్లవాన్ని భూమార్గం పట్టించింది.

అడవుల్లోని గిరిజనులు తిరుగుబాట్లు చేయడం-ప్రభుత్వాలు వాటిని అణచివేయడం ఈ దేశానికి కొత్తకాదు. కొమరం భీం దగ్గర్నుంచి బీర్సాముండా, సీతారామరాజు వరుకు అడవులు తిరుగుబాట్లనీ చూసాయి-తుపాకుల మోతలో ధ్వనించి గెడ్డలుగా పారిన నెత్తుటి ధారల్ని చూసాయి. కాని శ్రీకాకుళం నెత్తుటి ధారలుగా మిగిలిపోలేదు. అది తను కదిలి దేశాన్ని కదిలించింది- తను ఆరిపోయినా ఆలోచనల్ని వెలిగించింది. అది రాష్ట్రమంతా సోకి తిరిగి తిరిగి మళ్ళీ యిక్కడికొచ్చింది.

యిక్కడ కంటికెదురుగా కనిపించే చింత చెట్లనీ-బూర్గ చెట్లనీ చూస్తూ పిట్టల రావాలు కూడా లేని ఒక నిశ్శబ్ద వాతావర్ణంలో పాదరసంలా జారిపోయే ఆలోచనల్ని కలంలో పోసెయ్యాలని ఆతృత పడుతుంటాను. గాలికి ఆరిపోయే నెగడు దగ్గర పొగలా ఉక్కిరి బిక్కిరై ఆకృతిలేని ఆలోచనలు తరుముతుంటాయి. శ్రీకాకుళాన్ని ప్రేమించడం తేలికే. కాని అర్థం చేసుకోవడం-అనుభూతి చెందటం కష్టం. ఈ కొండల్లో కొండ అంచుమీద కెక్కి పోడుకొడుతున్న సవర రైతు ఏమి ఆలోచిస్తాడు ? సూర్య కిరణం సోకని గుడిసెలో చంకలో పసికందును వేసుకొని పొయ్యి ముందు వంట చేసే సవర స్త్రీ ఏమి ఆలోచిస్తుంది ?.... తట్టదు. పుస్తకాలు, పేపర్లు, రేడియో, టీవీలు- సినిమాలు-పార్కులు యిన్నింటి మధ్యన ప్రపంచమంతా తిరిగి వచ్చే మనిషి ఆలోచన పసికట్టొచ్చు. కాని చెట్లు-ఆకులు నిశ్శబ్ద ప్రకృతి తప్ప ఏమీలేని ఈ గిరిజనుల ఆలోచన దేని గురించి ఉంటుందో మన ఊహకు కూడా

అందదు. షావుకార్లు చేసే మోసాలు-కొండలమీదికి పాకుతూ వచ్చిన క్రిస్టియానిటీ- మళ్ళీ ఇరువై సంవత్సరాల తరువాత సత్యం మాస్టారు పోరాటాన్ని కొనసాగిస్తా మని వచ్చిన ఈ 'పచ్చని బట్టల అన్నగాళ్ళు'- వీటి గురించి వాళ్ళ ఆలోచనలేమిటి ?

ఒక తరం మారిపోయింది. ఆంధ్రదేశంలో ఈ తరం నక్సల్బరి-శ్రీకాకుళం తరంగా సెగలు కమ్ముతుంటే కొండల్లో యిక్కడి తరానికి అదే శ్రీకాకుళం ముసలి వాళ్ళ నోటి కథలుగా వినిపించే 'గలాటం' అయిపోయింది. అనాడు లేనివి చాలా వొచ్చాయి. కొండలమీద హక్కులు-లోన్లు-అరటి చెట్లు-అనాసలు-కరెంట్లు-బడి శాలలు చాలానే. అనాడు ఉన్నవి చాలా పోయాయి. దట్టమైన అడవులు పల్చబారి పోయినాయి. అపారంగా పెరిగే చెట్టు క్రాసింగైంది. గిరిజన కార్పొరేషన్లు వగేరా చాలా వొచ్చినై. ఎన్ని వచ్చినా ఏ గ్రామాన్ని "కాకూ....బంగ్సాడాకుపో...." అని పలకరించినా "ఆఁ .. జి....నా....బంగ్సా...." అన్న నిట్టూర్పు ("అన్న....బాగు న్నావా ?" "ఆఁ....ఏం... బాగుత....") కిన్నెర మీటినట్లు రాగాలుగా ప్రవహించే ఈ సవర భాషలో వయొలిన్ విషాద రేఖలు భాష అర్థం కాకపోయినా హృదయాన్ని తాకుతుంటాయి. నాలిక కన్నా ఎక్కువగా స్వరపేటికని ఉపయోగించి మాట్లాడే ఈ భాషలోని సౌందర్యం గిడుగు రామ్మూర్తిని మైనగోరు పిట్ట రాగం కమ్మేసినట్లు కమ్మేసింది. కాని అడుగడుగునా మోసాలతో-అవమానాలతో, దోపిడితో బతికే సవర రైతు జీవితంలోని విషాదానికి దేశవ్యాపిత సార్వత్రిక లక్షణం ఉందని గుర్తు పట్టి దాన్ని సారించి శత్రువు గుండెలో కొట్టినవాడు సత్యం. అందుకే శ్రీకాకుళ సవర రైతు తిరుగుబాటు ఒక సార్వజనీనతను సంతరించుకొనిపోయింది.

పోరాటం వెనుకడుగు వేసినాక ఈ కొండల్లోకి రోడ్లొచ్చాయి-ఆఫీసర్లొచ్చారు- కార్పొరేషన్లొచ్చాయి- P. O. లు (Project Officers) వచ్చారు. కరంట్ స్తంభా లొచ్చాయి. వీటన్నిటితోబాటు మళ్ళీ షావుకార్లూ వొచ్చారు. ఆఫీసర్లు-కార్పొరేషన్లు షావుకార్లని పక్కకి నెట్టి ఆ మోసమేదో తామే మొదలుపెట్టారు. తేడా అల్లా రావి శాస్త్రి వ్రాసినట్లు "ఆరాఁ వేఁ పులి దగ్గర కెల్తది". పూర్వం షావుకార్లు మూట భుజం మీద వేసుకొని గూడలన్ని తిరిగి ఆహారం వెతుక్కుంటే-యిప్పుడు కార్పొరేషన్ వాడు కొట్టు పెట్టుకొని కూర్చుంటే కొండలన్ని దిగి "ఆరాఁ వేఁ వాడి దగ్గర కెల్తది".

రాష్ట్రంలోకెల్లా చింతపండు యిక్కడ ఎక్కువ పండుతుంది. సామలు,

జొన్నలు, వూదలు, కొర్రలు, కందులు, అరటి, పసుపు, అల్లం వగేరా చాలానే పండుతాయి. కాని సంవత్సరం పొడవునా ఈ సవరలకి 'పుల్లదప్పిక' తప్ప మరో తిండి ఉండదు. వేసవి మూడు నెలలూ అయితే జీలుగు అంబలి-బెంక అంబలి లాంటివి తినే బతకాలి. మొత్తంగా సవర జీవితంలోని ఆహారంలో ఏకైక లగ్జరీ-కాస్తో కూస్తో పోషక పదార్థాలు ఉన్నది 'బొంక్తాల్' (దున్నపోతు) మాంసమే. యిదే చాలా జబ్బులకీ దారితీస్తుంది. జబ్బు పడినవి, ముసలివి అయిపోయిన ఈ పోతుల్ని సంతలో కొని తెచ్చి వండుతారు. వాటిని తోలుకొస్తున్నప్పుడు చూడాలి-సత్తువనంతా పిండుకొని వదిలేసిన పోతులు కొండలు ఎక్కలేక పడిపోతుంటాయి. కొన్నయితే-కొన్నేమిటి? ఎక్కువగానే-దారిలోనే చావడానికి సిద్ధమౌతాయి. యిక అలాంటి స్థితిలో దాన్ని అక్కడే నిలబెట్టి నరికేస్తారు.

ఒక angle నుంచి చూస్తే పల్లపు గ్రామాల్లోని హరిజనులకన్నా సవరలు మంచి ఆహారమే తినొచ్చు. కాని అనూచానంగా వొస్తున్న వెనుకబాటుతనం- నాగరికత వారిని పల్లంతో పోల్చుకుంటే అజ్ఞానంలోనే ఉంచేశాయి. అందుకే ఇక్కడ విప్లవకారుడు దోపిడిని ప్రతిఘటించడంతోపాటు సంస్కరించడం కూడా చేయాలి. తాంత్రిక ఆచారంగా వచ్చిన జుట్టుని సత్యం క్రాపులుగా మార్చాదు. వొంటికి బట్టె తెలియని సవర స్త్రీకి చీరలు చుట్టారు. సంతలో 'సొండోలు' తమని అవమానపరిస్తే దాన్ని గుర్తించి నిలేసే స్థితిని తెచ్చారు. యిదొక్కటేనా? తన వూరికి నాలుగు కిలోమీటర్ల దూరాన ఏ వూరుందో తెలియని గిరిజనుడికి "పరస్పర వ్యతిరేక శక్తుల మధ్య జరిగిన సంఘర్షణ ఫలితమే అభివృద్ధి" అనే చారిత్రక భౌతికవాదాన్ని బోధించారు. కమ్యూనిస్టు ఏమీ తెలియని ప్రజలకి రాజకీయాలు నేర్పటం వింతకాదు. కాని ఈ కొండల్లో సవరల-జాతాపుల నోటి వెంట ఆ మాటలు వింటం గొప్ప అనుభూతి. పై సూత్రాన్ని శంకించే మేధావులో- మరొకరో ఉండొచ్చు. కాని ఏ సవర గిరిజనుడిని అడిగినా తాము రోజూ తెస్తున్న లోన్లు-వచ్చిన కరెంట్లు-కాస్తో కూస్తో అభివృద్ధి శ్రీకాకుళ పోరాట ఫలితమేనని తిరుగు లేకుండా చెపుతాడు. అందుకే ఈ కొండల్లోకి 'అన్నలు' వచ్చారంటే ప్రభుత్వమూ, షావుకార్లు హడలిపోవచ్చు కాని ఏ సవర గిరిజనుడినైనా-"కాకూ.... మరి మళ్ళీ మనం పోరాడాలి కదా! దళంలోకి రావాలి" అనంటే "అఁ.... రాక తప్పుద్దీ...." అంటాడు.

—1-4-92

స్పందనలు - II

## పోలీసు లొచ్చారు...

అటూ యిటూ రెండు వరుసల్లో ఒక కప్పు క్రింద కట్టిన పాకలు. యిటు వేపొక అరిట్కా-అటువేపొక అరిట్కా....యిళ్ళకి చివరగా ఐక్కలకోసం వేసిన చిన్నపాక. మొత్తంగా సవర గూడలన్నీ యిదే నమూనా యిక్కడ- యిది వొకవీధి అనుకుంటే-ఈ మొదట్లో నిలబడి ఒక్కసారి ఈ గూడని కళ్ళలో ముద్రించుకుంటే ఈ పాకల వెనుకగా చెట్లన్నీపోయి బోడిగా మిగిలిన ఎత్తైన కొండలు. ఎండ వాటిమీద ఒకవాలుగా పడుతూ వుంటే అక్కడో మేఘం-యిక్కడో మేఘం అప్పుడప్పుడు పల్చటి తెరని కప్పుకుంటూ పోయినట్లుగా నీడ కొండలమీద పాకుతూ ఉంటుంది. ఈ పాకల చుట్టూ ఈంతచెట్లు, విప్పచెట్లు వగైరాలు నిశ్శబ్ద ప్రేక్షకుడిలాగా నిలిచి నిర్వికారంగా ఒకటి అరా ఆకుల్ని కదిలిస్తూ నిలబడతాయి. ఎగుడు దిగుడుగా ఉన్న ఈ వీధిలో (వీధి అనుకుంటేనే) వాల్చిన మంచాలపైన ముసలివాళ్ళు చేరబడు తుంటారు. చింపిరి జుట్టు అనేదాన్ని 'ఇన్ ఫెనిటివ్' తో హెచ్చించగా వొచ్చిన ఫలితం లాంటి జుట్లు, అవి కదలితేనే తప్ప జీవం లేదనిపించే కళ్ళతో-జీవితమంతా పోడు కొట్టి కొట్టి- సంతల్లో దగా పడీ పడి ఎండిపోయిన శరీరంతో ఉన్న ఈ ముసలి వాళ్ళని చూస్తే జీవితం తాలూకు విషాద దృశ్యం- ఉత్పాదకశక్తి హరించుకొని పోయి ఎవ్వరికి పనికిరానట్లనిపించే- బ్రతికి ఉన్న మృత్యు దృశ్యం కనిపిస్తుంటుంది. యిక వయసు కుర్రాళ్ళూ- యువతులూనా? వాళ్ల కాళ్ల కింద కొండలు నలుగు తుంటాయి. జీవితం వాళ్ల వెంట మచ్చికైన పిల్లిలాగా తిరుగుతుంది. ఎక్కువ శాతం సవర- జాతావు యువతీ యువకులు అందంగా ఉంటారు. అయితే నాగరికత సృజించిన ప్రమాణాలతో వీర్ని కొలవాలంటే మనం కళ్ళుండీ గుడ్డివాళ్ళమై పోతాం.

చిక్కటి చీకటి తెరలు అడవిని కప్పేసి యిక రోజుకి విశ్రాంతి యివ్వగానే గూడల్లో నెగళ్ళు వెలుగుతాయి. దూరం నుంచి చూస్తే అది అగ్ని తిలకం ధరించి నట్లు ఉన్న సవర యువతిలాగా ఆనందం తొణకిసలాడుతున్నట్లుంటుంది. నెగడు చుట్టూ మూగి ఉన్న యువతీ యువకుల మొఖాలు మంటనీడకి ఎర్రగా కనిపిస్తున్నా- అందులో వ్యక్తావ్యక్తంగా ఒక ఆనందపు రేఖ కదలాడుతుంటుంది. వొక యువ

కుడు 'సారంగి' (ఏక్‌తార) ని అవధులు లేని 'కమిట్‌మెంట్'తో వాయిస్తుంటాడు. సవర భాషలోని పాటల ప్రవాహాలు రాళ్ళమీద పడి ఘల్లుఘల్లున మ్రోగే నీటి తరంగాల మాదిరిగా అల్లుకుంటాయి. ఈ ఒక్క దృశ్యమూ సవర జీవితంలోని ఒక ప్రధాన భాగానికి ప్రతిబింబం. నెగడు వెల్తురు- సంగీత సౌందర్యం కళ్ళని- హృదయాన్ని కమ్మేసి ఈ గూడ తప్ప మరో ప్రపంచం లేదనిపిస్తుంది. చుట్టూ ఉండే కొండలు- చెట్లూ నిశ్చలంగా ఉండి సంగీతాన్ని అనుభవిస్తూ ఉంటాయి. మానవ జీవితంలోని ఆదిమ సంస్కృతికి బింబమైన ఈ దృశ్యంలోకి అత్యంత అభివృద్ధి చెందిన నాగరిక జనపనాడాల బూట్లూ-'కన్నాల తుపాకులు' పట్టుకొని గూడల్లో వినవొచ్చే రాగాన్ని తొక్కుకుంటూ-నలిపేస్తూ ప్రవేశిస్తుంది.

ఈ నాగరికత ఈ గూడల్లో ఎప్పుడూ కదులాడుతూనే ఉంటుంది. 800 రూ. విలువ చేసే పసుపుని 200 రూ. కి కొనడంలోనూ-రెండు తరాలపాటు కొండని పిండి చేసి పంట పొలాలుగా మార్చాక అది 'నాదే' అని కోర్టునుంచి ఆర్డరు తెచ్చుకోవటంలోనూ- రూపాయికి రూపాయి వడ్డీతో అప్పులివ్వడంలోనూ, ఒక పందిని -ఒక 'బొంక్తాల్' (దున్నపోతు) ని యిచ్చి రెండువొందల చింత చెట్లని తీసుకోవటంలోనూ నాగరికత ఎప్పుడూ కదులాడుతూనే ఉంటుంది. యిది వ్యక్తిగతంగా వొకర్ని వొకరు మోసం చైడం కాదు. ఒక నాగరికత మరో నాగరికతను మోసం చైటం. యిది ఈ గూడల్లోనూ-దేశాలమధ్య సంబంధాలలోనూ ఒకేరకంగా ఉండి దానికొక చారిత్రక చట్ట బద్ధతని సంతరింప చేసారు. దీన్ని సవాలు చేసి చరిత్రని-ప్రపంచాన్ని ఒక మలుపు తిప్పాడు కారల్‌మార్క్స్. చాలా సహజంగానే మార్క్సిస్టు అయిన సత్యం యిక్కడా అదే పని చేసాడు.

"కావిడిలో చింతపండు
కంతిరీగా తూసారని
అంత పెద్ద పోరాటం
అందరికీ నేర్పినావు"

అని పాట కట్టాడు కవి. యిప్పుడు కార్పోరేషన్ యిదొక్కటే కాదు. 'సువర్ణముఖి' 'ఖండన' లో వ్రాసినట్లు షావుకారు కన్న తక్కువ రేటుకే కొంటూ- తమకి తప్ప రేటెక్కువిచ్చినా షావుకార్లకి అమ్మరాదని ఆంక్షలు పెట్టింది. బజారులో కట్లన్నీ పెరిగినా గత పదేళ్ళగా నిశ్చలమైన రేటుతో కేజికి 2 రూ. కి చింతపండు

స్పందనలు- III

## 'అర్జునుడు...'

గలగలా పారుతున్న గెడ్డ నీటి తరంగాల మీద వెన్నెల తాకీతాకనట్లుగా పడి మెలికలు తిరిగిపోతుంది. కళ్ళు కనిపించని చీకట్లో అయితే పాదాలు రాళ్ళని వెతికి వెతికి అడుగులు మోపుతుంటాయి. కాని యిప్పుడీ వెన్నెల్లో ఎండిపోయిన ఆకు సైతం యింత వెన్నెల్ని తీసి మన కళ్ళలోకి విసిరి 'యిక్కడ నేనున్నాన'ని ఫళ ఫళా నవ్వుతుంది. గిరిజనుడి పాదానికి వినమ్రంగా వంగి దారి యిచ్చే ఈ బండలు-రాళ్ళు మన పాదాల స్పర్శకే కదిలిపోయి కింద పడేస్తుంటాయి.

కొండలు-అంటుకున్న వీోడుతో వజ్రాల పతకమేదో ధరించినట్లు మెరిసి

---

కొంటుంది. ఈ రేటు 5 రూ.కి పెంచాలని గిరిజనుల డిమాండు. సరిగ్గా పాతిక సంవత్సరాల క్రితం యిదే సమస్యపై సత్యం మొండెంఖల్‌లో మీటింగ్ పెడితే లేవిడి దగ్గర కోరన్న-మంగన్నలని కాల్చటంతో శ్రీకాకుళం లావాలు గ్రక్కింది. ఈనాడు ఈ డిమాండుపైన గిరిజనులు వూరేగింపులు జరిపారు. P.O. (Projcet Officer) కు విజ్ఞప్తులు చేసారు. సంతకి చింతపండు అమ్మడం మానేసారు. సరిగ్గా యిక్కడ ప్రవేసించింది నాగరికతకి మరో ముఖం.

శ్రీకాకుళం గిరిజనుడికి యివన్నీ కొత్త కాదు. వాళ్ళు పోరాటాలు చేసారు. పోలీసులని చూసారు. వాళ్ళు చిక్కటి చీకటి తెరని చీల్చిన వాడి కిరణాన్నీ చూసారు, వెన్నెల రాత్రుల్ని మబ్బు చారలా కమ్మేసిన కాకి బట్టల అరచేతుల్నీ చూసారు. అందుచేత ఈ 'నాగరికత' వాళ్ళకి కొత్తకాదు. యిది వూరు వూరుని కమ్మింది. గూడల్ని గాలించింది. హెచ్చరికలు చేసింది. అంతవరకు ఈ 'పచ్చ బట్టల అన్నగాళ్ల' పట్ల గిరిజనుల్లో సందేహాలేమయినా ఉంటే ఈ దెబ్బతో అవన్నీ పటా పంచలై పోయినాయి. వీళ్ళు సత్యం వారసులేననే సత్యం తేటతెల్లమై పోయింది. యిక ఈ 'అన్నగాళ్ళు' ఏ గూడకి దిగినా 20 సంవత్సరాల క్రితం అడవి రహస్యాల్ని విప్పారు. పల్లపోడి అడుగుపడని-పడలేని అడవి మార్గాలని పరిచారు. వాళ్ళు గుండెని రెండుగా విప్పి అన్నగాళ్లని అందులో దాచారు.

పోతుంటాయి. ఈ పోడు రకరకాల ఆకృతులతో కొండలమీద మంటల ప్రవాహాల్ని పైకి ఎగదోస్తుంటాయి. అది వన్నె వెన్నెల వెలుగులో అయినా-చిమ్మ చీకటి రాత్రిలో అయినా తొలిసారిగా ప్రేమలో పడ్డ యవ్వనం పెదాలపైన విరబూసిన మెరుపుల నవ్వులాగా అడవి అంతటికి అపురూప సౌందర్యాన్ని తెస్తుంది.

ఈ అడవిలో తీగలా అల్లుకుపోయిన ఒక జీవన సంప్రదాయాన్ని గురించి వ్రాయాలని మొదలుపెట్టిన ఈ రాతల్లో అడవి గురించిన వర్ణనలు పెరిగి పోయాయా....అని అనిపిస్తుంటుంది. కాని అడవిలో అణువణువుని స్పృశించి వచ్చే గిరిజనుడి హృదయాన్ని అర్థం చేసుకోవాలంటే-అడవి తన అణువులో దాచుకున్న లావణ్యాన్ని కళ్ళతో-హృదయంతో ప్రేమించకుండా సాధ్యపడుతుందా? అడవి గురించి మాటలతో కాగితం పూల మాలల్ని కట్టడం దాని ఉద్దేశం కాదు. అది అడవి పువ్వుల రకరకాల సమిశ్రిత సౌరభాలతో హృదయాల్ని తాకాలి. అందులోని జీవితం గులాబి పూలముల్లులాగా చర్మాన్ని తాకి మన నాగరికత వికృత స్వభావాన్ని పరచాలి.

యిక్కడ గిరిజనుడి హృదయం కూడ అడవిలాగానే అమాయకమైనది. అది సముద్రంలా లోతు తెలియనివ్వని గంభీరత కలిగింది కాదు. అడవిలాగే స్పష్టంగా అగుపించే Picturesque లాంటిది. తొలిగా యిక్కడ అడుగుపెట్టిన వాడికి కొండ లెక్కడమూ కష్టమే-గిరిజనుడి గుండెను అర్థం చేసుకోవడమూ కష్టమే. కాని అది కంటి ముందు తన్నధిరోహించమని సవాలు చేసే కొండలాంటిదే. ఈ ఆశయం బలహీనమైన కాళ్ళకి కడుపులో 'దప్పిక' లేకపోయినా కొండలెక్కే బలాన్ని పోస్తుంది. గిరిజనుడి గుండెని జయించే ప్రేమని తాపుతుంది. యిక అప్పుడు ఒక మామూలు బడిపంతులు 'సత్యం' అయిపోతాడు. పోడు తప్ప ప్రపంచం తెలియని గిరిజనుడు 'అరికె సోములు' అవుతాడు.

సవర గిరిజనులకి అడవితో ఎంత అనుబంధం ఉంటుందో 'పిక్కరోళ్ళ' (పిల్లలు) పట్ల అంత అనురాగమూ ఉంటుంది. 'పిక్కరోల్ల'ని రోజ స్తమానూ ఒక గుడ్డతో మెళ్ళో జోలె కట్టుకొని అందులో మోస్తుంటారు. సంతకెళ్తే పిక్కరోల్లకి 'సుపో్ప' (జంతిక) బిస్కట్లో తీసుకురాక తప్పదు. అడవితో గిరిజనుడి ఆత్మీయత లాంటిదే పిక్కరోల్లకి తల్లిదండ్రులతో పెనవేసుకునిపోయి ప్రపంచాన్ని కుదించే

స్తుంది. అప్పుడు 'అన్నగాళ్ళు' అలా పెరిగిన యువకుడి ముందు యింకో ప్రపంచాన్ని ఆవిష్కరిస్తారు. మరో మనిషితో మాట్లాడే భాష పుస్తకాల్లో అక్షరాలుగా మారి వాడిని పలకరిస్తుంది. వాళ్ళు గుప్పిట తెరిచి ప్రపంచాన్ని చూపిస్తారు. గుండెని విప్పి ప్రేమను పంచుతారు. యిక వాడు అల్లుకున్న తల్లిదండ్రుల ఆత్మీయతని సున్నితంగా తప్పించి ఈ ప్రపంచంలోకి అడుగుపెడతాడు.

ఉదయం పదకొండు గంటల సమయం. కనుచూపుమేరంతా గోధుమ-బూడిద కలగల్సిపోయిన వర్ణంలో ఉంది. గాలి అప్పుడప్పుడు ఒక నిప్పుల పొరని విసురుకుంటూ పోతోంది. ఎండాకాలం ఎండ తన ధర్మంగా అగ్గివేడితో మండుతోంది. యిక్కడ సవరగూడలో 'సండీ' (మంచం) పైన కూర్చొని చూస్తున్నాను. సర్వసాధారణంగా ఈ సమయంలో గూడల్లో పిట్ట కూడా ఉండదు-యిది రోడ్డుకి యించుమించు దగ్గర్లో ఉంది మల్బరీ తోటల పెంపకం వగేరాలు వచ్చివున్నై. అందుచేత కొద్దిమంది గూడలో ఉన్నారు. స్త్రీలు సోళ్ళని మట్టినేలలో ఉన్న రోలులాంటి దాంట్లో పోసి దంచుతున్నారు. గూడలో ఉన్న నలుగురైదుగురు మగవాళ్ళలోను ఒక అతను 'పిక్కిరోన్ని' మెళ్ళో వేసుకొని ఉన్నాడు. అతని పక్కనే ఉన్న మంచంలో 6-7 సం॥ పిల్లవాడు వడదెబ్బకో-జ్వరానికో పడుకొని ఉన్నాడు. గూడలోకి అన్నగాళ్ళు అడుగు పెట్టడంతోనే చేస్తూవున్న పనిని వొదిలిపెట్టి 'అన్నగాళ్ల'కి 'డఆ' (డా అని అనేస్తాం-నీళ్ళు) యివ్వడం-అంబలి ఏర్పాటు చైటంలోను బొంగరంలా తిరుగుతున్న ఈ సవర యువతి విపరీతంగా ఆకర్షిస్తోంది. బాల్యపు పసితనం వీడని వయసు. సవరస్త్రీలందరి లాగానే పాతబడిన జాకెట్-బాగా మాసిపోయిన చీరె ముక్కనొకదాన్ని మొలకి ఆచ్ఛాదనగా ధరించి ఉంది. కాని ఆమె కళ్ళు... ! జీవితమూ-దానిపట్ల ఆశలు ఆ చిన్ని కళ్ళల్లో ఎంతగా మెరుస్తున్నాయంటే....మరణించే వాడికి సైతం అవి ఆశల్ని రేకెత్తించే దీపాల్లా మెరుస్తున్నాయి. ఆ ఆశలు-భవిష్యత్తు ఈవేళ సవర గూడల్లో ప్రతిమనిషి కళ్ళలోనూ ప్రవహించే భవిష్యదాశలకి సంకేతం. ఆ 'సంకేతం' యిప్పుడు అన్నగాళ్లతో 'అన్న'గా కల్సి అడుగులేస్తోంది.

ఈ 'సంకేతం' వయసు చెప్పడం కష్టం. అతనికి యిద్దరు పిక్కిరోల్లు కాబట్టి యితను పిక్కిరోడు మాత్రం కాదు. సవర గూడల్లో ఎక్కడైనా కనిపించే ఏ ప్రత్యేకతా లేని మొఖం. చిన్నవైన కళ్ళు-మొత్తం మొఖంలో పెద్దవిగా కనిపించే పెదాలు-అవి బీడీలో-చుట్టలో కాల్చి కాల్చి శరీరపు రంగులో కల్సిపోయి

నల్లగా ఉన్నాయి. ఇతను తడబడేమాటలతో తాను అన్నగాళ్ళతో కల్సిపోతానని చెప్పినప్పుడు వాళ్ళకి కదలబారుతున్న సవర యువతరం కళ్ళముందు కదలాడింది. ఆ క్షణమే అతను అన్నగాళ్ళకి 'పిక్కిరోడై' పోయాడు.

ప్రతిరోజూ చూస్తూనే ఉన్న అడవిని చీకటి కమ్ముకోవడం ఎప్పుడూ కొత్తగానే ఉంటుంది. హఠాత్తుగా వెలుగు అదృశ్యమైపోవడం-కళ్ళు మూసుకున్నా-తెరిచినా వొక్కలాగే అనిపించే చీకట్లో వెతికి అడుగులేసి నడవడం........ గూడ దగ్గరపడేకొద్దీ అనేకమంది గొంతులు ఏదో వొక సంబరాన్ని అలవోకగా మోస్తున్నట్లు ధ్వనిస్తున్నాయి. గూడకి దగ్గర్లోని పాక దగ్గర ఆగడంతోనే పదుల సంఖ్యలో వచ్చి మూగిపోయారు. హఠాత్తుగా ఒకలాంటి బొంగురుపోయిన గొంతు వినవచ్చింది. ఆ వెంటనే ఎత్తుగా లావుగా ఉన్న ఒక వ్యక్తి ప్రత్యక్షమైనాడు. మిగిలిన సవరలకి భిన్నంగా యితడు కొంత పొడవుగానూ-చాలా లావుగాను ఉన్నాడు. అంతే భిన్నంగా చిన్నపాటి పంచెలాంటిదాన్ని మొలకి చుట్టాడు. పొత్తికడుపు క్రిందికి వేలాడుతున్న బానలాంటి పొట్ట నున్నటి కాంతికి మెరుస్తోంది. దాన్నిండా విప్పసారా పట్టించాడని అతను రావడంతోనే అర్థమైపోయింది. కొండ మేకలాంటి గొంతుతో అతడు విచిత్రంగా అరుస్తూ రెండు చేతులూ బారసాచి "అన్నగాల్లా చ్చీరూ....." అంటూ అరిచి ఒక గెంతు గెంతాడు. వెంటనే బారసాచిన చేతులతో ఈ బక్కపల్చని కమాండర్ని ఎలుగుబంటిలాగా కావిలేసి-విప్పసారా వాసనతో ఘుమాయిస్తున్న నోటితో ఒక ముద్దు ప్రసాదించి అదే వేగంతో వెనక్కి వొక్కసారిగా గెంతి "అన్నయ్యా ...నువ్వే కమినిస్టి పార్తి అజ్జకుడివీ....." అని ఒకరాగం తీసాడు. హఠాత్తుగా ఆగి "నీను బోజిసెత్తాల" అని అచ్చం కొండమేక లాగానే పరుగుతీసాడు.

"ఏంటన్నయ్యా....హడావుడీ....." అని కమాండరొదిలిన ప్రశ్నకి సమాధానం చీకట్లోంచి వచ్చింది. "పిల్లికదా....."

మొత్తం సవరలందరూ 'పెళ్ళి' అనే పదాన్ని 'పిల్లి' అనే పలుకుతున్నారు. అంతకన్నా ఈ సవరల గొంతులో వారి భాషకి సంబంధించిన యాసలో పలికే తెలుగు విని తీరాలి. అసలే రాగాలుగా సాగే వాళ్ళ గొంతులో తెలుగు ఒక విచిత్రమైన మాధుర్యాన్ని సంతరించుకుంటుంది. సవర Idiomలో పలికే ఈ తెలుగులో ఆ భాషనించి వచ్చిన ఒక అంటీ అంటనట్లున్న తేనెలాంటి కవిత్వం ఎవరినైనా

అకట్టుకుంటుంది. "అన్నయ్యా....వాడు యిప్పుడురాడు....వాడి కల్లు సూడవు కదా!" ఈ 'కదా' అన్న చోట పదాన్ని విచిత్రంగా విరిచే తీరు సంగతి అలా వుంచి "కళ్ళు సూడవు".... "కాళ్ళు నడవ్వు".... "నోరు తినదు" లాంటి మాటలు సారంగి (ఏకతార)ని గోరుతో మీటినట్లు వినవొచ్చి అల్లుకుంటుంది.

యిదీ విప్పపూల సీజన్ కాబట్టి అందరూ ఆ మత్తులోనే ఉంటారు. సాధారణంగా గిరిజనుడు తాగని రోజంటూ ఉండదు. అది వ్యసనపరుడు తాగినట్లు అసహ్యంగా కాక ఒక సంప్రదాయంగా తల్లి పెట్టేదేదయినా తినే పసితనపు అమాయకత్వంలా ఉంటుంది. జీలుగు కల్లుని-'తల్లిపాలు' అనే పిల్చుకుంటారు. అలా చాలా తాగినా తడబడని అడుగులతో వచ్చి రెండు చేతులు తలమీద పెట్టుకొని "రిమ్మైపోయి నాన్నయ్యా...." అని నిలబడ్డాడు ఈ అన్న. అచ్చం పిల్లి (పెళ్ళికాదు) లాగా ఉండే మనిషి. వయసు నలభైపైనే వున్నా పిల్లిలాంటివాడు కాబట్టి చిన్నగా కనిపిస్తాడు. పాలూ-మాంసమూ లేక బాగా బక్క-చిక్కిన పిల్లిలా ఉన్నాడు. అతని చిన్ని ముఖంలో కళ్ళు బాగా గుండ్రంగా ఉండి అవి పిల్లి కళ్ళలాగే మెరుస్తున్నాయి. శ్రీకాకుళ పోరాటంలో పాల్గొన్న మనిషి. చాపు బులెట్ రూపంలో అతని మెడని సుతారంగా కొరికి వెళ్ళిపోయింది. అక్కడ కమిలిపోయిన చర్మం 'మెడల్' మాదిరిగా వేళ్ళాడుతోంది. మొట్టమొదటిసారి ఒక దారిలో యితను కల్సినప్పుడు సరదాకి వో పాట పాడమంటే ముఖాన్ని అచ్చం పిల్లిలాగే ముడిచి "దారిలో పాడకూడదు కదా...." అన్నప్పుడు ఆ గొంతులోని ఒకలాంటి Melody కి ఆకర్షితుడనై పోయాను. అదీ అంత మధురమైన గొంతేం కాదు. కాని చిన్నిపిల్లవాడు తాను పెంచుకున్న పిల్లి "మ్యావ్...." అనంటే సంబరపడినట్లు అతని గొంతులో అలాంటిదేదో ఉంది. అలాంటి గొంతుతో అతను,

"అనిదిలోన సోదరులంతా

అర్జునులై యిల్లంబులు పట్టిరి" అని అనాటి ఉద్రేకంతో పాడుతున్నాడు. కాని 'రిమ్మె' పోయినాడు కదా. పాట మర్చిపోయి సిగ్గుపడిపోయాడు.

"అన్నయ్యా... వీడు మన అర్జునుడు చూడు" అని ఈ గిరిజన అన్నని చూపగానే కళ్ళు మిటకరించి అతని ముఖంలోకి చూసి,

"అన్యున్నామ్" (నీ పేరేంటి ?) అని ప్రశ్నించాడు

సమాధానం చెప్పాడు

పాటలు :

## అయిలన్నకు జోహార్లు

—కరుణాకర్

జోహార్లు జోహార్లన్నో మా అయిలన్నా
నల్గొండ జిల్లాలోన మూలుకొండూరు ఊరిలోన
పోరుగడ్డ రక్తంతో గొల్లయింట్లో పుట్టినావు
నిరుపేదగా పుట్టి నీవు కష్టజీవిగా పెరిగినావు
పనుల కానుకుంటనేమో బతుకులోతు చూసినావు
కూలిపేగుల రైతు గుండెల పాతాల సదివినావు
కరువులోన పశువులాను రాజ్యాలు తిప్పినావు
మట్టి మనుష్యుల బాధలంతటా ఒక్కటేనని తెలుసుకొంటివి
భూస్వాముల సవాల్ చేస్తివే మా అయిలన్నా
సర్కారోనికి ఎదుట నిలిస్తివే మా అయిలన్నా

× × ×

---

"వనాగొర్జంగ్?" (పూరేమిటి?)
యిలా ఒక నిముషం మాట్లాడి దివిటీలా వెలిగిపోతున్న ముఖాన్ని పైకెత్తి "పీడు మా జాతోడే ..." అని ప్రకటించాడు.

అతని కళ్ళలో చిన్న నీటి పూట బయలుదేరింది.

ఈ అన్నని కావలించి వొదిలి రెండు అడుగులు వెనక్కివేసి మళ్ళీ అతని ముఖంలోకి వెతుకుతున్నట్లు చూసి అప్పుడే అమృతం తాగినట్లున్న గొంతుతో అన్నాడు. "యిదిగో తూటా దెబ్బ ..." మెడని చూపిస్తూ "సావల్సినోన్ని బతికి పోనానన్నయ్యా.... మా జాతోడు బాట (తుపాకి) పత్తాడు... అంటే గలాతం మొదలౌతుంది...." నీటిపూట బుగ్గమీదికి జారింది.

"వురేయ్.... అన్నగాడా.... నివ్ మా జాతోడివైన మరి అన్నగాడివి కదా! మేం గలాతం సేసినం.... సచ్చిపోనాం.... యీ అడివిల పావలావాటా రాజ్జెం వొచ్చింది. మిగతా రాజ్జెం మీరే లేవాలి...." అని — తడిసిపోయిన అతని Melodious గొంతుతో—

"ఆయిరిలోన సోదరులంతా
అర్జునులై యిల్లమ్ములు పట్టిరి"

అని పాడుతూ వెళ్ళిపోయాడు.

14-4-92

కాచిగూడ హాస్టల్‌లో 'రాడికల్' గా రాటుదేలి
శేషన్నను మదిలో నిలిపి స్వర్ణక్క దారిలోన
ఎన్నడూ భయపడకుండా అన్ని పనులు చేసినావు
మైళ్ళదూరం నడచుకుంటూ పోస్టర్లు చేసినావు
మీటింగ్‌లల్లో క్యాంపేయిన్లలో కష్టమనకా తిర్గినావు
సాదసీదా వేషంతో సాదాసీదా మాటలతో
విద్యార్థులను చేరదీసి బానిస చదువు గుట్టుచెప్తివి
తిలుగు వెలుగులన్ని చూసి మోసపోవద్దన్నావు
తల్లిపేగు తెంచుకోక పోరులోన కలవమంటివి
స్కూళ్ళలోన కాలేజిలల్లో పోరుబీజాలు నాటినావు
పోస్టర్లేస్తూ అరెస్టయ్యీ లాకప్పును పరిహాసిస్తిని
పేరుసైతం చెప్పకుండా ముప్పతిప్పలు పెట్టినావు
దోపులు మీరని జవాబిస్తివే మా అయిలన్నా
శిక్ష తప్పదని హెచ్చరిస్తివే మా అయిలన్నా
జైలు కొచ్చిన తల్లిదండ్రుల ఏడ్వద్దని చెప్పినావు
దోపిడీలు మానభంగాలు చెయ్యలేదు అన్నావు
ప్రజల మనిషినని ప్రజలబిడ్డనని గుండె ధైర్యం చెప్పినావు
దేశభక్తికి గుర్తులాని సంకెళ్ళు చూపినావు
జైలు నుండి కదనరంగంకు పరుగుదీస్తూ వచ్చినావు
అన్న లేరని, అన్న లేరని గల్లిగల్లి వెతికినావు
తల్లిదండ్రులు బంధుమిత్రులు ఎంత ఏడ్చినా ఆగలేదు
వర్గపోరు మరవనాని ప్రజాయుద్ధం వదలనాని
విప్లవమే నా బ్రతుకంటివా మా మనోజన్నా
విప్లవపార్టీ సభ్యునివైతివా మా మనోజన్నా

× × ×

మౌలాలి ఫ్రెష్ మార్కెట్ కార్మికులతో పనిచేస్తూ
కార్మికులను గుండెకద్దీ కన్నీళ్ళు తుడిచినావు
కన్నీళ్ళకు కష్టాలకు కారణాలు చెప్పినావు
ఐక్యంగా పోరాడితే గెలుపు మనదని చెప్పినావు
సమరశంఖం ఊదినావు సమ్మెలెన్నో నడిపినావు
లొంగని యజమాని ఆస్తిని కార్మికులతో తగులబెట్టి
పోరులోన గెలిపించి రివిజనిస్టుల రంగులేల్చి
ఆయుధాలు చేతికిస్తివా మా మనోజన్నా
వర్గపోరే నడపమంటివా మా మనోజన్నా

× × ×

రంగారెడ్డి జిల్లాలోన ధారూర్ దళంలోనా
పాదాలు పగిలి రక్తాలు కారగ అడవిదారులు ఆరదిస్తివి
భూమిపుత్రుల బాధలిని కసితోని రగిలినావు
ఊరినంత ఒకటి చేసి సంఘాలు పెట్టినావు
వర్గకసితో భూస్వాముల నెత్తురు కక్కించినావు
వంజరుల కలల్లోనూ వెంటాడి భయపెడ్తివి
పిల్లుంపల్లిలో సుట్టుముట్టిన సిఆర్‌పిఎఫ్‌ను ఉరికిస్తివి
సాయుధపోరే జవాబంటివే మా నాగన్నా
రైతుచేతికి రైఫోలిస్తివే మా నాగన్నా

× × ×

పార్టీ ఆజ్ఞను స్వీకరించి పటాన్‌చెరు వచ్చినావు
పటాన్‌చెరు - బొల్లారం కార్మికుల్ని కల్సినావు
కార్మికుల్లో కల్సిపోయి అలసెలురగక తిరిగినావు
మేనేజిమెంట్ల చాపుపుట్టుకలు వివరించి చెప్పినావు
శక్తిమీది యుక్తిమీది మేల్కొమ్మని చెప్పినావు
ఇంటర్నల్ యూనియన్స్‌కు పునాదులు వేసినావు
యూనియన్లు విప్లవంలో భాగమని చెప్పినావు

(6)

కంపెనీ డ్రెస్సులు విడవమంటివా మా కార్తీకన్నా
ఆలీవ్ గ్రీన్ వెయ్యమంటివా మా కార్తీకన్నా

× × ×

పటాన్ చెరు పోలీసులు నరరూప రాక్షసులు
ద్రోహి అండతో నిన్ను వలవేసి పట్టినారు
పరిహసించే నీ ముఖాన్ని బాయినెట్లతో పొడిచినారు
కష్టజీవి కడుపు పంటవు కసాపిసా తొక్కినారు
ముక్క ముక్కలు నన్ను నరికినా మాటలాడనన్నావు
చిరునేత ప్రాయాన వీరమరణం పొందినావు
ఆశయంకై ప్రాణమిస్తివా మా అయిలన్నా
వారసుల్నే నమ్ముకుంటివా మా అయిలన్నా

× × ×

నీ శవం చూసిన జనమంతా కుమిలి కుమిలి ఏడ్చినారు
సర్కారోన్ని కసిదీరా శాపనార్థాలు పెట్టినారు
అక్కలందరు తల్లులందరు నీ మాటల్నే చెప్తుంద్రు
నీ సెల్లు సభ్యులు యూనిట్ సభ్యులు కంటతడి పెట్టకుండా
నీ బ్రతుకు అర్థం తెలుసుకొన్నారు మా అయిలన్నా
నీ సావు బద్లా తీస్తమన్నారు మా అయిలన్నా

× × ×

నీ వర్గకసిని వర్గప్రేమను గుండె నిండా నింపుకుంటాం
కష్టమైన పనులన్నీ నీ వోలె స్వీకరిస్తం
నిర్బంధంలోనైనా ప్రజలమధ్యే బ్రతుకుతాము
విప్లవంపై పార్టీపైనా నమ్మకాన్ని సడలించం
నీ దారిలోనే మేము వస్తాము మా అయిలన్నా
నీ లక్ష్యాన్ని చేరుకుంటాము మా అయిలన్నా

("వందనాలు వందనాలమ్మో మా బిడ్డలు" అన్న బాణీలో పాడుకోవాలి.
పటాన్ చెరు బూటకపు ఎన్‌కౌంటర్‌లో అసువులు బాసిన క్రామేడ్ ఐలయ్య
(కార్తీక్, నాగన్న, మనోజ్) కు జోహార్లు)

# కన్నీటి దీపం

—తిర్మల్

ఈ నేల తడిసినా నెత్తురెక్కడిదో ?
ఈ అడవి రాలినా పువ్వు లెక్కడివో ??
కూటికి లేనట్టి కూలోల్లదేగా !
ప్రశ్నించి నిలిచినా పేదోల్లదేగా ! ? ఈ నేల
ఉక్కు బూట్ల దెక్క చప్పుడెక్కడిదో ?
ఊరు వాడయైన గాయమెక్కడిదో ?
అన్నమెట్టిన రైతు ఆర్తనాదమేగా !
రాతి గుండె మిల్ట్రీ రాకాసి పనియేగా ఈ నేల
ఏ చేతి సంకెళ్ళ సవ్వడినిపించెనో ?
ఏ జైలు గోడల అలికిడగుపించెనో ??
తెలంగాణ పల్లె తల్లడిల్లెనుగా !
చావులే సంబ్రంగ మారిపోయెనుగా !! ఈ నేల
తుపాకి పేలిన శబ్దమెక్కడిదో ??
తూటాకు రాలిన తుమ్మెదెక్కడిదో ??
ఖాకీలు అల్లేటి కట్టు కథలేగా !
ఎదురు కాల్పులన్నీ నరహత్యలేగా !! ఈ నేల
ఏ తల్లి కడుపిక్కడ కాలిపోయిందో ?
ఏ తండ్రి కలలిచ్చట కూలిపోయాయో ??
ఏడుస్తు సెలయేరు వెళ్ళిపోయెనుగా !
బండల్లా బడబాగ్ని దాచిపోయెనుగా !! ఈ నేల
గుండెల్లో దాచిన గుర్తు లెక్కడివో ?
మదిలోన మసలేటి రూపమెక్కడిదో ?
మార్పు కోరిన అన్నమాటలేగా !
కన్నీళ్ళ కదిలేటి దీపమేగా !! ఈ నేల

# సారా పొట్లాలొద్దు

—కోమల్

తవ్వేడొల్ల మూడుసోల్ల కైకిలాయెనే ఓ పిల్లా
కైకీలాయెనే
తిండికేమో గండామాయె తిప్పాలాయెనే
అప్పులకుప్పాలాయెనే    తవ్వేడొల్ల
పండుగొత్తె పబ్బమొత్తె కూరలాయెనే
సారా బీరులాయెనే
తాగెదనుకపాడుగాను ఆగదాయెనే
మనసూ నిలువదాయెనే    తవ్వేడొల్ల
పెద్దబిడ్డ పెండ్లి కెదిగె లేకపాయెనే
కొత్తా లేకపాయెనే
తాగుడింట్ల పీనుగెల్ల అగమాయెనే
బతుకూ భారమాయెనే    తవ్వేడొల్ల
పెండ్లిజేస్తె సావుజేస్తె తప్పదాయెనే
తప్పా తాగుడాయెనే
కల్లుసార కాడుగాల ముల్లెవాయెనే
ఇల్లుగుల్ల ఆయెనే    తవ్వేడొల్ల
బర్రెనచ్చి మూడువేలు సొమ్మువాయెనే
దిమ్మాదిర్గిపోయెనే
రంది మరువదాగవోతె అప్పులాయెనే
బతుకూ అంగడాయెనే    తవ్వేడొల్ల
జవుడాలని దడువతులని గొప్పలాయెనే
కులంతప్పులాయెనే
నలుగురోలె ఎగురవోతే నవ్వులాయెనే
నక్కావాతలాయెనే    తవ్వేడొల్ల

# సర్కార్ మీన తిరగబడతా !

—కోమల్

నేనేమి సేతూ నేనెట్ల వోదూ
భూమి పట్టన పగిలె - చెట్టేరాలె	నేనేమి
పాపిష్టి రాజ్యంల పైస గలగలమానె
ర్యాగటి పొలముల్ల రక్తాము చెమటోడ్చి
చేసిన కష్టాము చెయిజారి పోవట్టె	నేనేమి
మనసు మెత్తానాయె మన్ను బుసబుస పొంగె
నల్లాని తాళ్ళల్ల కల్లు దాగావోతే
తాగీ తాగక ముందె తల తిప్పనట్టె	నేనేమి

---

సర్గమంటి ఇల్లువదిలి సారలెందుకో
సారాజోరులెందుకో
పోరగాండ్ల కడుపుగొట్టి తాగుడెందుకో
తాగితన్ను డెందుకో	తవ్వేదొడ్ల
మనరొక్కం మనరక్తం మాయజేసెనా
మహమ్మారి అయెనా
సారా కాంట్రాక్టరేమో బల్సిపోయెనా
దొరల్ల గల్సిపోయెనా	తవ్వేదొడ్ల
సంసారం గుల్ల జేసె
పొట్లాడొద్దురో సారా పొట్లాలొద్దురో
ఆడోల్లు మొగోల్లంత ఒక్కటైతరో
బతుకూసక్కగైతదో	తవ్వేదొడ్ల

పోరి పెద్దదాయె పొలమమ్మి మనువిస్తి
కట్నం తేలేదాని కష్టపెట్టావట్టె
గ్యాసు నూనె పోసి కాలపెట్టావట్టె                నేనేమి

బిడ్డ పోయిందాని బాధతో నేనుంటె
చుట్టాలు చూడొచ్చి చులకనా జేసిరి
సావుజేసినంత సార తెమ్మన వట్రీ బీరు తెమ్మనవట్రి                నేనేమి

రాత దల్చుకోని దండిలో నేనుంటె
పచ్చోళ్ళు తెల్లోళ్ళు పార్టి నాయకులొచ్చి
ఓట్లకొరకు నోట్లె ప్యాకెట్లు పోసింద్రు
కల్తి సార తోటి కడుపుగాలవట్టె                నేనేమి

అప్పు పెరిగిందాని తిప్పల్లో నేనుంటె
పోలీసు దొరలొచ్చి ఠాణాల బిలిపిచ్చి
సారదాగూమని సావగొట్టావట్రి                నేనేమి

పాకెటలవాటాయె పడుపు గూలివాయె
కట్టుకున్న దాని పుస్తె తెంపుడాయె
పస్తులుండుడాయె నుస్తు గొట్టుడాయె                నేనేమి

చీకట్ల తిరిగేటి చిరుతాల పుణ్యాన
నెల్లూరు అల్లిన సెలతాల పుణ్యాన
సార సంగతి తెలిసె సర్కారు సంగతి తెలిసె
నే తిరగ బడతా సర్కారు మీన
పిడికిలి పడతా - నేను కదిలొస్తా
సార వద్దని చెప్పి బ్రాండి బందని చెప్పి
బతుకుదిద్దుకుంట బాగుజేసుకుంట                పిడికిలి

# తాగొద్దు తాగొద్దన్నా

—కోమల్

తాగొద్దు తాగొద్దన్నా ఓ గజ్జెల మోనారే
సార పాకిట్ తాగొద్దయ్యో ”
చచ్చిపోను తయారయ్యే ”
సంసారం వొట్టిమాయె ”
వండబోతె కుండాలేదు ”
కట్టబోతె బట్టాలేదు ”
తొడగబోతె రైకాలేదు ”
కల్లు సార బాగా తాగి ”
అడ్డమైన వడ్డాదేమొ ”
ఆరాతిరి ఎక్కడవోదు ”
పదిగొట్టె రాతిరికొచ్చి ”
తలుపులేమొ తన్నావట్టె ”
పదిగొట్టె రాతిరికొస్తె ”
ఎవ్వడాని తలుపుతీతూ ”
ఇంటోడివి తెలుసతపాయె ”
అద్దగంట సేపూ బయట ”
పిలుస్తుంటె తలుపుతీస్తి ”
సెటా సెటా సెంపలుగొట్టె ”
అయినవాయిన కూరాలేదే ”
అన్నమైన లేకాపాయె ”
ఇంటికొచ్చి దూముజేసె ”
దీపమేమొ మలుపూమానె ”
దీపం దిక్కు సూడంగానె ”
సెక్కరొచ్చి అడ్డంబాడె ”

[సిద్ధిపేట దగ్గర్లోని "మడిపడిగె" గ్రామంలో మద్యపాన వ్యతిరేక ర్యాలీలో పాల్గొన్న ఇద్దరు గ్రామీణ స్త్రీలు అప్పటికప్పుడే అల్లుకుంటూ పాడుతుంటే రాసుకున్న పాట. ఈ మూడు సారా వ్యతిరేక పోరాట పాటలు మంజీరా రచయితల సంఘం సౌజన్యంతో]

# దృశ్యం చెరిగిపోదు, మచ్చ మాసిపోతుంది

యం. యస్. ఆర్.

ఆ రైల్లోని ప్రయాణికులు
ప్రకృతి ఉయ్యాలలో కేరింతలు కొడుతున్నారు
ఒకరి గుండె నీడలో మరొకరు సేదతీరుతున్నారు
జీవిత సంఘర్షణలన్నీ కలబోసి మేలిమి రత్నాలను ఏరుకుంటున్నారు
పట్టాల కింది కంకరలా తమ కన్నీళ్ళను అదిమి పడుతున్నారు
లయాత్మకంగా శబ్దిస్తున్న మానవీయ ఉచ్ఛ్వాస నిశ్వాసాలపై
హఠాత్తుగా మందుపాతర పేలింది
మనుష్యులు ! మనుష్యులు !
సామాన్యులు ! ప్రజలు !
ఆఫీసుల్లో అక్షరాలై కరిగిపోయేవాళ్ళు
కార్ఖానాల కొలిమిలో లోహమై మండిపోయేవాళ్ళు
ఇల్లూ వాకిలే ప్రపంచంగా బ్రతికినవాళ్ళు
అందరూ సొంతం మా వాళ్ళే
మా తల్లిదండ్రులు !
మా అన్నదమ్ములు !
మా అక్కచెల్లెలు !
మా ముద్దు బిడ్డలు !
మా గురుపులు !
మా ఊపిరి !
మా కనుపాపలు !
మా ఉత్తేజం !
స్ట్రెచర్లపై తరలుతున్న మా గుండె తునకలు చూసి
మా మెదడులోని నరాలు పట్టాలు తప్పాయి

వర్గ పోరాటం లాబొరేటరి లో ప్రజాయుద్ధం ఎన్నడూ
ప్రజల కళేబరాలతో ప్రయోగాలు చెయ్యాలనుకోదు
నలుగురా ఆరుగురా అన్నది ప్రశ్నే కాదు
మృతశరీరాలు నిజం ! తెగిపడ్డ శరీరంగాలు నిజం !
వాళ్ళ పిల్లలు అనాథలుగా సమాజం పెంటకుప్పపైకి విసిరేయబడ్డారేమో
వాళ్ళ తల్లులు మరణించకుండానే చితిపై ప్రయాణం ప్రారంభించారేమో
వాళ్ళ తండ్రులు పిచ్చెక్కి శూన్యంలోకి జారిపోతున్నారేమో
వాళ్ళ దాంపత్యాలు తెరచాప చిరిగిన నావలయ్యాయేమో
వాళ్ళ బ్రతికుంటే
మేం కనిపించినపుడు మనసార కౌగిలించుకునేవాళ్ళేమో
ఆ చేతులు ఆప్యాయంగా గోరుముద్దలు తినిపించేవేమో
ఆ కళ్ళు ప్రజాయుద్ధానికి సెంట్రీ చేసేవేమో
జీవిత సంఘర్షణలో వాళ్ళు వర్గపోరాట చిహ్నాలుగా రాటుదేలేవాళ్ళేమో
యుద్ధరంగంలో సాయుధులై మాకు సహచరులయ్యే వాళ్ళేమో
వాళ్ళు చనిపోయినా
ఇక్కడ ఖర్చవుతున్న ప్రతి నయాపైసాలోనూ వాళ్ళ రక్తమింకింది
ఇక్కడ పేలిన ప్రతి తూటాలోనూ వాళ్ళ చెమట చుక్కలు దట్టించబడ్డాయి
ఇక్కడి విప్లవాచరణే వాళ్ళ జీవనసారం నుండి ఉద్భవించింది !

* * *

చర్య మా చేతుల్లోనే రూపుదిద్దుకుంది
మా మిలిటెంట్లే !
వాళ్ళు మట్టి మానవత్వమూ ప్రపంచంగా బ్రతికినవాళ్ళు
విప్లవాన్ని వ్యవసాయంగా స్వీకరించినవాళ్ళు
ప్రజా యుద్ధాన్ని నాగలిగా చేసుకున్నవాళ్ళు
మార్క్సిజానికి కొత్త పేజీలు చేర్చినవాళ్ళు
మిలటరీ తుఫానులో తూటాల వరదలో దృఢంగా నిలిచినవాళ్ళు

వసుధైక కుటుంబం కోసం కుటుంబ జీవనాన్ని కోల్పోయినవాళ్ళు
మరణశిక్షను మెడలో భూషణంగా ధరించినవాళ్ళు
స్వార్థాన్ని త్యాగం గునపాలతో బద్దలు కొట్టినవాళ్ళు
పెదవుల మీంచి వెన్నెల్ని దొర్లించినవాళ్ళు
ఆకాశాన్ని గుండెలో ఇముడ్చుకున్నవాళ్ళు
సూర్యుడ్ని రక్తకణాల్లో నింపుకున్నవాళ్ళు
భూమిని శరీరంగా చేసుకున్నవాళ్ళు
తమ అమరత్వాన్ని ఆశ్వాసంగా ప్రకటిస్తూ
విముక్తి రహదారులు నిర్మిస్తున్నవాళ్ళు

వాళ్ళకు లక్ష్యం అస్పష్టం కాలేదు
మార్గంలో మంచుతెరలు కమ్మలేదు
ఉత్సాహం ఎత్తుగడలు తలక్రిందులు కాలేదు
తెలంగాణలో మృత్యువుకు మాత్రమే ప్రజాస్వామ్యం వుందన్న
సత్యాన్ని ఆవిష్కరించే ఆవేశపు క్షణాలలో
ఈ పొరపాట్లు !
నిజమే
పొరపాటు అన్న పదం దుర్ఘటన ముందు మరీ మరుగుజ్జు పదమయి పోయింది
మా పశ్చాత్తాపం కనీసం శవాల మీది తెల్లబట్టలనయినా తొలగించలేదు
మా సానుభూతి కనీసం తెగిపడ్డ శరీర అంగాల్ని వెతకలేదు
ఆ విస్ఫోటనం ! ఆ విధ్వంసం ! ఆ దృశ్యపరంపర !
మా గుండె గడియారంలో సెకెండ్ల ముల్లయి పొడుస్తోంది
ప్రతి మిలటరీ చర్యముందు కాషనై హెచ్చరిస్తోంది
మేం పుట్టుకతో తుపాకి చేతబట్టుకొని వచ్చినవాళ్ళం కాదు
ఆంబాడుతూ మందు పాతర్లతో ఆడుకున్నవాళ్ళం కాదు
కాయకష్టం చేయటంలోనే ఈ చేతులు సంవత్సరాల తర్ఫీదు పొందాయి
మా మెదడూ గుండెకాయా స్విచ్‌లకూ ప్లగ్‌లకూ వైర్లకూ నిలయంకాదు

అయినా
మరణించిన వ్యక్తుల సాక్షిగా తెగిపడ్డ శరీర అంగాల సాక్షిగా
పెర్రరిస్టుగా కరుడు కట్టున్న రాజ్యాన్ని
అత్యంత జాగ్రత్తగా ఎదుర్కొంటాం
మనుష్యులందరమూ కల్సి
రాజ్యాన్ని అదృశ్యం చేసి
భూమ్మీద మానవత్వాన్ని మాత్రమే సుస్థిరం చేసే రోజు తప్పక తెస్తాం

(దక్షిణ్, నవజీవన్ ఎక్స్‌ప్రెస్‌ల దుర్ఘటనపై)

---

ప్రజలకు క్షమాపణలతో......

## 'మృత్యుదాహం' కవిత ఉపసంహరించుకుంటున్నాను

కాకతీయ రైలుబోగీ 90 అక్టోబర్‌లో తగులబెట్టినపుడు అది శత్రు కుట్ర ఫలితమని ఖండిస్తూ కామ్రేడ్ గద్దర్, నేనూ పత్రికా సమావేశంలో చెప్పాం.

నేను 90 అక్టోబర్ 1 నవంబర్ సృజనలో 'మృత్యుదాహం' కవిత రాసాను. అదే సంచికలో రీచ్‌స్టాగ్ దురంతంతో, కాకతీయ యూనివర్సిటీ ల్యాబ్స్ దహనంతో పోలిక తెచ్చేందుకు ఆ చారిత్రక పత్రాలను, కరపత్రాలను సృజన ప్రచురించింది.

కాకతీయ రైలు విషయంలో దాహకులు శత్రువులు కాదు హతుల వర్గ బంధువులేనని అత్యంత విషాదకర వాస్తవం ఆలస్యంగానైనా వాళ్ళే ఒప్పుకున్నారు.

ఈ వెలుగులో ఈ సంచికలో అచ్చయిన కా. ఎం ఎస్ ఆర్ 'దృశ్యం చెరిగి పోదు, మచ్చ మాసిపోతుంది' – కవితలో పశ్చాత్తాప దగ్ధ సంక్షుభిత హృదయా విష్కరణతో వ్యక్తమయిన స్పిరిట్‌తో మమేకమవుతూ నేను 'మృత్యుదాహం' కవితను ఉపసంహరించుకుంటున్నాను. ప్రజలకు బహిరంగ క్షమాపణలు చెప్పు కుంటున్నాను.

చారిత్రక పత్రాలు ప్రచురించి పోలిక కూడ తెచ్చినందుకు సృజన తరపున కూడ పశ్చాత్తాపం ప్రకటిస్తున్నాను.

నవంబర్ 20, 92. —వరవరరావు

---

ద

## తప్పదు

—క్రాంతి

ఓ ముఖ్యమంత్రి దొరా
ఓ పోలీసు దొరా
మేం అన్నల సాయిత పట్టంగని
నూర్రూపాయల అప్పు క్రింద
మా షావుకారిగాడు గుంజిన
నా ఎకరం పొలం వాపసు ఇప్పిస్తరా ?
మేం అన్నల జోలికి అసలే పోముగని
కట్నం తేలేదని నా బిడ్డను సంపినోళ్ళను
పట్టి నా కడుపుకోత దీరుస్తరా ?
మా తాత, మా అయ్య, నేను
ఎనకట్నించి దొరకు జీతమే
ఉండబడ్తిమి, కూడు గుడ్డ లేక సావనేబడ్తిమి
జర నా కొడుక్కన్న గింతంత సదువు జెప్పిస్తరా ?
మా కూలి నాళోళ్ళ బిడ్డలకు
నౌకర్లల్ల కొంచెం వాటా యిస్తరా ?
మీరమ్మే సారానే తాగి
నేను మా పాలోడు తన్నుకుంటె
అమీన్ సాబచ్చి కేసుపెట్టి
యూడాదీ కాలం కోర్టుసుట్టు దిప్పిచ్చె
నా ఎడ్లబండి నమ్ముకుంటి
నా బండి నాకు మళ్ళొస్తదా ?
అన్నలకు అన్నం, నీళ్ళు ఇయ్యకుండ్రిరా అని
ఓకాన్నుంచి మమ్మల్ని బాదుకుంట
బూములు పంచుతం, జాగలు పంచుతమని
చెప్పబట్టి ఎన్నేండ్లాయె ?
మా అన్నలు, అక్కలతోపాటు
ఊళ్ళె ఉట్టోళ్ళను, పచ్చోళ్ళను ఎందర్ని పొట్టన బెట్టుకోలె ?
ఇప్పుడు గుర్తొస్తానయ్

## తోరణం

—యెన్నం సత్యం

కడుపు ఆర బెట్టుకొని కూడబెట్టిన డబ్బు, కట్నంగా మార్చి
నీ కళ్ళ మెరుపులు స్టీలు గిన్నెల్లో నిగ నిగా మెరిపించావు !
నీ ఎముకల గూళ్ళనే డెకోలం మంచాలుగా మలిచి
ఎంచక్కా నిలబెట్టావు !
నీవు కొన్న బీరువాను, వాళ్ళు తెరిచినప్పుడళ్ళా
నీవు ఓ ఈజిప్టు 'మమ్మీ'
ఎండిన శవంలాగా కనిపిస్తావు !
అయినా ఎంత ఓర్చినా ఫలితమేం దక్కిందని !
అక్షింతలు అపనిందలుగా మారనే మారాయి.
నీ కూతురు బతుకు వాళ్ళ పెళ్ళిలో
తిని పడేసిన 'విస్తరాకు'
కుక్కలు చింపినట్టే చేశారు.
ఎత్తుకుపోయినవాళ్ళ షరతులను నువ్వు ఎంత తట్టుకున్నా
చివరికి నీ కూతురు ఎండిన 'తోరణమై'
రాలేపోయింది.
ఇక ఇప్పుడు బాధపడి చేయగలిగిందేముంది.
ఆమె పెంపకాన్నంతా మల్లెపందిరికింద నిలబెట్టి
చంద్రుడిలో కుందేలును చూపించావే తప్ప !
'అబల'ల కన్నీటి చుక్కలే ఒక్కొక్కటై
అమావాస్య చీకట్లను చీల్చే
చుక్కలవుతాయని
చెప్పలేక పోయావు.

---

మా అన్నలు జెప్పిన మాటలు
ప్రపంచంల ఎన్నడు ఏ రాజు, ఏ మంత్రి గూడ
మా బోటోళ్ళను మనుషులుగ సూడలేదని
మర్లబడి లడాయి జేత్తినె జర వాళ్ళండ్ల
కలుపుకున్నరని
తలవంచుకున్నంత కాలం సాగిచ్చుకుంటరని
వర్గాలు పోవల్నంటె 'వర్గపోరు' తప్పదని

26—03—92

# సోమాలియా ఆక్రందన

మంజీర

అయ్యా ! సామ్రాజ్యవాదులారా !
మిమ్మల్ని మీరే ప్రపంచ రక్షకులుగా
ప్రకటించుకున్న మహానుభావులారా !
మాకు కొంత ఆహారం పంపండి
సోమాలియాను రక్షించండి

ఇరాన్‌లో 'నోఫ్లైజోన్' ఏర్పాటులో మీరు
బోస్నియానే పట్టించు కోలేనంత
తీరిక లేకుండా వున్నారని తెలుసు
అయినా, ఆలస్యం జరిగితే మా
45 లక్షల ప్రాణాలు ఏ క్షణమైనా పోవచ్చు

మేము ఆహారం అడుగు తున్నది
పచ్చగ విలసిల్లిన సోమాలియా
ఎండిన డొక్కలతో నిండిపోయింది
మీ ఇనుప గజ్జెల నవ్వడి వల్లనే అనికాదు
అంత సాహసం మాకు లేదు

ధరల నియంత్రణ కోసం అంతులేని ధాన్యాన్ని
సముద్రం పాలు చేస్తున్నారనీ కాదు
సొంత దేశంలో కార్మికుల పట్ల నే లేని దయను
మేము ఎలాగూ ఆశించలేము

అందరికీ సరిపడా ఆహారం కావాలని
మేమంతకన్నా ఆశించలేదు
అందుకు బ్రతకాలన్న కోరిక మాకుంచే చాలదు
మీ మార్కెట్‌కు ఉపయోగపడని
మా బ్రతుకులకు విలువేముంది

శక్తి లేక సుట్లుడిగిన మా స్త్రీల
ఎండిన స్తనాలలో పాలైనా లేవు
మిగులు తారనుకున్న మా పిల్లలు
పెనంపైని చీమల్లా
కళ్ళముందే రాలిపోతున్నారు

ప్రచ్ఛన్న యుద్ధం పరిసమాప్తి తర్వాత
మిగిలిపోయిన అణుబాంబులు
మాపై వేసి విముక్తి ప్రసాదించమని అడుగలేము
లొంగని సద్దాముల కోసం
మీ కవి అవసరమని తెలుసు
పైగా మాకు చివరి నిముషం వరకు
ఆకలితోనే అయినా బ్రతకాలని వుంది

చుట్టూరా శవాల కుప్పలతో
ఆకలి జాగరణ చేయలేకున్నాము
మా సహోదరులను పూడ్చడానికి
శక్తి కూడా లేకుండా వున్నాము

ఇరాక్‌లో మీ విందుకు కడుపుబ్బరం తగ్గని
గద్దలు మా దేశం వైపు ఎగరడమే లేదు
మాంసమే లేని ఎండిన బొంగులను
నక్కలైనా ఈడ్చుకుపోవు

అందుకే మాకు కొద్దిగా ఆహారం పంపండి
మా సహోదరుల శవాలను పూడ్చే శక్తి కోసం
మాలో కొందరికే, కొంత కాలమే అయినా
సామ్రాజ్యవాదులారా ! ఆహారం పంపండి.

× × ×

ప్రపంచ ప్రజలారా ! వినండి
సోమాలియా ఆక్రందన
సామ్రాజ్యవాద మృత్యువు
అది ప్రపంచ ప్రజల ప్రబల శత్రువు
దాని విషపు కాటుకు సోమాలియా
విల విల లాడుతున్నది
జాతి యే మొత్తంగా హతమవుతున్నది

సామ్రాజ్యవాదాన్ని అంతంచేసి
మానవాళిని కాపాడండి
జీవన్మృత సోమాలియాకు
శాంతిని చేకూర్చండి

సామ్రాజ్యవాద మృత్యువు
అది మాయలు నేర్చిన శత్రువు
మీకే తెలియక విషాన్ని
శరీరంలో చొప్పిస్తుంది
దేశంలో వెదజల్లుతుంది

పసిపిల్లల చాక్లెట్లలో
కనిపించని నికెల్ దాని విషం
బహుళజాతి కంపెనీలు
మందుల రూపంలో అమ్మే
ఆంటీబయాటిక్‌లు దాని విషం
స్వదేశీ రకాలను నాశనం చేసి
అంతర్జాతీయ సంస్థల ద్వారా అందించే
వి త్తనాలలో ఉంది దాని విషం

నీ జాతిని నిర్వీర్యం చేయడానికి
ప్రవేశపెట్టే సంస్కృతి దాని విషం

వేలాదిని బలిగొన్న
భోపాల్ విషవాయువుగానో
ఎన్నటికీ తీరని ఆఫ్రికా కరువుగానో
దేనికీ వినకుంటే అణ్వాయుధాల వానగానో
సామ్రాజ్యవాద మృత్యువు
మీపై దాడి చేస్తుంది
మిమ్మల్ని బలిగొంటుంది

సామ్రాజ్యవాద మృత్యువు
అది మానవాళికే శత్రువు
"గార్డెన్ ఆఫ్ ఈవ్" ఆఫ్రికాఖండంలో

పుల్లల వంటి కాళ్ళు చేతులు
ఎండిన డొక్క, ఉబ్బిన పొట్టతో
వింతజంతువులుగా మిగిల్చి
మానుండి మానవతను తుడిచేసిన
పిశాచం సామ్రాజ్యవాదం

సామ్రాజ్యవాద మృత్యువు
చరిత్రకు క్రూర శత్రువు
మానవాళిని కాపాడడం కోసం
సామ్రాజ్యవాదాన్ని అంతమొందించండి

ప్రపంచాన్ని మీ కోసం, మా కోసం
మనందరి కోసం రక్షించండి

# జీవచలనం

—నారాయణ స్వామి

అవునూ
మనం మాట్లాడుకునేది
సరికొత్త భాష కదా !
శరీరాలు స్పృశించలేని భాష
ఊపిరిలో నిలబెట్టిన భాష
కరచాలనం చేసినపుడు
కలయికల కందని భాష
సంభాషణల్లో సజీవమయ్యే భాష
బాహ్యావశేషాల్నధిగమించి
మనిషి అంతస్సౌందర్యాన్ని ప్రకటించే భాష
ఇప్పుడు మనం పలకబోయే
మాటల అంచుల మీదే
మనుషులిక నడవడం ప్రారంభిస్తారు
మనం కనుక్కోబోయే
వినూత్న పద చిత్రాల్లోంచే
కొత్త నాగరికత రూపుదిద్దుకుంటుంది

ఇన్నిసార్లు వ్యాకరణ సూత్రాలని వుల్లంఘించాం కదా
మనకిక సింటాక్సెందుకు
ఇన్నిసార్లు భాషల అర్థాన్ని మార్చేసాం కదా
మనకిక సెమాంటిక్సెందుకు
ఇప్పుడు ఏ నిఘంటువూ లొంగదీసుకోలేని
భాష మాట్లాడుదాం

ఏ మాటలోనూ ఇమడని అర్థాన్ని
ఏ వ్యాకరణ సూత్రంలోనూ
సరిపడని నిర్మాణాన్ని మాట్లాడగలిగే భాష మనది
ఏ రాజ్య హస్తాల్లోనూ ఇరికిపోనిది
ఏ శతాబ్దపు సంకుచిత సరిహద్దుల్లోనూ నలిగిపోనిది
మనిషి సంచరిస్తోన్న విశ్వాంతరాళాల్లో
అనంతంగా సాగుతోన్న భాష
ఇది నాగరికతల వ్యాపారాల రాజ్యాంగాల
మార్కెట్‌ల కఠినమైన పదజాలం
ఇద్దరు మనుషులు మనసారా మాట్లాడుకునే
అతి సాధారణ జీవచలన భాష
ఏ కల్మషమూ లేని స్వచ్ఛమైన స్ఫటిక భాష
ఇప్పుడు మనం నిర్మిస్తోన్న ఈ భాషా సౌధం
ఆకాశంలాగే వుంటుందీ వుండదూ
విశాలమూ వినీలమూ వృత్తి నీటి పొగా
నీలి కాంతి తెర -
రేపటి కోసం నిన్నని ధ్వంసించి రాస్తోన్న వర్తమానం
మనిషిని ప్రేమగా ఆప్యాయంగా స్పృశించే
సకల చరాచర ప్రాకృతిక దర్శనం -

ఔనూ
ఇప్పుడు మనం భాష గూర్చి స్వప్నిస్తున్నామా
స్వప్నం గూర్చి సంభాషిస్తున్నామా
స్వప్నాలని భాషగా మార్చి
కొత్త కాలాన్ని రూపొందిస్తున్నామా

సన్నిహిత ఆప్తులని కోల్పోయి
ఏకాంత కుడ్యంలో చెమర్చే కళ్ళు
కట్టిపడేసినా గాలి అలల సవ్వడిలో

కదలికలు వెదుక్కునే అవిచ్ఛిన్న చలనమూ
నిషేధించబడ్డ మానవులు రహస్యంగా
సంకేతించుకునే విప్లవ పరిభాషా
వీటిని కదూ మనం అనుసృజిస్తున్నాం
ఇప్పటికీ
ఈ కాలాన్నీ ఈ స్థలాన్నీ
సంపూర్ణంగా సంభాషించగల భాష ఏదీ దొరకదు మనకు -
ఆ మాటకొస్తే
ఏనాడయినా వర్తమానాన్నందుకునే శక్తి ఏ భాషకుందీ ?
భవిష్యత్తును యిక భాష కాదు
చేతులే కేవలం చేతులే
కలలు కన్న చేతులే
చూపుల్ని ఎక్కుపెట్టిన చేతుల సామూహిక శక్తే అందుకోగలదు
ఆ శక్తిని వర్ణించే స్వరూపం
ఏ భాషకున్నదీ మనం మాట్లాడుకోవడానికి ?
అయినా మనం ధ్వనులు చేద్దాం
శరీరాన్ని వొక సాధనంగా
మన మానసిక భౌతికావస్థలని ప్రతిధ్వనించే
అపురూప ధ్వనుల్ని భాషకందిద్దాం
ఇప్పుడూ ఎల్లప్పుడూ
భాషని నిర్మించే సైనికులం కదా మనం
మన శరీరాలమీంచి చెమట చుక్కలు
రాలిపడ్డ ధ్వనులే
కొత్త భాషనూ కొత్త చరిత్రనూ
చెక్కుతూ వుంటై !

(భాషను శుభ్రపరిచేది కవులు కాదు ప్రజలే....)

(ఆగస్ట్ '92)

కథ

# జాడ

—పి. శశిధర్

"వాణ్ని ఇక ఈ జన్మకు చూడగలుగుతానో లేదో ?" అది ఆవేదనో, ఆందోళనో తెలియకుండా తనలో తాను గొణుక్కుంటూ సుజాత రైలు దిగింది. తుఫాను గాలిలో మొదలంటా కదిలిపోయే చెట్టులా వొణుకుతూ ఈ మాట ఆ రోజు ఉదయం నుండి లెక్కలేనన్ని సార్లు అనుకుంది. ఒక్కొక్క చినుకే కురిసి కురిసి పాయలు పాయలుగా బయలుదేరి నీరు సముద్రం చేరినట్లుగా సుజాత ఆలోచనలు సాగి సాగి 'వాడి' దగ్గరే ఉంగలు చుట్టుకపోతున్నాయి. వాడు అంటే సుజాత తోబుట్టువు.

ఆ చిన్న రైల్వేస్టేషన్లో కలో, భ్రాంతో తెలియనంత సందిగ్ధంలో సుజాత రైలు దిగే సమయానికి సాయంత్రం వెలుగు చీకట్ల సందిగ్ధంలో నుండి క్రమంగా చీకటి ముసురుకుంటోంది. సుజాతలాగే దిగిన ప్రయాణీకులు చాలా తక్కువమంది. ఎక్కింది కూడా చాలా తక్కువమందే. ఎత్తు తక్కువగా ఉన్న ప్లాట్ఫాం మీదికి దిగుతుంటే సుజాత కాళ్ళు వణికాయి. తూలి పడుతుందేమోననుకొని కాబోలు వెనక నుండి "పదిలం-పదిలమక్కా" అంటూ ఎవరో దించారు.

సుజాతలాగే ఆకాశం ఉరుములతో, మెరుపులతో తల్లడమల్లడంగా ఉంది. చినుకురాలదు....ఘర్షణ ఆగదు. ఉధృతంగా వీస్తున్నగాలికి స్టేషన్లోని పాతకాలపు రావిచెట్లు మొదలంటూ ఊగిపోతున్నాయి. గాలిరేపిన దుమ్ముకు స్టేషన్ మాపురు గప్పినట్టుగా ఉన్నది. స్టేషన్ మాష్టర్ గదిలో ఎవరో అటిటు తిరుగుతున్నారు. స్టేషన్ మాస్టర్ గది పక్కనే గల వేయిటింగురూంలో స్టేషన్ను తీవ్రవాదులనుండి రక్షించడం కోసం నియమించబడిన పోలీసులు ఆక్రమించుకున్నారు. పోలీసుల్లో ఒకడు ఇసుకబస్తాల మాటున నిలబడి తుపాకితో సెంట్రీ చేస్తున్నాడు.

సుజాతకు ఆ గాలి, అక్కడి వాతావరణం ధ్యాస ఉన్నట్టే లేదు. నెత్తిమీది కంటా కొంగు లాక్కొని ప్లాటుఫాం దాటుకొని స్టేషన్ వెనుకకు వచ్చింది. గాలిలో ప్రయాణీకుల సందడేం విన్పించడంలేదు.

స్టేషన్ వెనుక అడ్డదిడ్డంగా పెరిగిన ముసలి తుమ్మచెట్లు-నిశ్శబ్దంగా ఉన్న

నాలుగైదు రైల్వే క్వార్టర్లు-సరిగ్గా స్టేషన్ వెనక నుండి ముసలి తుమ్మలను చీల్చు కొని మట్టిరోడ్డు తూర్పు దిశకు సాగుతోంది. స్టేషన్‌కు కొద్ది దూరంలో ఒక ముసలి తుమ్మ కింద హోటల్ గుడిశెలో గుడ్డి లాంతరు గాలికి రెపరెపలాడుతోంది. ఒక రిద్దరు ప్రయాణీకులు నడువవల్సిన దూరానికి మజిలీగా హోటల్ ముందు నిల్చు న్నారు. ఎప్పుడో యాభయేళ్ళ క్రితం కులాంతర వివాహం చేసుకొని ఊరు విడిచి వచ్చి స్థిరపడి ఇరువై ఏండ్ల క్రితం భర్త మరణించగా ఒంటరిగా ఆ స్టేషన్నే నమ్ము కొని బతుకుతున్న రాధమ్మ రైలు దిగిన ప్రయాణీకుల గిరాకి కోసం ఎదురు చూస్తోంది.

సుజాత ఇవేవి పట్టించుకోకుండా మట్టిరోడ్డు మీద నడుస్తోంది. ఆమె మెదడు నిండా తమ్ముడే నిండిపోయాడు. ఆమె తనువెల్లా తమ్ముడే తచ్చాడుతున్నాడు. ఆమె కడుపులో దుఃఖం సుళ్ళు తిరుగుతోంది. ఆ దుఃఖానికి ఎంత వెతికినా ఆది, అంతం కన్పించడంలేదు.

బొయ్యిమని గాలి రేగుతోంది. పైన ఆకాశం ఉండీ ఉండీ ఉరుముతోంది. మెరిసిన మెరుపులో 'బిజిగిరి' దాని పక్కలా సకల దుఃఖాలను దాచుకున్న పంట భూములు నిశ్శబ్దంగా పడి ఉన్నాయి. సుజాత తలెత్తి చీకటి నిండిన ఆకాశంలోకి చూసింది. కుడివైపున గుట్టమీది మైక్రోవేవ్ స్టేషన్లో పచ్చలైటు రాత్రిపూట పులి కన్నులాగా పచ్చగా మెరుస్తోంది.

"ఇప్పుడు వాడెక్కడున్నాడో ?" రెపరెపలాడే గాలిలో ముందుకు నడుస్తూ అనుకున్నది.

నిర్మానుష్యమైన మట్టిరోడ్డుమీద శబ్దం చేస్తూ ఒక పెద్దబండి రావడం కన్పిం చింది. "ఎవరవ్వా ! సీకటిబడ్డది. ఎంబెవలు లేకుంటనే పోతన్నవ్-రైలచ్చిందా ?" ఒక గొంతు సుజాతను పరామర్శించింది.

సుజాత మరేదో లోకంలో ఉన్నట్టు ఆగకుండా ముందుకు సాగింది.

బండి చప్పుడు, గొణుగుడు గాలి శబ్దంలో కలిసిపోయాయి.

"ఎన్ని హింసలు పెడుతున్నరో వాణ్ని" సుజాత పెదవులు వణుకు తున్నాయి. వద్దు వద్దనుకుంటూనే ఇలాంటి ఆలోచనలు-

"ఈ రాత్రి ఎక్కడని తిరిగేది ? వాని జాడ ఎట్లా తెలుసుకునేది ? సుజాత

ఒక నిమిషం నిలబడిపోయింది. అనేక ప్రశ్నలు వచ్చాయి. కాని ఇంతదాక ఈ ప్రశ్న రాలేదు సుజాతకు. ఒక మహోద్ధృతమైన ఆవేశంలో ఇంటినుంచి బయలుదేరి స్టేషన్లో దిగేదాకా ఇలాంటి ప్రశ్నే వేసుకోలేదు సుజాత. ఎందుచేతనో సుజాత మనసు ఆ ప్రశ్నమీద నిలువలేదు. తనకు తెలియకుండానే తిరిగి నడవసాగింది.

ఉధృతంగా వీస్తున్న గాలి ఆమెను రోడ్డుమీద ఒక పక్కకు ఈడుస్తోంది. ఆమె కట్టుకున్న లేతాకు పచ్చరంగు కాటన్ చీర గాలికి రెపరెప కొట్టుకుంటోంది. పద్దెనిమిదేండ్ల వైవాహిక జీవితంలో వేళకు తిండి తినక, నిద్రపోకా తప్పని ఇంటి చాకిరిలో ఆమె దేహం చీకిపోయింది. చౌటినేలలాంటి కుటుంబ జీవితంలో సన్నబడి తెల్లగా పాలిపోయింది. ఇదమిద్ధంగా సుజాతకు తెలియని ఒక బలీయమైన విశ్వాస మేదో ఆమెను బతికిస్తోంది కాని సుజాత శారీరక స్థితిని బట్టి ఆమె బతుకాల్సింది కాదు. ఇప్పుడు కూడా ఈ చీకటి నిండిన వర్షాకాలపు రాత్రి కూడా సమస్త సంసారిక బంధనాల కట్టుదిట్టాలను త్రెంచుకొని పరుగెత్తుకొని వచ్చేలా చేసింది ఆ విశ్వాసమే.

భర్త ఉద్యోగరీత్యా సుజాత బొగ్గుగనుల 'కాలరీ'లో ఉంటోంది. నిన్నటి రోజు ఉదయాన్నే పత్రికలల్లో ఆమె తమ్ముని అరెస్టువార్త అచ్చయ్యింది. ఆ వార్తను సుజాత అలక్ష్యంగా చూసింది.

సుజాత భర్త మధుసూదన్ బలవంతంగా దినపత్రికను బందు చేయించాడు. పిల్లల చదువు పాడవుతున్నదని అతను చెప్పిన కారణం అయితే అతని మనసులో ఉన్న కారణం తనకు తెలుసు. నక్సలైట్లను జైల్లనుండి వదిలివేసిన కాలం-అప్పుడు సుజాత తమ్ముడు కూడా అనేక మందితోపాటు వరంగల్ జైలు నుండి విడుదలయ్యాడు. ఆ విడుదల వార్త పత్రికలల్లో రెండు రోజుల ముందే వచ్చినా సుజాత చూడలేకపోయింది. ఆ కారణంగానే జైలుదాకా వెళ్ళలేకపోయింది. సుజాత తమ్మున్ని చూడలేకపోయింది. అక్కడి నుండే అతనెవరితోనే తన మంచిచెడ్డలు విచారించి అటునుండటే అజ్ఞాతవాసంలోకి పోయాడు.

అప్పటి నుండి సుజాత భర్తను ధిక్కరించే పత్రిక ఇంటికి తెప్పిస్తున్నది. భర్త ఊహించినదానికి సరిగ్గా వ్యతిరేకంగా సుజాత పత్రికద్వారా లోకంతో సంబంధం కలుపుకోవటానికి ప్రయత్నం చేసింది. తనుపుట్టిన ఊరైన బిజిగిరి పరిసర ప్రాంతాల్లో జరుగుతున్న సంఘటనల తాలూకు వార్తల కోసం— ఆ వార్తల్లో తన తమ్ముని

ఉనికి కోసం ఆమె రోజు ఎంతో ఆసక్తితో వార్తాపత్రిక కోసం ఎదురుచూసేది. ఇదీ చెప్పకపోయిన తన భర్తకు తెలుస్తూనే ఉన్నది. నెలరోజుల క్రితం జరిగిన తీవ్ర వాగ్యుద్ధం తర్వాత ఆ ఇంటికి పేపరు రావడం ఆగిపోయింది. ఎప్పటిలాగే తీవ్రమైన నిరసనతో సుజాత మిన్నకుండిపోయింది. కాని సుజాత అంతరంగం వార్తల కోసం వెతుకుతూనే ఉండేది....పక్కయింటి నుండి పేపరు తెప్పించుకొని చదివేది.

ఆ రోజు భర్త డ్యూటీకి, పిల్లలు స్కూలుకు వెళ్ళిన తరువాత పక్కింటి పేపరు చూస్తే పిడుగులాంటి వార్త. "తన తమ్ముణ్ని పోలీసులు అరెస్టు చేశారని" వాడి సంబంధీకులెవరో ప్రకటన చేశారు.... "అలాంటిది మేమెరుగం" పోలీసులు ప్రకటించారు....

సుజాతకు మెదడు మొద్దుబారిపోయింది. సకల చేష్టలుడిగిపోయి ఆ ఉదయం మధ్యాహ్నం చెప్పుకోవడానికి మనిషిలేక తల్లడిల్లిపోయింది. తన సమస్త కలల ప్రపంచం చెదిరిపోయినట్లుగా మంచంలో పడి వెక్కి వెక్కి ఏడ్చింది ...తమ్ముడు తన ప్రతి చర్యను గమనిస్తున్నట్లే- ఆ చర్య మంచిచెడ్డల విచక్షణ చేస్తున్నట్లే తను ఊహించుకొని ఇంతకాలం బతుకుతూ ఉన్నది. జీవితంలో తనకున్న తల్లిపేగు సంబంధాన్నెవరో ఒక్కసారిగా తెంచివేసినట్టుగా కుప్పకూలిపోయింది.

ఆమె మరిచిపోయిన ఆమె జీవితమంతా క్రమంగా స్ఫురణకు తెచ్చుకున్నది. అంతకంతకూ జీవితేచ్ఛకు దూరమైపోతున్న సారహీనమైన సంసార జీవితం కండ్ల ముందు కదలాడింది.

పెండ్లి అయివచ్చిన కొత్తలో తను తెలుసుకోలేక పోయిందిగాని అతను- తన భర్త మధుసూదన్ మొదటి నుండి డబ్బు మనిషే-పెండ్లి పల్లకి బోయిల ఓంకార నాదంతో- అర్ధరాత్రి విశాదకరమైన వీడ్కోలుతో తాను పుట్టి పెరిగిన బిజిగిరి నుండి భర్తతోపాటు కాలరీ మీదికి కాపురానికి రావడం- సంవత్సరం గడిచేలోగా మొదటి కూతురు, తరువాత మరో కూతురు-భర్తకున్న కొడుకు కాంక్షతో మరో సంతానం- ఆమె కూడ కూతురే కావడం- తుదకెట్లాగో ఘర్షణపడి ఆపరేషన్ చేయించుకోవడం- సంసారమన్నాకా సవాలక్ష గొడవలనుకుంటూ సర్దుకపోవడానికి తన సవాలక్ష ప్రయత్నాలు- తిరిగి తిరిగి మళ్ళీ మొదటికొచ్చే సమస్యలు- యవ్వనం పురిటి వాసనల మధ్య ఎడతెగని గొడవల మధ్య గడిచిపోయింది. అంతకంతకూ

గొడవలు, అసంతృప్తులు ముదిరిపోయి ఇద్దరి మధ్య దూరం పెరగసాగింది. తను నిరాశపడుతూ కూడా- ఈ నరక సదృశ్యమైన కనిపించని యుద్ధాల మధ్య పిల్లల లేత ముఖాలు- పిల్లలు దిక్కులేనివారై పోతారని తను తన జీవితానికి ముగింపు పాడలేదు.

పదే పదే వెంటాడే ప్రశ్నలు సుజాతను పీల్చి పిప్పి చేశాయి. ఈ మొత్తం కుప్పకూలిన జీవితంలో తానెక్కడ తట్టుకొనిపోయిందో ? ఆ రోజంతా సుజాత దుఃఖంలో మునిగిపోయింది. మళ్ళీ ఆలోచనలు తమ్ముని మీదికి పోయాయి. హఠాత్తుగా ఆకాశం గుడగుడలాడింది. తళుక్కున మెరిసే మెరుపుల సమారోహాలు. సుజాత రోడ్డు మీద నిలబడి చుట్టూ చూసింది. ఇది కలా నిజమా ? తనెక్కడున్నది ? ఎటు పోతున్నది ? తన చుట్టు చీకటి ఎందుకు కమ్ముకున్నది ? ఆకాశం ఎందుకు గుడగుడలాడుతోంది ? తెగిపోతూ అతుక్కుంటూ మళ్ళీ తెగిపోయే ఆలోచనల పరంపరలో నుండి మళ్ళీ తమ్ముడు.... తమ్ముడి జ్ఞాపకాలు నిలువెల్లా వ్యాపించగా సుజాత ఆ మట్టిరోడ్డు మీద నడవసాగింది.

వాడు తనకు తమ్ముడేనా ? చిన్ననాడే వాన్ని కని తల్లి చనిపోయింది. అలాంటి సమయంలో తన లేత రెక్కల ఆలనలో, పాలనలో తొలి సంతానంగా పెరిగాడు వాడు. ఇంటి నిర్వహణతోపాటు తమ్ముని పెంపకం తనమీద పడింది.

వాడు ప్రైమరీ స్కూలుకు వెళ్ళే వయసులోనే తనకు వివాహమయ్యి కాలేరు మీదికి తరలి వచ్చింది. తల్లి లేని తమ్ముణ్ని తనతో తెచ్చుకోవడం కోసం మధుసూదన్‌ను అడిగింది. ఎందుచేతనో గాని మధుసూదన్ అంగీకరించాడు. 'ఎంత ప్రయత్నం చేసినా తమ్ముడు చదువులో అంతగా రాణించలేదు' వాడికి ఆ చదువు రుచించినట్టు లేదు. ఎప్పుడు దిగులుగా, ఒంటరిగా కన్పించేవాడు. వాడి చిన్నారి మెదట్లో ఏ యే తుఫాను గాలులు రేగుతున్నాయో తనకు అర్థమయ్యేది కాదు. క్రమంగా క్లాసు పుస్తకాల కంటె మరేవో పుస్తకాలు దొంగచాటుగా తెచ్చుకొని చదివేవాడు. పోనీలే ఏవో పుస్తకాలు, ఏదో చదువు చదువుతున్నాడు గదా అని తను తనకు తాను జవాబు చెప్పుకునేది. కాని మధుసూదన్ చిర చిరలాడుతూ ఉండేవాడు. వాళ్ళిద్దరి మధ్య ఏదో అఘాతం పెరగడం ఆరంభమౌతున్నట్లు తనకు తెలుస్తూనే ఉన్నది. మధుసూదన్ ఇంట్లో ఉంటే వాడు బయటెక్కడో తిరిగి వచ్చేవాడు....

మధుసూదన్‌కు ఇది కంటగింపుగా ఉండేది. ఓ రోజు వాడికోసం కాచుక్కూర్చున్నాడు. రాత్రి పదిగంటలకు వాడొచ్చాడు—చేతిలో ఏదో పుస్తకం. వాడట్లా నిలబడే ఉన్నాడు. "ఆ చదువులేం కూడు పెట్టయి. ఒక్కొక్కడికి చదువుకునే స్తోమత లేక అంగ లారుస్తున్నారు.... మేం ఎంత ఇబ్బంది పడుతున్నామో నీకు అర్థమయ్యే ఉంటుంది. నువ్వు మంచి చదువులు చదువుకో—ఎంత డబ్బైనా నేను పెడుతాను." మధుసూదన్ కంఠంలో అధికారస్వరం. వాడు ఔనన లేదు. కాదనలేదు. తను ఏం ముంచుకురాగలదో నని హైరానా పడుతున్నది. వాడి ముఖంలో నాన్న- అనేక కష్ట నష్టాలల్లో ఏ మాత్రము తొట్రుపడకుండా నిలబడిన నాన్న-అమ్మ చనిపోయి, బంధువులు చుట్టాలు మళ్ళీ పెళ్ళి చేసుకొమ్మన్నప్పుడు ఇట్లాగే నిర్వికారంగా నిలబడిపోయిన సంగతి జ్ఞాపకం వచ్చింది. నాన్న సాత్విక సంస్కారానికి తోడు పరిశీలనా శక్తి అబ్బింది. తమ్ముని గురించి తనకు అర్థమయ్యింది అప్పుడే.

వాడు ఇంటర్మీడియట్‌లో తప్పాడు.... సుజాత తమ్మునికి అంత మంచి చదువు చెప్పించలేకపోయామని లోలోపల బాధపడ్డది. మధుసూదన్ ఎప్పుడో అతని పట్ల ఆశలు చాలించుకున్నాడు.

మధుసూదన్ ఆలోచనలు విరిగిపోయాయి. వాడు ఏ డాక్టరో, ఇంజనీరో అయితే తన కూతురు నిద్దామనే ఆలోచనలు చేసినట్టు తనకు తర్వాత అర్థ మయ్యింది.

సరిగ్గా ఆ రోజుల్లోనే సుజాత తండ్రి గ్రామంలో చనిపోయాడు. ఇంటర్లో తప్పిన తమ్ముడికి తండ్రి వారసత్వంగా మిగిలిన కుప్పకూలిపోతున్న వ్యవసాయం మీద పడ్డది. తమ్ముడు వెళ్ళకముందే వ్యవసాయంలో పెట్టుబడులు పెరిగి పోయాయి. గిట్టుబాటు ధరలు లేక రైతులు విలవిల్లాడ్డం-బాంకుల చుట్టూ తిరగడం- అప్పుల ఉచ్చులు, భూములను తెగనమ్ముకోవడం, ఇవన్నీ సుజాత తండ్రితో ఉన్నప్పుడే చూసింది. తమ్ముడు ఆ రొంపిలోకి దిగకూడదనుకొని ఎంత ప్రయత్నం చేసినా వాడు అందులోకే పోక తప్పలేదు. తమ్మునికి తోడుగా ఇంటిదగ్గర ఎన్నడో భర్త చనిపోయి పుట్టింటికి చేరిన మేనత్త ఉండేది. తమ్ముడు వ్యవసాయం చేసిన మూడు నాలుగేండ్లు సుజాత వాడు కుప్పకూలిపోకూడదని ఎంతో తండ్లాడి పోయేది.

"వాడక్కడ నిప్పుల మీద మొక్కజొన్నకంకి తీరంగ బొర్లి పోతున్నడు. వాడికి అయిదో పదో అప్పుగానే యివ్వంది వాడు బతకలేడు." సుజాత భర్తతో—

" ఈ బుద్ధి నీకు గాదు వాడికుండాలే- మేమంతా బుద్ధిలేని వాళ్ళమై ఇక్కడికి వచ్చినమా ? చెప్పంగ విననివాడు చెడితెనే తెలుస్తది" మధుసూదన్ అకారణంగా కోపం తెచ్చుకున్నాడు. వ్యవసాయం పాతబొంద, అది ఒడ్డున పడేదా ? గడ్డన పడేదా ?

"మీ తమ్ముడికి అంతకన్నా గొప్ప పనేం తోచదు.... అయినా పెద్దల మాట మీద గౌరవం లేని మనిషికి మనమాటలేం రుచిస్తాయి. అయినా నా దగ్గర ఎక్కడు న్నాయి పైసలు."

సుజాతకు అంత అర్థమౌతూనే ఉన్నది. వాళ్ళిద్దరు చెరోపక్క నిలబడ్డారని- వాళ్ళిద్దరికి యుద్ధమే తప్ప సఖ్యత కుదరదని సుజాతకు అర్థమౌతూనే ఉన్నది. భర్త ఎక్కడ నిలబడ్డాడో తెలిసినంత స్పష్టంగా తమ్ముడి స్థానం తెలిసేది కాదు. అదే రోజుల తరబడి సుజాతను వ్యాకులపరిచేది.

తాను దాచుకున్న పదీ పరకా తమ్ముడు వచ్చినప్పుడల్లా చేతిలో పెట్టేది. వాడు అవి తీసుకుంటున్నాకూడా వాడి కళ్ళల్లో విలవిలలాడడం కన్పించేది.

అప్పటికీ ఊళ్ళల్లో రకరకాల గొడవలు- సరికొత్త రాజకీయాలు వచ్చి చేరు తున్నాయి.... ఊళ్ళు తల్లడిల్లి పోతున్నాయి. ఒక పెను తుఫాను ప్రతి మనిషిని మొదలంటా కదిలించి నట్టయిపోయింది.

తరువాత మేనత్త చనిపోవడమో మరెందుకోగాని తమ్ముడు ఊరు విడిచి వచ్చాడు. సింగరేణిలో పరుగు పందేలతో ఉద్యోగాలు యిచ్చే కాలంలో వాడు అందులో గెలిచి బదిలీ ఫిల్లరు ఉద్యోగంలో చేరాడు

మధుసూదన్‌కు వాడి పొడ గిట్టకుంటయ్యింది. డాక్టరుగానో, ఇంజనీరుగానో చూడాలనుకున్న బావమరిదీ బదిలీ ఫిల్లర్ ఉద్యోగం చేయడం నామోషిగా ఉన్నది. ఒక సంవత్సరం కాగానే ఇంకో రాగం ఎత్తుకున్నాడు. లంచాలిచ్చో, పైపీరలు చేసో పైమెట్టుకు పొమ్మని చెప్పేవాడు.... వాడు ఎప్పుడు వచ్చినా ఇదే రాగం. తమ్ముడు జవాబు చెప్పేవాడు కాదు. అది మధుసూదన్‌ను మరింత బాధించేది.

వాడు ఇంతకన్నా ఎంత తండ్లాడుతున్నాడో సుజాతకు ఆ తరువాతనే తెల్సింది. కాలరీ ప్రాంతాలు సమ్మె, లాకౌట్లు, ధర్నాలు, ఊరేగింపులు, అరెస్టులు, కాల్పులు.... ఈ వివరాలన్నీ కేవలం తమ్ముడి కోసమే సుజాత ఆరా తీస్తుండేది. ఈ మొత్తం గడిబిడల్లో తమ్ముని హృదయం లీనమైపోగలదని సుజాత ఆలోచించి

దడదడలాడేది. సుజాత అనుకున్నంత అయ్యింది. ఈ సమ్మెల వెనుక తన తమ్ముడున్నాడని అరెస్టు చేయడం విడిచిపెట్టడం జరిగింది. గనుల మీద అంతకంతకు ఉద్రిక్తత నెలకొన్నది. అందులో భాగంగానే మధుసూదన్ లాంటి అధికార్ల పట్ల కార్మికులకు తీవ్ర వ్యతిరేకత ఏర్పడింది. ఘర్షణలు పెరుగుతూనే ఉన్నాయి. తాగుడు నిషేధించాలనే గొడవల్లో మధుసూదన్ బజారులో పెట్టి ఎవరితోనో నడిపిస్తున్న బ్రాందిషాపు మూతపడ్డది.

అనేక కారణాలతో మధుసూదన్ ఉగ్రుడైపోయాడు. తనకు వ్యతిరేకంగా మారిన పరిస్థితులన్నిటికి తన బావమరిదే కారణమన్నట్టుగా అతని ఉనికిని సహించేవాడుకాదు. తమ్ముడు అదేమీ లెక్కచేసేవాడుకాదు. వారం వారం వచ్చి ఈ గొడవలు తనకేమి పట్టనట్లు సుజాతను కలుస్తుండేవాడు. వాడి చిన్నారి మనసు ఈ ఎదురు దెబ్బల వలన ఎంత చెదిరిపోయిందోనని సుజాత తమ్ముని ముఖంలోకి గుచ్చి గుచ్చి చూసేది. విచిత్రంగా తమ్ముని మాట, చేత పరమ ప్రశాంతంగా ఒక క్రమపద్ధతిలో ఉండేది బావ-బావమరిది కలుస్తే ఎంత గొడవ జరుగగలదోనని సుజాత ఆందోళన పడేది. బావ ప్రసక్తి తేకుండా మాట్లాడేది. బావ గురించి అన్ని తెలిసిన వాడిలాగే ఉండేవాడు.

అట్లా తమ్ముని ద్వారా సుజాతకు కొత్త ప్రపంచమేదో లీలగా తెలుస్తున్నట్లే ఉండేది. వారం వారం తనలో తానే సిగ్గుపడే విధంగా తమ్ముని కోసం ఎదురు చూసేది....వాడు క్రమక్రమంగా రక్తసంబంధంకన్నా ఎక్కువగా తోచేవాడు. తన భర్తతో తను పడుతున్న యాతన తనకు తెలియకుండానే చెప్పుకునేది. తమ్ముడు వెళ్ళిపోయిన తరువాత ఈ గొడవలన్నీ ఎందుకు చెప్పానా అనుకునేది. ఒక్కొక్కసారి అలాంటి వ్యతిరేకతలు గొడవలు తనకు కొత్తగా ఎందుకు స్ఫురిస్తున్నాయో తెలిసేదికాదు. తను ఎలాంటి స్నేహాల గురించి ఎలాంటి ఆత్మీయత గురించి, ఎలాంటి మనుషుల గురించి తలపోస్తున్నదో అర్థమయ్యేదికాదు.... వాడు లోకం గురించి, మనుషుల గురించి అదోవిధమైన వెలుగురాసిన గొంతుతో వివరించేవాడు. సిగ్గుపడుతున్నట్లుగా తెచ్చి పుస్తకాలు యిచ్చేవాడు. స్వార్థం, తండ్లాట గలిగిన మనుషుల ప్రవర్తనకు మూలమెక్కడో ఆ పుస్తకాల్లో సుజాతకు అర్థమౌతుండేది.

తమ్ముడు పుట్టెడు దుఃఖంతో ఉన్నట్టు సుజాతకు ఒక మారన్పించింది. ఆ కన్నీళ్ళు ఏ వేదనల నుండి ఊరివచ్చాయో ఎంత విచారించిన తెలిసేదికాదు. అలాంటి

తమ్మున్ని పోలీసులు అరెస్టు చేసి బయటకు రావడానికి వీలుకాని కేసులేవో పెట్టారు. వాన్ని వరంగల్ సెంట్రల్ జైలుకు పంపారు....

"నెగుల బుట్టని కోడిపిల్ల మంచం మూడు సుట్లని, వాళ్ళు బతుకరు- ఇంకొక రిని బతకనియ్యరు". మధుసూదన్ ఈ మాటో ఇలాంటి మాటలో పదే పదే అంటుండేవాడు.

ఒక్కొక్కమారు తీవ్రమైన కోపంతో మధుసూదన్‌కు జవాబు చెప్పాలను కునేది. అప్పుడు తమ్ముడు కన్పించేవాడు- వాడు జీర్ణించుకున్న వేలాదిమంది మంచి మనుషుల సంస్కారం ఆమెకు స్ఫురించేది. "వీళ్ళకు పై మనుషులే సరిగ్గా కన్పిం చరు. లోపలి మనుషులు తెలుస్తారా ? ఎవరి చుట్టు వాళ్ళే తిరిగే మనిషికి లోకం తెలుస్తుందా ?" అనుకునేది. ఇలాంటివో మరెలాంటివో అనేక మాటలు మనుషులతో పంచుకోవాలని ఉవ్విళ్ళూరేది.

సుజాత చిత్రమైన సంఘర్షణలో బతుకుతూ ఉండగానే వాడు జైల్లో ఉన్న కాలంలోనే బయట అనూహ్యమైన మార్పులు జరిగిపోయాయి. సుజాత వార్తాపత్రిక ఆధారంతో ఈ మార్పులను ఊహించడానికి అలవాటు పడ్డది.

రామారావు ప్రభుత్వం తీవ్రవాదులపై విరుచుక పడ్డది. తాత్కాలికంగా తీవ్ర వాదులు వెనుకంజ వేశారు. అప్పుడు కాలరీ ప్రాంతంలో తిరిగి బ్రాంది షాపులు తెరిచారు. తీవ్రవాదుల హెచ్చరికలను ఖాతరు చేయని రెండు పెద్ద బ్రాంది షాపులపై కార్మికులు దాడిచేశారు. అందులో మధుసూదన్ బ్రాందిషాపు ఒకటి. బ్రాందిషాపు ధ్వంసమైపోగానే ఎక్కడికక్కడ ఖాతాదార్లు మధుసూదన్‌కు మొండి చెయ్యి చూయించారు. ఆ విధంగా మధుసూదన్ నష్టపోయిన దశలోనే గనిమీద మధు సూదన్‌కు కార్మికులతో ఘర్షణ ప్రారంభమయ్యింది. వీటన్నిటి మధ్య మధుసూదన్ తీవ్రమైన కోపంతో అందరిని వరుసబెట్టి తిట్టేవాడు. సుజాతతో యుద్ధం చేసేవాడు.

"తమ్ముడు చెడిపోవడానికి నువ్వే కారణం" అంటూ నిందించేవాడు. "ఉల్పాగా తిరిగే ప్రతి లంపెన్‌గాడు చేసేపనే అది. వాడు గుండ...." ఇట్లా సాగేవి మధు సూదన్ తిట్లు.

సుజాత విలవిల లాడిపోయేది. తను తమ్మున్ని చెడగొట్టిందా ? తమ్ముడి చేతల మంచి చెడ్డలేమిటో తనకు మళ్ళీ మీమాంస ప్రారంభమయ్యేది. తిరిగి జవాబు చెప్పాలనే ఆలోచన ఎప్పుడు చేయలేదు. "వాడు ఆత్మగల మనిషి-ఆత్మ కలిగి ఉండ

డమే నేరం అంటున్నాడు భర్త". పంచి చెడ్డలు రెండుగా చీలిపోయినట్లుగా కన్పిం చేది. అయినా అప్పుడప్పుడు "వాడు ఈ నిప్పుల దారిని ఎందుకు ఎంచుకున్నాడో?" అనుకునేది. తనకు తెలియకుండా తను ఆ దారిలో నడుస్తున్నట్లుగా తోచి ఉలిక్కి పడేది. తను జవాబు చెప్పుకున్నా భర్తతో కనిపించని, నెత్తురేమికారని తీవ్ర, సుదీర్ఘ యుద్ధంలో కూరుకపోయినట్లుగా ఒకనాడు అర్థమయ్యింది. అసలు భర్త జైల్లో ఉన్న తమ్మునితో కాదు తనతో తలపడుతున్నాడని అర్థమై విస్తుపోయింది. తన సమస్త సంసారిక జీవితాన్ని కుప్పపోసుకొని తనకు తెలియకుండానే సుజాత వెక్కి వెక్కి ఏడ్చింది....

చివరకు సుజాతకు తేలిన అంశమేమిటంటే తమ్ముడు జైల్లో బంధీ-అది ఎలాంటి బంధికానో తనకు తెలియదు. తను ఈ ఇంట్లో బంధి. మొగుడి అధికారాలతో తన సమస్త శరీరంలోని ఆర్తిని ఎండగట్టాలని భర్త చూస్తున్నట్లుగా సుజాత అర్థం చేసుకున్నది. తమ్ముడు పదే పదే మానవ జీవితంలో ఇదెవారి పోయిన హింస గురించి, తనకు అర్థంకాని మరేమిటో గురించి చెప్పినవన్నీ గుర్తుకొచ్చేవి. నాకన్నీ తెలుస్తున్నాయి చూడు అని చెప్పాలనిపించేది. తమ్ముని కోసం వేయి కండ్లతో ఎదురు చూసేది.

ఒక్కొక్కమారు జైలుకు వెళ్ళి తమ్మున్ని చూసి రావాలనుకునేది. ఆ మాట తాను చెప్పకుండానే మధుసూదన్ అర్థం చేసుకున్నట్లుగా- "మరింక వాడితో మనకు ఎలాంటి బాంధవ్యాలు లేవు. ఆ బాంధవ్యాలు పెట్టుకుంటే నా గడప తొక్కవద్దు". అన్నాడు.

తన చేతకానితనం మీద ఎనలేని కోపంతో సుజాత ఏడ్వని రోజులేదు. ఒక్కొక్కమారు ఇంత బలహీనమైన బంధం ఉంచేనేమి పోతేనేమి అనే తెగింపు కలిగేది. పిల్లల ముఖాలు ఆమెను నిలవేసేవి.

సుజాత లోలోపల జరుగుతున్న భీకర సంగ్రామమే ఇంచుమించు బయట జరుగుతున్నట్లుగా సుజాతకు అర్థమయ్యింది. ఎక్కడో మండలాధ్యక్షున్ని చెరపట్టి చంపేయడం, తర్వాత ప్రభుత్వం దిగివచ్చి తీవ్రవాదుల కోర్కెలు తీర్చడం- జైల్లో, లాకప్పుల్లో ఉన్నవాళ్ళను విడుదల చేయడం- కూల్చివేసిన స్థూపాలను తిరిగి కట్టడం.... తన సమస్యలు అడుగున పట్టేంత ఉద్వేగ్నత సుజాతను ఊపేసింది. ఆ గొడవల్లోనే తమ్ముడు విడుదలై పందిలో కలిసిపోయాడు.

తర్వాత ఎన్నికలు - ప్రభుత్వం మారిపోయింది.

బ్రహ్మాండమైన బహిరంగ సభలు, సమావేశాలు- వేన వేల ఎకరాల భూమి పంపకాలు- అలాంటి అల్లకల్లోలాల మధ్య ఉవ్వెత్తున ఎగిసిపడే రైతుల పోరాట కెరటాల మధ్య ఆమె రోజూ వార్తాపత్రికలో తన తమ్ముణ్ని పోల్చుకోవడానికి వెతుకులాడేది.

అదిగో అలాంటి ఉద్విగ్న రోజుల్లోనే తన తమ్ముని అరెస్టు వార్త సుజాతకు తెలిసింది. అప్పటికే విరుచుకపడే కెరటాలకు అడ్డుకట్ట వేయడానికి ప్రభుత్వం అరెస్టులు, కాల్చివేతలు ముమ్మరం చేసింది.

మొదట ఆ వార్త చదివి సుజాత కుప్పకూలిపోయింది. ఆ తరువాత తనమీద తనకే చెప్పరాని ఆగ్రహం కలిగింది. ఈ ఇంట్లో పిడికెడు మెతుకులు, నాలుగు చీరల స్థానం పోలేపోయింది. పిల్లలు అడుక్కతినైనా బతకగలరు. ఆలశ్యం చేస్తే తమ్ముడు తనకు దక్కడు. ఎట్లాగైనా వాన్ని రక్షించుకోవాలి. ఎవరి అండ తీసుకోనైనా వాన్ని విడిపించుకోవాలి. అలాంటి నిర్ణయానికి వచ్చిన తరువాత తమ ఊర్లోని మేనబావ గుర్తొచ్చాడు. అప్పుడు అతను ఆ మండలానికి అధ్యక్షుడు. చిన్ననాడు సుజాతను అతనికేయిచ్చి పెండ్లి చేద్దామనుకున్నారు. సుజాత తల్లి చనిపోవడం దాదిగా సుజాత కుటుంబం తరిగిపోయింది. వాళ్ళు పెరిగిపోయారు. పెద్ద మేనత్త ఈ సంబంధం మీద అయిష్టత చూపింది. ఏది ఏమైనా అతన్ని కలువాలని నిర్ణయానికి రాగానే సుజాత పిల్లలకు చెప్పి రైల్వేస్టేషన్‌కు చేరుకున్నది. ఆమె దుఃఖంతో, విచారంతో వచ్చిన రైలు ఎక్కింది. రైల్లో వరుస క్రమంలేని ఆలోచన మధ్య ఇతర ప్రయాణీకు లెవరిని పట్టించుకోలేదు. కనీసం ఆ స్పృహ కూడా లేకుండా రైలు దిగింది.

ఎందుకోగాని ఉరుముడు, మెరుసుదేగాని వర్షం కురువడంలేదు. గాలి ఆ పక్క ఈపక్క బొయ్యిమంటూ వీస్తోంది. మినుగురుల్లా ఊరి దీపాలు కన్పిస్తు న్నాయి. ఆ దారి, ఆ పరిసరాల స్పృహేలేదు. తను ఒంటరిగా చీకటిపూట నడుస్తున్నా నన్న ధ్యాసేలేదు. ఆ దారంట అప్పుడప్పుడు సుజాతలాగే ప్రయాణించేవారి గురించి పట్టింపులేదు. పెను తుఫానులో అల్లకల్లోలమై పోతున్న సముద్రంలోని కెరటా ల్లాగా ఆమె మనుసులో అనేక జ్ఞాపకాలు- ఎక్కడో తెగి ఎక్కడో అతుక్కుంటున్న ఆ జ్ఞాపకాల సారాంశం మాత్రం అది.

సుజాత వడివడిగా నడుస్తోంది. ఇప్పుడు సుజాతకు ఊరు దగ్గరౌతున్నది.

తన గుండే పెద్ద శబ్దం చేస్తూ కొట్టుకుంటున్నది. చీకటి రాత్రి, మేఘాలు గిరేసుకున్న ఆకాశంకింద ఎడతెగని శోకంలాగా చిమ్మెట్ల రొద సాగుతూనే ఉన్నది.

కాసేపు ఈ ఆలోచనలు కట్టిపెట్టి సుజాత నడవసాగింది. తుఫాను తర్వాత ప్రశాంతత ఆమె ముఖంలో లిప్తకాలం చోటు చేసుకున్నది. బలహీనమైన మెరుపు మెరిసింది. కొద్దిగా గాలి పుధృతి తగ్గింది.

ఆ మెరుపు వెలుగులో చుట్టు పరికించి చూసింది. కుడివేపు గుట్ట బోరుకింద ఏనాడో చనిపోయిన ముస్లింమత పెద్ద సమాధి (దర్గ) తెల్లగా కన్పించింది. దర్గ గుడికి అవలివేపున గల ఖాజి పల్లెలో ఏ అలికిడి లేదు. మళ్ళీ తమ్ముడు మదిలో మెదిలాడు. తన చుట్టు విస్తరించిన ధరిత్రి సాంతం వల్లకాడులా తోచింది. గాలికి ఊగుతున్న చెట్లు వెంట్రుకలు విరబోసుకొని శివాలెత్తుతున్నట్టుగా తోచింది. ఎదురుగా బిజిగిరి రెండు గుట్టల మధ్య బిజిగిరి మెరుపు మెరుపుకు కనిపించి మాయమౌతుంది.

తమ్ముడి ఆలోచనలు పక్కకు నెట్టి సుజాత రోడ్డుకు రెండు పక్కలాచూస్తూ నడుస్తోంది. రోడ్డుకు ఎడమపక్క విస్తరించిన అపారమైన నల్ల రేగడి భూములు దున్నక పడావు పడి ఉన్నాయి. ఆ భూముల్లో అక్కడక్కడ రంగు వెలసిన ఎర్ర జెండాలు రెపరెపలాడుతున్నాయి. ఈ భూములన్ని తన మేనబావవే....రోడ్డుకు కుడివేపున ఉన్న భూముల్లో కొన్ని బిజిగిరి గ్రామస్తులవి. మరికొన్ని ఖాజిపల్లె తురకలవి. జులై నెల చివరి రోజులు- కుడివేపు భూముల్లో మొక్కజొన్న, పత్తి పంటలు ఎందుచేతనో బలహీనంగా ఉన్నాయి ...

తను వార్తపత్రికలల్లో చదివిన ఈ భూముల చరిత్రంతా సుజాతకు జ్ఞాపకం రాసాగింది.... ఈ మట్టి, ఎందరి మనుషుల సుఖదుఃఖాలను చూసిందో ? ఆ మట్టిమీద సుజాతకు చెప్పరాని ప్రేమేదో పొంగుకొచ్చింది. హఠాత్తుగా సుజాతకు ఆ జెండాల మధ్య తమ్ముని ముఖం కనిపించినట్టయ్యింది సుజాత పిచ్చిదానిలా నిలబడిపోయింది. ఈ సమస్త ప్రపంచం ప్రతిధ్వనించే విధంగా తమ్మున్ని పేరు పెట్టి పిలువాలని వెర్రి ఊహ మెదిలింది. ఆ పిలుపు ఆమె కంఠంలో అణిగిపోయి దాని స్థానంలో- చింపిరి తలలవాళ్ళు, చిరిగిన బట్టల అసంఖ్యాక జన సమూహం కోలాహలంగా ఎటో పోతున్నట్టుగా తోచింది....

"వాళ్ళకీ బలం ఎక్కడినుండి వచ్చింది ? చిన్నదానికి చితకదానికి వాళ్ళల్లో వాళ్ళు కొట్లాడే మనుషులు ఒకే ఇంట్లో బతుకుతూ వేరు వేరు పాయలుగా చీలి

పోయినవాళ్ళు- వాళ్ళంతా ఎట్లా బతుకుతారు ? ఇది జరిగే పనేనా ? వీళ్ళందరి ఆయంపట్లు తమ్మునికి దొరికినట్టుగానే ఉన్నది. వాడికి గట్టిగా ఒక దురుసు మాట మాట్లాడరాదు. ఇలాంటి మనుషులతో ఏం మాట్లాడడం ? వాళ్ళల్లో వాడెట్లా ఇమిడి పోయాడు ?" సుజాత తనలో తానే గొనుక్కుంటూ నడుస్తోంది.

సుజాత వెనుకనుంచి ఎడ్లబండొకటి ఆ చీకట్లో టొకటొకలాడుతూ వస్తోంది. ఎవరో రావాల్సిన బంధువుల కోసం వచ్చిపోతున్నట్లున్నది. ఆ పెద్ద బండిలో నొగల కిందికి కాళ్ళు జారిడిసి ఒక ముసలాయన మునిలాగ కూర్చుండి తోలుక పోతున్నాడు. ఆ ముసలాయనలో సుజాతకు తండ్రి జ్ఞాపకం వచ్చాడు.

"బతుకు చేతకాని పరమ దరిద్రులు" మధుసూదన్ తన తమ్మున్నుద్దేశించి చెప్పిన మాట ఎందుకో గుర్తొచ్చింది.

ఆ రోజు సుజాతకు మనసు విలవిల లాడిపోయింది.

"నిజమే వానికి బతక చేతకాదు. చేతనైన మీలాంటివాళ్ళు బతికే తీరేమిటో కన్పిస్తనే ఉన్నది." సుజాత జవాబు చెప్పాలనుకున్నది. కాని అనలేకపోయింది. బీరువాలో కుప్పలు కుప్పలుగా పడున్న కుదువబడిన నగలు ఆమెకు పాములు తేళ్ళ లాగా కన్పించాయి.... భర్త అడ్డమైన లంచాలు, వడ్డీవ్యాపారం, బీరు బ్రాంది అమ్మకాలు- డబ్బు కక్కుర్తిలో భర్త ఎన్ని కుటుంబాలను అర్పివేస్తున్నది- ఎవరి మీదనో పగ సాధించడానికన్నట్టు బంగ్లామీద బంగ్లా కడుతున్నది- డబ్బుతో సర్వ ప్రపంచాన్ని గెలువగలననే యావతో ఆయన మనుషులకు ఎట్లా దూరమైపోతున్నది. తనను గెలువాలని చేసే ప్రతి ప్రయత్నం తనకు అసహ్యాన్ని కలుగజేస్తున్నది. చివరకు అతని ఉనికి తనకు భరింపరానిదయ్యింది. తీవ్రమైన ఒంటరితనంతో ఆయ నెట్లా మానసిక వైద్యం చేయించుకున్నది. నిద్ర రాక నిద్రమాత్రలు మింగేది. అతని బతుకు సాంతం తనకన్నా మరెవరికి బాగా తెలుసు.... తను అనకున్నా అతనికి తన నిరసన అర్థమౌతున్నట్టే ఉండేది.

ఉరుములు, మెరుపులు, గాలి దుమారం మధ్యనే సన్నగా వర్షం ప్రారంభ మయ్యింది. గాలికి కరంటు తీగలు హోరుమంటున్నాయి. తను తడుస్తున్న ధ్యాసే లేదు. సుజాతకు భర్త రూపం మారిపోయి తండ్రి గుర్తుకొచ్చాడు. మధుసూదన్‌కు తన తండ్రి పట్ల ఎందుకో తగని ద్వేషం. తండ్రి చనిపోయేదాకా అతను తండ్రితో ఒక్క మాట మాట్లాడింది లేదు. మా ఇద్దరి పెంపకంలో తండ్రి అంశ ఉందని

అతని అనుమానం కాబోలు.... 'మీ తమ్ముడు అట్లా కావడానికి మీ నాయిన చేత కానితనమే కారణం' అంటూ దెప్పిపొడిచేవాడు. భర్త ఏ అర్థంలో వాడిన తన తండ్రి తన భర్తలాగా బతకడం చేతకానివాడే. పెదతండ్రి లాగా ఉమ్మడి కుటుంబాన్ని మాయచేసి అస్తి వెనుకేసుకోవడం తన తండ్రికి చాతకాకపోయింది. పెద తండ్రిలాగానో, పెద్ద మేనత్తలాగానో మనుషుల పట్ల కఠినాత్మునిలాగా ఉండడం చేతకాకపోయింది. ఎకరాల కెకరాలు దున్ని, పుట్ల ధాన్యం పండించి కూడా తనేమి కూడబెట్టలేకపోయాడు. సుజాతకు నిలువెల్లా దుఃఖం ఆవరించింది. తండ్రి రూపం మసక మసకగా కన్పించింది. తన తల్లి చనిపోయినప్పుడు గాని, వ్యవసాయం కుప్పకూలిపోతున్నప్పుడు ఆయన పడ్డ యాతన తనకు మాత్రమే తెలుసు.

ఊరు దగ్గరైంది. ఆ చీకట్లో ఊరు మొదట కూలిపోయికూడ కర్మసాక్షి లాగా నిలుచున్న నైజాం కాలంనాటి బురుజు కన్పించింది. ఉగ్గబట్టుకున్న హృదయంతో అదిమిపెట్టుకున్న దుఃఖంతో ఆమె గ్రామంలోకి ప్రవేశించింది. గ్రామం కూడా తనలాగే దుఃఖాన్ని ఉగ్గబట్టుకున్నట్టే ఉన్నది. ఇండ్లల్లో మసక మసకగా దీపాలు వెలుగుతున్నాయి. సందడేమీ లేదు. తోడేల్లు పడ్డ గొర్రెమందలాగా ఊరంతా బెగ్గంపాడై పోయినట్లుగానే ఉన్నది. ఊళ్ళో ఎవరు తిర్గడంలేదు. ఎక్కడో ఆవు దూడ కోసం హృదయవిదారకంగా అరుస్తోంది. సుజాతకు ఇద్దరో ముగ్గురో ముసలివాళ్ళు ఎదురుపడ్డారు. వాళ్ళు ఒంటిమీద గుడ్డలు కప్పుకోవడం వాలన వాళ్ళెవరైంది సుజాతకు తెలియలేదు. వాళ్ళు ఏదో గొనిగారు. సుజాతకు ఆ మాటలేవి అర్థం కాలేదు. సుజాత ఆ మాటలేవి, ఆ మనుషులెవరిని పట్టించుకో కుండా నడుస్తోంది.

ఈ వానలో ఈ రాత్రి ఎవరింటికని పోయేది ? తను పుట్టి పెరిగి ఆడుకున్న ఊరే - ఎట్లా తెగిపోయాయో గాని ఆ వూరితో తనకు తెలియకుండానే అన్ని బంధాలు ఏనాడో తెగిపోయాయి. "తను తన తమ్ముని్న పోలీసుల నుండి విడిపించుకుందామని మేనబావను కలువడానికి బయలుదేరానని" సుజాతకు జ్ఞాపకం వచ్చింది. "వాన్ని ఈ జన్మకు చూస్తానో లేదో ?" సుజాత ముద్దుబోయిన గొంతుతో అనుకుంటూ వడివడిగా మేనబావ ఇంటికేసి నడిచింది ....

బయటి పారకులు (పెద్దదరువాజు తలుపులు) తోసుకొని లోపలకు అడుగు

పెట్టింది. చుట్టూ విస్తరించి ఉన్న ప్రహరి గోడల లోపల విశాలమైన వాకిలి చివర బంగళా ఎక్కడికక్కడ కుప్ప కూలిపోయి ఉన్నది. కూలిన గోడలతో ఆ లోగిలి వల్లకాడులా కన్పించింది. సుజాత ఆ దృశ్యాన్ని చూసి విస్తుపోయింది. మంది మార్బలంతో నిత్య పెళ్ళి కూతురిలా కళకళలాడే ఈ బంగళా ఇట్లా కుప్పకూలిం దేమిటి ? ఈ మార్పులేవి సుజాత వార్త పత్రికలల్లో చదువలేదు.

ఎక్కడినుండో కుక్క అరుపు విన్పించింది. మరి కొద్దిసేపట్లో ఆ శిధిలాల మధ్యనుండి ఒక ముసలమ్మ కందీన చేత్తో పట్టుకొని "ఎవరూ ?" అంటూ వాకి ట్లోకి వచ్చింది....ఆ ముసలమ్మ కందీన పైకెత్తి సుజాతను చూసి పోల్చుకోలేక పోయింది.

సుజాత ఆ ముసలమ్మను పోల్చుకున్నది. ఆ ముసలమ్మ మేనత్త ఇంట్లో బాల్యంనుండి పనిచేస్తున్న దాసి లచ్చిమి. ఏటా వేల పుట్లు వడ్లు పండే రామప్ప చెరువు కింది గ్రామంలో నుండి లచ్చిమిని చిన్ననాడే తన మేనత్త నాలుగు కుంచాల వడ్లకు కొనుక్కొచ్చింది. తనకు తెలియదు గాని లచ్చమి ఎన్నిసార్లో పారి పోయిందట- అయినా లచ్చిమికి దాసితనం తప్పలేదు. పెళ్ళి పెటాకులు లేకుండా లచ్చిమి బతుకంతా మేనత్త కుటుంబంతోనే గడిచిపోయింది. సుజాతకు ఇలాంటివో మరెలాంటివో ఆలోచనలు సాగుతూండగా—

"ఎవరవ్వా ! ఎవలు కావాలె" అని హీనమైన స్వరంతో కొద్దిగా భయం నిండిన గొంతుతో అడిగింది.

సుజాతకు తనెందుకు వచ్చినట్టో గుర్తుకు రాలేదు. గొంతు పెగల్చుకొని తన తండ్రి పేరు చెప్పింది.

"సుజాతవ్వా నువ్వా ! ఎవలో అనుకున్న" లాంతరు దించింది.

"బావ కోసం వచ్చిన" సుజాత.

దాసి లచ్చిమి ఇందాకటి కంఠంలో ఏదో మార్పు వచ్చింది.

"బావా ?" చేతులు చిత్రంగా తిప్పింది. మళ్ళీ ఏమనుకున్నదో ఏమో ?

"ఇగో సుజాతవ్వా ! ఈ బంగళను బాంబులతో కూలగొట్టక ముందునుంచే మీ బావ పిల్లలతోపాటు హన్మకొండకు చేరుకున్నడు. మీరంతా ఏ రంధీ రవుసు లేకుంట కాలేర్లమీదికి పోయిండ్లు- ఈ వూళ్లె ఎన్ని జరిగినయో నే చెప్పజాల. మీ బావ గొడ్డు గోదా భూమి జాగ గంగల కల్సినయ్. మీ బావ జాగ మీ బావ చూసు

కున్నడు. నాకే ఏ దారి కానరాక ఈ బంగలల ఉంటన్న." ముసలమ్మ గొంతు వని కింది. మరింక మాటలు రాక మూగపోయింది.

ఆ వర్షంలో సుజాత ఏమి తోచకుండా నిలుచున్నది. తన తమ్ముని మీద పెట్టుకున్న ఆశలన్నీ కుప్పకూలిపోయాయి. మరింక ఎటుపోవాలి. కాళ్ళు వనుకు తున్నాయి. లోలోపల దుఃఖం కట్టలు తెగుతోంది. పరుగెత్తుతున్నట్టుగా సుజాత అక్కడినుండి బయటకు వచ్చి నిలుచున్నది.

"ఏం మనుషులో?" ముసలవ్వ గొనుగుతూ ఆ శిథిలాల మధ్యకు వెళ్ళి పోయింది.

నిలువెల్లా మైకం కమ్మిన మనిషిలాగ బజారులో నడవసాగింది. సమస్త జీవి తాన్ని గడ్డిపోచలాగ వదిలిపోతున్న మనిషిలాగా నడుస్తోంది. దేన్ని ఖాతరు చేయని మనిషి ఉన్మాదం ఆమె అడుగుల్లో కన్పిస్తోంది. అట్లా సుజాత తనకు తెలియ కుండానే తను పుట్టి పెరిగిన ఇంటికి నడిచింది. ఆ యిల్లు ఆ బంగ్లాలాగే ఎక్కడి కక్కడ కూల్చివేయబడి ఉన్నది.

ఈ ఇంటిని తన లేత చేతులతో అలికింది. ముగ్గులు వేసింది. ఈ ఇంటి ప్రతిమూలతో తను మాట్లాడింది. ఆ శిథిలాల మధ్య సుజాత పిచ్చిపట్టిన దానిలాగా తిరుగాడింది. ఈ ఇంటికి, ఇక్కడి జీవితానికి తనను దూరం చేసిందేమిటి?

మళ్ళీ మళ్ళీ పదే పదే సుజాత చిక్కుదారుల్లోకి వెళ్ళిపోతోంది. వాతా వరణం మాపురు గప్పినట్టుగా ఉన్నది. ఉరుములు మెరుపులు తగ్గాయి. ఏడ్చేడ్చి సొమ్మసిల్లినట్లుగా వర్షం తగ్గింది.

తల్లి చనిపోతే తమ్ముణ్ని భుజానేసుకొని పాలకోసం తాను మాదిగ ఇండ్ల ల్లోకి పోయేది. తల్లి చనిపోయిన పిల్లవానికి తల్లి పాలకోసం అడగరాని వాళ్ళనల్ల అడిగాడు తండ్రి-చింతకింది రాజమ్మ ఆ మాదిగవాడలో తన తమ్మునికి రోజు పాలి చ్చేది. రాజమ్మకు కూడా తన తమ్ముని వయస్సంత కొడుకుండేవాడు. ఇద్దరు పిల్లలకు పాలు సరిపోవని తన తండ్రి రాజమ్మకు కొంత ధాన్యం పంపేవాడు. అర్ధరాత్రి అపరాత్రి ఆ పసికందు ఏడ్చేవాడు. వాన్ని భుజాల మీద వేసుకొని మాదిగవాడకు పరుగెత్తేది. సుజాత తల్లిమనసుతో తడిసి ముద్దైపోయింది. వర్షంలో తడిసిన దాని కన్నా ఈ భావనతో ఆమె నిలువెల్లా వణికిపోయింది.

సుజాత ఈ ఒక్క రోజు ఈ భూ ప్రపంచంలో స్త్రీ ఎన్ని భావ ప్రకంపనా లకు లోనుకాగలదో అన్ని భావ ప్రకంపనాలకు లోనయ్యింది.

అప్రయత్నంగా లేచి నిలబడి సుజాత ఊరికి దక్షిణంవేపునే గల గుట్టబోరు కింది మాదిగవాడ కేసి నడిచింది. తమ్ముని జాడ కోసం, వివరాల కోసం ఆమె మనసు పరితపిస్తోంది. ఎక్కడో రవ్వంత ఆశ కొట్టుమిట్టాడుతోంది. తప్పక తన తమ్ముడు తన హృదయాన్ని ఆ మాదిగవాడలో దాచి ఉంటాడని సుజాతకు గట్టి నమ్మకం కలిగింది.

పాము వలె మెలికలు తిరుగుతూ వడి వడిగా ప్రవహించే నీళ్ళధారల్లోనుంచి, చితచితలాడే బురదలోంచి ఆమె నడుస్తోంది.

* * *

"ఈమె ఈ రాత్రి ఎక్కడికి పోయినట్టు ? ఈ వర్షాకాలపు రాత్రి ఎక్కడని వెతికేది ?" మధుసూదన్ రైలు ప్లాట్ ఫాం మీద నిలబడి చాలా సేపు కలియజూశాడు. రైలు దిగిన ప్రయాణీకులు తమ తమ పల్లెలను వెతుక్కుంటూ చేల కడ్డం పడి పోతున్నారు.

రైలు కాసేపు ప్లాట్ ఫాం మీదినుండి కదలలేదు.... మధుసూదన్ ప్రతి పెట్టె వెతికాడు. రైల్లోని వాళ్ళు ఎవరి గొడవల్లో వాళ్ళున్నారు.... స్టేషన్ బయట- ప్లాట్ ఫాం మీద అంతటా వెతికాడు. కాని ఆ చీకట్లో సుజాత కన్పించలేదు.

మధుసూదన్‌కు ఒక్కసారిగా నిస్సత్తువ ఆవరించింది. తన సర్వ శక్తులు ఎవరో లాగేసుకున్నట్లుగా ప్లాట్ ఫాం మీద ఒక సిమెంటు బెంచి మీద కూలబడి పోయాడు. కళ్ళు మూసుకుంటే భయంగొలిపే చీకటి.

ఎట్టకేలకు రైలు నీరసంగా కూతవేసి ఖాజీపేట వైపు కదిలి పోయింది. అడుగుల చప్పుడు తగ్గిపోయింది. కళ్ళు తెరచి చూస్తే తన మెదడు లాగే ప్లాట్ ఫాం ఖాళీగా కన్పించింది.

"ఎటు వెళ్ళాలి ? ఏమి చేయాలి ? వెనక్కి తిరిగి పోదామంటే గంట దాకా రైలు లేదు. ఏమో తనకు కన్పించకుండా ఆ మనిషి బిజిగిరికి వెళ్ళిందేమో ?" మధు సూదన్ స్టేషన్ బయటకు వచ్చి రాధమ్మ హోటల్లో టాయ్ తాగాడు. అక్కడున్న వాళ్ళను అడుగుదామంటే గొంతు పెగుల లేదు.

మట్టి రోడ్డుమీదికి వచ్చి కాసేపు నిలుచున్నాడు. ఆకాశంలోకి చూశాడు. ఆ

ఉరుములు మెరుపులు తనకు తెలియని గందరగోళమేదో జరుగుతున్నట్లుగా ఉన్నది.... విచిత్రం వాన వస్తుందో రాదో తెలియకుండా ఉన్నది. వానే వస్తే సాంతం తడిసిపోతే- అసలే ఈ వూళ్ళు బాగుండలేదు.... ఇంత రాత్రి ఒక్కనివి ఎటు పోతున్నావంటే- ఆ వూళ్ళో ఈ రాత్రి ఎట్లా గడిపేది ?

మధుసూదన్‌కు భయం నిలువెల్లా పాకింది.

ఈ మనుషులు తనకెప్పుడు అర్థం కాలేదు....

మధుసూదన్‌కు బుసబుస కోపం పొంగింది. "ఈ దరిద్రురాలు తన నెందు కింత కష్టపెడుతోంది. ఈ గాలి దుమారంలో ఈ ఉరుములు మెరుపుల మధ్య నేను ఎక్కడని వెతికేది-" మనసులోనే తిట్టుకుంటూ ఎటూ తేల్చుకోలేక నిలుచున్నాడు.

ఇంతలోనే విజగిరి వేపునుండి బండి రావడం కన్పించింది.

"ఓ బండాయిన- నీకు తొవ్వల ఎవలన్న ఆడామె కన్పించిందా ?" ఒక విధమైన విసుగుతో అడిగాడు.

బండాయన మాట్లాడలేదు. ఈ దరిద్రులందరికి పొగరే. "ఏం కాలమచ్చింది ?" అనుకుంటూ రెండడుగులేసి "విన్పిస్తలేదా ? ఈ దారంట" మధుసూదన్ మాట పూర్తి కాకముందే-

"మా ఇన త్తంది. నువ్వాపిల్ల పెనిమిటివా ?" బండాయన.

"సన్నగా ఉన్నామె చేతులేమి లేకుంట పోతున్నదా ?" మధుసూదన్ ఆదుర్దాగా అడిగాడు.

"పోతందిపో." అన్నాడు బండాయన.

"అరే ! తనకు కన్పించకుండా ఎప్పుడు రైలు దిగింది ?" మధుసూదన్ మరో ఆలోచన లేకుండా ఆ మట్టి రోడ్డు మీద నడవసాగిండు.

కాస్తంత దూరం పోయిన తరువాత ఇందాకటి ఆదుర్దా స్థానే సుజాతను ద్వేషించడానికి ఆసరా కోసం వెతుక్కోసాగిండు !

"ఇంతకూ తను చేసిన తప్పేమిటి ?" ఈ ప్రశ్నను మధుసూదన్ తన సంసారం ఆరంభమయిన దగ్గరనుండి అనేకమార్లు వేసుకున్నాడు. ఎప్పటికప్పుడు జవాబులు తనకుతానే చెప్పుకున్నాడు. మధుసూదన్ సంసారంలో 'తను' తప్ప ఇతరులు లేరు. అట్లా ఉంటారనే విషయం కూడా అతను ఇంత పెనుగులాటలో కూడ నమ్మలేకపోయాడు.

"నాలుగు పైసలు సంపాయించుకోవడం తప్పా? డబ్బు లేనోడు డుబ్బుకు కొరగాడు. ఈ ప్రపంచం మీద మనిషి విలువ డబ్బుతో కొలువబడుతోంది. ఎట్లా సంపాయించావన్నది లెక్క కాదు, ఎంత సంపాయించావన్నది లెక్క. సుజాతకేం తెలుసు? తన కడుపున పుట్టిన పిల్లలేం తెలుసు? దరిద్రం ఎంత దుర్భరమైనదో? ఈ సంపాదనంతా ఎవరికోసం?" అతని అంతరంగంలో ఎక్కడో బలహీనమైన మూలుగుడు పెనుగులాడుతోంది.

"తనను లోకమంతా పైకి వచ్చిన మనిషని కీర్తిస్తోంది? కాని.... తన భార్య తన సమస్త సంపదను, శక్తిని కళ్ళ కద్దుకోవాల్సిన భార్య ఒక్కమారు.... ఒక్కమారు...." మధుసూదన్‌కు తన కాపురం తలుచుకోవడానికే భయమేసింది.

"సుజాత తనకు ఎందుకు దూరమైపోతోంది? తను తాగడు. ఇతర దురల వాట్లేవి లేవు.... తన భార్యకు తనకు ఎక్కడ తగువు ప్రారంభమయ్యింది?" మధుసూదన్‌కు ఒళ్ళు జలదరించింది. ఇలాంటి ప్రశ్న మధుసూదన్‌కు మొలకెత్తడం ఇదే కొత్త....

అయినా ఆ ప్రశ్న అంతకంతకు పెద్దది కాసాగింది. "ఎంత కాలమైంది? ఎక్కడ మొదలయ్యింది? వెండి కొంటె సంతోషపడుతుందనుకున్నాడు. బంగారం కొంటె ఆమె కళ్ళు మెరుస్తాయనుకున్నాడు. బంగళా కడితే ఆమె తృప్తి పడుతుం దనుకున్నాడు. స్త్రీలు ఇలాంటి అవసరాలకు పొంగిపోవడం తనకు తెలుసు. కాని అవేవీ సుజాతను చేరనేలేదు. తను దగ్గరకు చేర వేయనేలేదు. అంతకంతకూ ఇద్దరి మధ్య దూరం పెరిగిందేకాని తరుగలేదు. ఈ లోకం దేనికోసమైతే పడి చస్తుందో? ఈ లోకం దేన్నైతే 'బతికే విధానం' అంటోందో అవేవి సుజాత గుర్తించలేదు.... ఆమె తమ్మున్ని తెచ్చుకుందామంటే కాదంటినా? ఆమె అడుగాలేగాని ఏదైనా చేద్దును. కాని ఏది అడుగదే? వాడు బాగుపడితే అక్క సంతోషపడుతుందనుకుంటి? కాని వాడేమిటో తనకు ఎప్పుడు అర్థంకాలేదు. ఆ చూపులు తనను సవాలు చేస్తుం దేవి. వాడు నాలాగే మాటకు మాట అంటే తనకు అంత పెరుగకపోవును. కాని ఆ మౌనం.... అదే తనను రెచ్చగొట్టేది?"

"దాన్ని తనెంత ప్రేమించాడు" మధుసూదన్ కళ్ళల్లో ఎందుకో బుస బుస కన్నీళ్ళు పొంగాయి. ఇది చిత్రమైన పరిస్థితే. మధుసూదన్ ఈ మధ్యకాలంలో ఎప్పుడు ఏడ్వలేదు. ఏడ్వవలసిన అవసరం కలుగలేదు. ఆ మట్టిరోడ్డులో ఏమి మహాత్యమున్నదో? ఆ దారి ఎంత కన్నీటితో తడిసిందో?

"ఇన్నేండ్లు కష్టపడి ఇంత డబ్బు ఇంత ఆస్తి సంపాదించి తన పిల్లలు తన భార్య సుఖపడాలనే కదా ! లోకులందరికి దూరమైపోయింది. ఒక్కరూపాయి కూడ బెట్టడం కోసం బయట లోకంతో ఎద్ద భీకర యుద్ధం, ఎంత కఠినంగా చేయాల్సి వచ్చేది సుజాతకు 'ఎట్లా తెలిసేది' ? తెలిస్తే ....

ఒకవైపు తోడబుట్టిన అన్నలు, అక్క బాగుపడితేనే, మోసంచేస్తేనే సుజాత కుటుంబం చితికిపోయింది. తండ్రి వాళ్ళతో కొట్లాడితే వీళ్ళకి గతి పట్టేదా ? మాల మాదుగులతో కలిసి వాడు అట్లా తిరిగేవాడా ? ఆ తండ్రి తన చాతకానితనం వల్ల కాదా వీళ్ళ భవిష్యత్తు నాశనం చేసింది ? ఈ కాలంలో పిల్లలు ఎంత హుశారుగా ఉంటు న్నారు ? అరె తను అన్ని రకాలుగా వాడికి మద్దతునిస్తి – ఏమిలేనివాళ్ళు అట్లా పైకి పోతున్నరు ? తను అలాంటి చేతకాని బావమరిదిని చేరదీసింది సుజాత కోసం కదా ? అట్లాగైనా ఒక్క మంచిమాట, పోని...." మధుసూదన్‌కు సుజాత రాతి గుండె గలదనిపించింది. అసలు దానికి ప్రేమ లేదని అనుకున్నాడు. స్త్రీకి సంబంధించిన అతని పరిజ్ఞానం సుజాతను అంచనా కట్టడానికి సరిపోలేదు.

"తనకు నలుభై సంవత్సరాలు దాటుతున్నాయి. సగంలో పడిపోయాడు. ఈ మొత్తం జీవితంలో తాను బాగా అలిసిపోయాడు ? ఇక్కడి నుండి వెనుదిరిగి చూసుకుంటే తనకు మిగిలిందెవరు ? భార్య నా భార్యకాదు. పిల్లలు నా పిల్లలు కాదు...."

మధుసూదన్ అనేకమార్లు ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాడు. ఆ పని చేయగలంత సాహసం తెగింపు తనకు లేవనిపించాయి. బాగా తాగాలనుకున్నాడు. కాని ఆ పని చేయలేకపోయాడు. అనేకమార్లు సుజాత గొంతు నులిమి పారేయాలను కున్నాడు. ఆ పని చేతకాలేదు. అన్నిరకాలుగా విఫలమై మానసిక వైద్యుని దగ్గరికి పరుగెత్తాడు.

అతగాడు భార్యను తీసుకరమ్మన్నాడు.

తనకు ఆ వైద్యున్ని తన్నాలన్నంత కోపం వచ్చింది. తను సుజాతతో ఆ మాట చెప్పగలడా ? చెప్పకుండా ఈ నరకయాతనలో ఎంత కాలమని బతకడం-

"ఇంతకూ తాను చేసిన నేరమేమిటి ?" పదే పదే ఈ ప్రశ్న గింగురు మంటుండగా మధుసూదన్ నడుస్తున్నాడు.

ఆ రోజు డ్యూటీ నుంచి ఇంటికి రాగానే పిల్లలు చెప్పారు "అమ్మ మామయ్య కోసం పోయిందని." మధుసూదన్‌కు పరిణామాలన్నీ అందరికంటె బాగా తెలుసు. మధుసూదన్ ఈ సంకుల సమరంలో ఇంటా బయటా తనో వేపు నిలబడే ఉన్నాడు.

తన డబ్బుకూ, లావాదేవీలకూ, తన సమస్త భవిష్యత్తు పట్ల మధుసూదన్ జాగ్రత్తగానే ఉన్నాడు. వాటికి సంబంధించిన ప్రతిబంధకాల గురించి ప్రతిదీ తెలుసుకుంటూనే ఉన్నాడు.

సరిహద్దు భద్రతా దళాల మోహరింపుతో మధుసూదన్ తన లాంటి వాళ్ళందరి లాగే ఊపిరి పీల్చుకున్నాడు ... ఎప్పటికైనా తనదే గెలుపు అనుకున్నాడు.

కాని చిత్రంగా తాను ఇంటా బయటా ఓడిపోతున్నట్లుగా ఆ క్షణంలో అనిపించింది.

అణిగిపోతున్నదనుకున్నది ఎక్కడో రేగుతోంది. తమ్ముని జాడకోసం ఒంటరిగా తన భార్యే వెళ్ళిపోయింది. కాసేపు తీవ్రమైన కోపంతో పెనుగులాడాడు. కాని తనకు యిష్టం లేకపోయినా బయట లోకం ఒకటున్నది ? అప్పుడు మధుసూదన్ కోపం దిగిపోయింది.

అట్లాగే బయలుదేరాడు. దొరికిన రైలు ఎక్కాడు. ఆ మట్టి రోడ్డుమీద నడుస్తున్నాడు.

సన్నగా తుంపర మొదలయ్యింది. ఆ చిరాకులో తానెందుకోసం వస్తున్నదీ కాస్తా మొదలు మరిచిపోయినవాడిలాగా ఊరి మొదటనే గల మర్రి చెట్టుకింద కాసేపు నిల్చున్నాడు.... అక్కడ నిలువబుద్ధి కాలేదు.

ఊళ్ళోకి నడిచాడేగాని తను ఎక్కడికి పోవాలో ఎవరిని అడుగాలో ? ఏమని అడుగాలో ఏమి తోచలేదు. అతనికి తెలియకుండానే అత్తగారింటి వేపు నడిచాడు. అక్కడ కుప్పకూలిన ఇల్లు తప్ప సుజాత కన్పించలేదు. మధుసూదన్ పూర్తిగా తడిసిపోయాడు ....

తనకు జరిగిందంతా భ్రమలాగే తోచింది. అతని మానసికస్థితి మీద అను మానం వేసింది. అసలు సుజాత ఇంట్లోనే ఉందేమొ ?

మధుసూదన్ ఈ స్థితిలో ఉండగానే మాదిగవాడనుండి ఊళ్ళో కొచ్చిన ఒక యువకుడు మధుసూదన్ దగ్గరిదాకా వచ్చాడు. అతను రాజమ్మ కొడుకు. అతను మధుసూదన్‌ను గుర్తు పట్టాడు.

"సుజాతవ్వ మా యింటికాడ ఉన్నది ?" అన్నాడు.

మధుసూదన్‌కు ఏదీ అర్థం కాలేదు. కాళ్ళీడిస్తూ ఆ బురదలో తాగిననివాలాగా ఆ యువకుని వెంట నడిచాడు.

హరిజనవాడలో చాలామంది పోగై ఉన్నారు.... చింత చెట్టుకింద అనేక గొంతులు ఏడుస్తున్నాయి. అలాంటి ఏడుపులు- మొత్తం మనిషిని చుట్టు ముట్టే ఏడుపులు తనకు కొత్త- మధుసూదన్ లోలోపల ఏదో కరిగి నీరై పోతోంది. ఆ గొంతుల్లో సుజాత గొంతును మధుసూదన్ పోల్చుకున్నాడు.

మధుసూదన్ ఆ మంద ముందుకు చేరేసరికి ముసలి రాజమ్మ, సుజాత ఒకరి నొకరు పెనవేసుకొని ఒకేరక్తం మనుషుల్లాగా ఏడుస్తున్నారు ....

మధుసూదన్‌ను చూసి కొందరు దూరం జరిగారు.

"అయ్యో మా కొడుకు దినాల కచ్చిండ్లానయ్యో" రాజవ్వ వర్ణిస్తూ పొర్లి పొర్లి ఏడుస్తోంది.

మధుసూదన్‌కు అంతా అర్థమౌతూనే ఉన్నది. అతని పాదాలు భూమిలోనికి, శిరస్సు నేలమీదికి వాలిపోతున్నట్లుగా ఉన్నది.

ఎగువ మానేరు బ్రిడ్జిమీద రైలు ధన ధన లాడుతూ వెళ్ళిపోయింది. ఆ చప్పుడు తన గుండెలోనే జరిగినట్లుగా మధుసూదన్ తేరుకొని చుట్టూ చూసాడు. రాజవ్వ మీదపడి సుజాత ఇంకా ఏడుస్తోంది. ఈ మొత్తం భ్రమో, వాస్తవమో తేల్చుకోలేని అయోమయంలో మధుసూదన్‌కు మొత్తం శరీరమంతా మత్తులాగా ఏదో వ్యాపిస్తున్నది.

గాలి తోలడం ఆరంభమయ్యింది. ఆకాశంలోని మబ్బులు ఒక్కొక్కటే విడిపోయి ఒకటి అరా చుక్కలు మెరువసాగినయ్.

నడుస్తున్న చరిత్ర :

# చరిత్రలో నిషేధాలు

—ఎన్. వేణుగోపాల్

"చరిత్ర ఒక సింహావలోకనం చేసే ప్రవక్త: జరిగిపోయిన వాటివల్ల, వాటికి వ్యతిరేకంగా జరగనున్నదేమిటో అది ప్రకటిస్తుంది"- ఎడువార్డో గలియనో

మనుషులను, భావాలను, ఆచరణలను నిషేధించడం బహుశా వర్గ వ్యవస్థ పుట్టుకొచ్చినప్పటి నుంచీ ఉండే ఉంటుంది. చార్వాకుల ఉదాహరణలు, ఎందరో వ్యక్తుల నాలుకలు కోసివేసిన ఘటనలు, దేశ బహిష్కారం విధించిన కథలు, చంపివేసిన కథలు చరిత్రనిండా కొల్లలుగానే ఉన్నాయి. భూస్వామ్యంలో, రాచరికంలో రాజాజ్ఞే అంతిమ శాసనం గనుక తమకు నచ్చని, తమకు వ్యతిరేకమైన భావాలు గలవాళ్ళ మీద ఆంక్షలు, నిషేధాలు విరివిగానే అమలయ్యేవి. అయితే భూస్వామ్య యుగంలో ప్రజా సంస్థల ఏర్పాటు గురించే మనకు వివరమైన సమాచారం లేదు గనుక ఆ సంస్థల మీద పాలకుల నిర్బంధాలు, నిషేధాలు ఎట్లా ఉండేవో కచ్చితంగా తెలియడం లేదు. వలసవాదం దేశంలో ప్రవేశించాక ప్రజా సంస్థలు విస్తృతంగా ఆవిర్భవించాయి. ఈ ప్రజా సంస్థల్లో క్రియాశీలమైన సంస్థల కార్యాచరణను అరికట్టడానికి బ్రిటిష్ ప్రభుత్వం ఆ సంస్థలను నిషేధించ పూనుకుంది. ప్రత్యేకంగా అందుకోసమే 1908లో క్రిమినల్ అమెండ్‌మెంట్ అక్ట్ తీసుకొచ్చింది. ఈ చట్టం అడుగుజాడల్లోనే నిజాం నిరంకుశ రాచరికం కూడ 1348 ఫసలీలో (1938లో) ప్రజా రక్షణ చట్టం తీసుకొచ్చింది. ఈ రెండు చట్టాలు కూడ ఏ సామాజిక, చారిత్రిక సందర్భంలో అమలులోకి వచ్చాయో, ఏ యే సందర్భాల్లో మళ్ళీ మళ్ళీ అమలులోకి వస్తున్నాయో పరిశీలించడం ఆసక్తికరంగా ఉంటుంది.

కర్జన్ వైస్‌రాయ్‌గా ఉన్న కాలంలో బ్రిటిష్ ప్రభుత్వం మూడు చర్యల ద్వారా బెంగాలీల చైతన్యాన్నీ, సంఘటిత శక్తినీ దెబ్బతీయడానికి ప్రయత్నించింది. అవి, ఒకటి, 1899 కలకత్తా మునిసిపల్ అమెండ్‌మెంట్ అక్ట్, రెండు, 1904 ఇండియన్ యూనివర్సిటీస్ అక్ట్, మూడు, 1905 బెంగాల్ విభజన.

క్రమక్రమంగా ఈ మూడు చర్యలు బెంగాలీ ప్రజానీకంలో స్వదేశాభిమానాన్ని, పోరాట శీలాన్ని పెంచాయి.

ముఖ్యంగా బెంగాల్ విభజన ప్రకటనతో బెంగాల్‌లో క్రియాశీల ఉద్యమాల శకం ప్రారంభమైంది. 1905 జులై 8న బెంగాల్ విభజన ప్రకటన వెలువడితే ఆగస్టు 7 నుంచి విదేశ వస్తు బహిష్కరణ ప్రారంభమైంది. ఒకవైపు విద్యావంతులలో ఈ నిరసన వెల్లువ చెలరేగుతుండగానే, మరో వైపు పెరుగుతున్న ధరలకూ, పెరగని జీతాలకూ మధ్య నలిగిపోతున్న కార్మికులు సమ్మెలకు దిగారు. మొట్టమొదటిసారిగా ట్రేడ్ యూనియన్లను ఏర్పరచడానికి, వాటిని జాతీయోద్యమంలో భాగం చెయ్యడానికి ప్రయత్నాలు మొదలయ్యాయి. యూరపియన్ సంస్థలలో పని చేసే బెంగాలీ గుమస్తాలు, ప్రభుత్వ ముద్రణాలయాల్లో ప్రింటర్లు, కంపోజిటర్లు ఈ సమ్మెలకు నాయకత్వం వహించారు. బెంగాలీ కార్మికులు చేతులకు రాఖీలు కట్టుకుని, 'వందేమాతరం' అని నినదిస్తూ వీధుల్లోకొచ్చారు. మామూలు రోజు కూలీ చేసుకునే కార్మికులు కూడ తమ రోజు కూలీని జాతీయ నిధికి సమర్పించారు. ఈ స్వదేశీ ఉద్యమంలో అగ్రభాగాన నిలిచిన వాళ్ళు పాఠశాలల, కళాశాలల విద్యార్థులు. ఈ విద్యార్థి ప్రదర్శకుల మీద విరుచుకుపడడానికి ప్రభుత్వం కార్లయిల్ సర్క్యులర్ అనేదాన్ని తీసుకొచ్చింది. దాని ప్రకారం, జాతీయవాద విద్యార్థులు ప్రబలంగా ఉన్న విద్యాసంస్థలకు నిధులు, స్కాలర్ షిప్పులు ఆపేస్తానని, గుర్తింపును రద్దు చేస్తానని ప్రభుత్వం ప్రకటించింది. దీంతో బెంగాల్ అంతటా సర్క్యులర్ వ్యతిరేక సమితులు తలెత్తాయి. ప్రభుత్వ విద్యా సంస్థలను కూడ బహిష్కరించాలని, వాటి స్థానంలో జాతీయ విద్యా సంస్థలను ఏర్పాటు చేయాలని స్వదేశీ ఉద్యమం నిర్ణయించింది. 1909 నాటి లెక్కల ప్రకారం తూర్పు బెంగాల్‌లోనూ, అస్సాంలోనూ నలభై జాతీయ పాఠశాలలు ఏర్పడ్డాయి. వాటిలో విద్యార్థుల సంఖ్య రెండున్నర వేల నుంచి మూడువేల దాకా ఉండింది. ఈ ప్రాంతంలో రాజకీయ ఉద్యమాలకు ఈ పాఠశాలలే కేంద్రాలయ్యాయి. ఈ పాఠశాలల్లో నుంచి విద్యార్థులు బైటికి వెళ్ళి స్వదేశీ ఉద్యమాన్ని ప్రచారం చేసేవాళ్ళు. చివరికి ఈ పాఠశాలలు వ్యాయామ శిక్షణా కేంద్రాలుగా కూడ మారాయి. లాఠీని, కత్తిని, చురకత్తిని ఉపయోగించడం కూడ ఇక్కడ నేర్పేవాళ్ళు. ఈ కార్యక్రమాల ఫలితంగా బెంగాల్ అంతటా ఒక స్వచ్ఛంద సేవకుల వ్యవస్థ ప్రారంభమైంది.

నిజానికి స్వదేశీ ఉద్యమంలో రెండు మూడు ప్రధానమైన ధోరణులు విడివిడి పాయలు గానూ, కొన్ని సందర్భాల్లో కలిసిపోయీ సాగాయి. స్వదేశీ ఉద్యమం ఒకవైపు కాంగ్రెస్ మితవాద నాయకుల ఆధ్వర్యంలో సాగుతుండగానే, ఆ ఉద్యమంలోంచి అతివాదులు తలెత్తనారంభించారు. మరోవైపు గత శతాబ్ది చివరా, స్వదేశీ ఉద్యమానికి ఐదారేళ్ళ ముందర బెంగాల్‌లో ఏర్పడుతూ వచ్చిన విప్లవకారుల బృందాలు స్వదేశీ ఉద్యమంలో పూర్తిగా పాల్గొన్నాయి. 1907 ఏప్రిల్‌లో బందేమాతరం పత్రికలో "శాంతియుత ఆశ్రమాలు, స్వదేశీ తత్వం, స్వయం సేవ వ్యవహారం" అసమగ్రమైనదని అరవింద ఘోష్ విమర్శించాడు. "నిర్మాణయుత మైన, ఎడతెరిపిలేని బహిష్కరణే" సరైన కార్యక్రమమని ప్రకటించాడు. బ్రిటిష్ వస్తువులను, అధికారిక విద్యను, న్యాయవ్యవస్థను, కార్య నిర్వాహక వ్యవస్థను బహిష్కరించాలన్నాడు. అంటే బ్రిటన్ నుండి దిగుమతి అయ్యే వస్తువులు కొనగూడదు. ప్రభుత్వ పాఠశాలల్లో చదవగూడదు. వ్యాజ్యాల, తగాదాల పరిష్కారానికి ప్రభుత్వ న్యాయస్థానాలకు వెళ్ళగూడదు. ప్రభుత్వోద్యోగాలు చెయ్యగూడదు. అందుకు బదులుగా స్వదేశీ పరిశ్రమలు నెలకొల్పాలి. జాతీయ పాఠశాలలు స్థాపించాలి. స్థానిక ప్రజా పంచాయతీల ద్వారా సమస్యలు పరిష్కరించుకోవాలి. అన్యాయమైన చట్టాలను పౌర శాసనోల్లంఘనం ద్వారా ఎదిరించాలని కూడ అరవిందఘోష్ ఈ వ్యాసంలో పిలుపిచ్చాడు. ప్రభుత్వ విధేయులకు సాంఘిక బహిష్కారం విధించాలన్నాడు. బ్రిటిష్ నిర్బంధకాండ సహనపు సరిహద్దులు దాటితే సాయుధ పోరాటానికైనా సిద్ధపడాలని హెచ్చరించాడు.

మరోవైపు నుంచి పాఠశాలల, కళాశాలల విద్యార్థుల నుంచి రూపొందుతున్న స్వచ్ఛంద సేవకులు సమితులలో చేరడం మొదలయింది. 1906 ఏప్రిల్‌లో బారిసాల్‌లో జరిగిన బెంగాల్ ప్రొవిన్షియల్ కాన్ఫరెన్స్‌తో స్వచ్ఛంద సేవకుల ఉద్యమం ప్రాముఖ్యంలోకి వచ్చింది. బారిసాల్‌లోనే 200 మంది వలంటీర్లతో స్వదేశ్ బాంధవ్ సమితి ఏర్పడింది. ఈ సమావేశం జరగకుండా చేయడానికి, వలంటీర్లు నిషేధాజ్ఞల్ని ఉల్లంఘించి వీధుల్లో వందేమాతరం గీతం పాడకుండా చేయడానికి పోలీసులు విరుచుకుపడ్డారు. సురేంద్రనాథ బెనర్జీని, కార్యకర్తలను అరెస్టు చేశారు. దేశవ్యాప్తంగా ఈ పోలీసు చర్యకు నిరసన ప్రదర్శనలు జరిగాయి.

మరికొద్ది రోజులకే ఈ వలంటీర్ల బృందాలతో కూడిన సమితులు తూర్పు

బెంగాల్ అంతటా వ్యాపించాయి. బ్రిటిష్ వస్తు బహిష్కారం పెద్ద ఎత్తున, క్రమ బద్ధంగా జరిగింది. ఈ ఉద్యమంలో భాగంగా బలప్రయోగాన్ని విశ్వసించే బృందాలు బలపడ్డాయి. కలకత్తాలో ఆంటీ సర్క్యులర్ సొసైటీ, వందేమాతరం, సాంప్రదాయ్, బ్రతి సమితి ఏర్పాటయ్యాయి. తూర్పు బెంగాల్‌లో బారిసాల్ స్వదేశ్ బాంధవ్ సమితి, ఫరీద్‌పూర్ డిస్ట్రిక్ట్ అసోసియేషన్, ఫరీద్‌పూర్ బ్రతి సమితి, ఢాకా అనుశీలన్ సమితి, మైమెన్ సింగ్ సుహృద్ సమితి వంటి అనేక సంస్థలు ఏర్పడ్డాయి. వీటి సభ్యత్వం పదివేలకు మించి ఉంటుందని అంచనా వేయబడింది. స్వదేశ్ బాంధవ్ సమితికి 175 శాఖలుండేవి. వాళ్ళు సభలు, సమావేశాలు, ప్రదర్శ నలు నిర్వహించేవాళ్ళు. స్వదేశీ జాత్రా అనే కళాకారుల బృందాన్ని తయారు చేసి దేశభక్తియుత కార్యక్రమాల్ని ప్రదర్శిస్తూ గ్రామాల్లో తిరిగేవారు. ఈ ప్రదర్శనల్లో ప్రతాపాదిత్య, సిరాజుద్దౌలా, పృథ్వీరాజ్ మొదలయిన నాటకాలుండేవి. బ్రిటిష్ న్యాయ వ్యవస్థను ధిక్కరించి భారతీయ, ప్రత్యామ్నాయ న్యాయ వ్యవస్థను స్థాపించా లనే లక్ష్యాన్ని కూడ స్వదేశ్ బాంధవ్ సమితి పెద్ద ఎత్తున చేపట్టింది. సమితి తొలి వార్షిక నివేదికలో, అంటే 1906 సెప్టెంబర్ నాటికి 523 గ్రామీణ తగాదాలను, 89 పంచాయతీ కమిటీల ద్వారా పరిష్కరించామని రాసుకున్నారు.

ఈ ఉద్యమ వెల్లువలో ఒక ప్రధానమైన పాయ ఢాకా అనుశీలన్ సమితి. 1906 సెప్టెంబర్‌లో కలకత్తా నుంచి బిపిన్ చంద్రపాల్, ప్రమథ నాథ మిత్రలు ఢాకా వచ్చి స్వదేశీ ఉద్యమం గురించి ఉపన్యాసాలు చేశారు. అప్పటికే ఢాకాలో వ్యాయామశాలలు నడుపుతున్న ఉపాధ్యాయుడు పులిన్ బిహారీదాస్ జిల్లాలోని వలంటీర్లతో ఢాకా అనుశీలన్ సమితి ఏర్పరిచాడు. ఇది స్వతంత్ర సంస్థే అయినా, ప్రమథనాథ మిత్ర నాయకత్వంలోని కలకత్తా అనుశీలన్ సమితితో సన్నిహితంగా ఉండేది.

బారిసాల్ స్వదేశ్ బాంధవ్ సమితి బహిరంగ ప్రజాసంస్థ గానూ, ఢాకా అను శీలన్ సమితి రహస్య విప్లవ సంస్థగానూ పనిచేస్తుండేవి. మొదటి నుంచీ కూడ ఢాకా అనుశీలన్ సమితి ఉక్కు క్రమశిక్షణ గల అర్ధసైనిక సంస్థగా పని చేస్తుండేది. స్వదేశీ భావాల ప్రచారానికీ, యువకుల శారీరక దారుఢ్య శిక్షణకూ ఈ సంస్థ సమాన ప్రాధాన్యత ఇచ్చేది. ఈ సంస్థకు హిందూ ఆధ్యాత్మికత పునాదిగా ఉండేది. ప్రమాణ దీక్షలు, శపథాలు, తప్పనిసరి గీత బోధనలు, స్వామి వివేకానంద రచనల అధ్య

యసం వంటివి ఈ సంస్థ పాటించేది. మూడువేల మంది సభ్యులపైన ఢాకాలో కేంద్ర సమితికి అగ్రనాయకుడుగా 'కెప్టెన్ జనరల్' ఉండేవాడు.

వ్యాయామం, శారీరక శిక్షణ, ఆయుధ వినియోగంలో శిక్షణ సమితి ప్రధాన కార్యకలాపాలు. బ్రిటిష్‌వారిని బలప్రయోగంతో వెళ్ళగొట్టడం సమితి ఆశయం. నిజానికి 1907 నాటికే స్వదేశీ ఉద్యమం లోలోపల క్రియాశీల ధోరణులు వ్యక్తం కాసాగాయి: "ప్రతి జిల్లాలోనూ ఉన్న ఇంగ్లీషు అధికారుల సంఖ్య ఎంత? దృఢమైన నిర్ణయం తీసుకుంటే ఇంగ్లీషు పాలనను ఒక్క రోజులో అంతం చేయవచ్చు.... సోమరిగా కూచుంటే, మొత్తం జనాభా తిరగబడేవరకు వేచి ఉండాలని అనుకుంటే ఎప్పటికీ క్రియారహితంగానే కూచోవలసి వస్తుంది.... దేశభక్తులారా! రక్తతర్పణ లేకుండా దేశం మేల్కొంటుందా?" అని 1907 మార్చ్‌లోనే యుగాంతర్ పత్రిక రాసింది. అనుశీలన్ డ్రిల్ మాన్యువల్‌లో చురకత్తులను, కత్తులను, లాఠీలను, వెదురు ఈటెలను వాడడం గురించి వివరాలుండేవి.

అనుశీలన్ సమితి బలపడిన తర్వాత భారతీయుల మీద యూరోపియన్ల దాడులు తగ్గాయి. బెంగాలీ యువకుల చేతికి బ్రిటిషర్లు చిక్కడం సాధారణమైంది. ప్రధానంగా హిందూ చిహ్నాల మీద ఆధారపడిన విప్లవకారులు కాళికాదేవికి "తెల్ల మేక"లను బలి ఇస్తామని, "ఫరంగీల వేడి నెత్తురు తాగుతామని" ప్రకటించారు. నిజానికి ఈ విప్లవ హింసకు బలి అయిపోయినవాళ్ళు ఎక్కువమంది భారతీయులే. సహజంగానే ఇన్‌ఫార్మర్లు, ద్రోహులు, గూఢచారులు భారతీయులే అయి ఉండడం వల్ల వాళ్ళే ఎక్కువమంది చచ్చిపోయారు. కాని మొట్టమొదటి దాడులు తెల్లవాళ్ళ మీదనే ఎక్కుపెట్టబడ్డాయి. 1907 డిసెంబర్‌లో బెంగాల్ లెఫ్టినెంట్ గవర్నర్ ప్రయాణిస్తున్న రైలును పేల్చేసే ప్రయత్నం జరిగింది. ఢాకా జిల్లా మెజిస్ట్రేట్‌ను కాల్చేసే ప్రయత్నం జరిగింది. 1908 మార్చ్‌లో కుష్టియాలో ఒక మిషనరీని కాల్చేసే ప్రయత్నం జరిగింది. ఏప్రిల్‌లో చందర్‌నాగోర్ మేయర్‌ను పేల్చేసే ప్రయత్నం జరిగింది. అదే నెల ముజఫర్‌పూర్‌లో చీఫ్ ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ ఒక వాహనంలో ఉన్నాడనుకుని కాల్పులు జరపగా ఇద్దరు ఇంగ్లీషు స్త్రీలు చచ్చిపోయారు. అదే సమయంలో ఎం. ఎన్. రాయ్ నాయకత్వంలో ఈస్ట్ బెంగాల్ స్టేట్ రైల్వేలైన్ మీద ఎన్నో బాంబు దాడులు జరిగాయి. కలకత్తా శివార్లలో మానిక్‌తలాలో ఒక ఆధ్యాత్మిక పాఠశాలను, బాంబుల ఫ్యాక్టరీని పెట్టే ప్రయత్నం జరిగింది. ఈ

ప్రయత్నం బైటపడి కుట్రకేసు విచారణ జరుగుతుండగా, కుట్రకేసును పరిశోధిస్తున్న ఒక పోలీసు సబ్ఇనస్పెక్టర్‌ను, ఒక పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ను, ఒక ముస్లిం సిఐడి అధికారిని విప్లవకారులు కాల్చి చంపారు. ఈ క్రమంలో ఆర్థిక దాడులు, ఆయుధాల కోసం దాడులు కూడ విస్తృతంగానే జరిగాయి.

చిట్ట చివరికి విప్లవకారులందరూ అనుశీలన్ సమితి, జుగాంతర్ పార్టీ అనే రెండు సంస్థలుగా ఏర్పడ్డారు. కలకత్తా అనుశీలన్ సమితిలో నుంచే తీవ్రవాదులు జుగాంతర్ పత్రికను స్థాపించి, క్రమక్రమంగా జుగాంతర్ పార్టీగా రూపొందారు. ఈ రెండు సంస్థల నిర్మాణాలలోను, లక్ష్యాలలోను కొన్ని భేదాలుండేవి. జుగాంతర్ పార్టీ విడివిడిగా ఉండే స్థానిక దళాల సమాఖ్యగా ఉండేది. దళనాయకులను దాదా (అన్న) అని పిలిచేవాళ్ళు. మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో జర్మన్ల సహాయంతో ఆయుధాలు, మందుగుండు సంపాదించి బ్రిటిష్ ప్రభుత్వం మీద పెద్ద ఎత్తున సాయుధ తిరుగుబాటు జరపాలని జుగాంతర్ నాయకుడు జతిన్ ముఖర్జీ ప్రణాళిక వేశాడు. ఆ సమయంలో జుగాంతర్ పార్టీ నిర్మాణం క్రమబద్ధతను సంతరించుకుంది. మైమెన్‌సింగ్ గ్రూప్, బారిసాల్ గ్రూప్, కలకత్తా ఆత్మోన్నతి గ్రూప్, సేవాసమితి, మదారిపూర్ పార్టీల ప్రతినిధులతో ఒక కమిటీని జతిన్ ముఖర్జీ ఏర్పరిచాడు. ఈ భారత-జర్మన్ ఒడంబడిక కార్యరూపం దాల్చక ముందే బయట పడింది. 1915 సెప్టెంబర్‌లో జతిన్ ముఖర్జీని పోలీసులు కాల్చి చంపారు. ఆ తర్వాత జాదూగోపాల్ ముఖర్జీ నాయకత్వంలో జుగాంతర్ కార్యకర్తలు మూసర్ పిస్తోళ్ళతో హత్యల పరంపర సాగించారు.

ఈ భారత-జర్మన్ ప్రయత్నాల నుంచి అనుశీలన్ సమితి దూరంగా ఉండిపోయింది. హత్యలు, దాడులు సాగిస్తూ ఉండింది. అయితే దీనికి జుగాంతర్ పార్టీ కన్న దృఢమైన నిర్మాణం ఉండేది. కేంద్రీకృతంగా, పైనుంచి కిందికి అంతస్తులతో నిర్మాణం ఉండేది. తూర్పు బెంగాల్‌లో, అస్సాంలో జుగాంతర్ పార్టీకి నాలుగు పాలనా విభాగాలుండేవి. ఈ మొత్తం సంస్థకు పులిన్‌దాస్ అగ్రనాయక స్థానంలో ఉండేవాడు. ఆయనకు సంపూర్ణాధికారాలుండేవి. సమితి కేంద్ర కార్యాలయంలో రాత్రింబవళ్ళు కాపలా ఉండేది. నియమాలను ఉల్లంఘిస్తే తీవ్రమైన శిక్షలుండేవి. పులిన్‌దాస్ ఆదేశాలు లేకుండా ఏ పనీ జరిగేది కాదు. ప్రతి జిల్లాకూ ఒక జిల్లా ఆర్గనైజర్‌ను నియమించేవారు. సమితి శపథాలు అచ్చువేసి జిల్లాలకు పంపించేవాళ్ళు.

జిల్లా ఆర్గనైజర్ జిల్లాలోని ప్రతి ఉన్నత పాఠశాలతోను, కళాశాలతోను సంబంధాలు పెట్టుకోవలసి ఉండేది. జిల్లాలో ప్రచారం కొనసాగించి, ప్రతి తరగతి నుంచి విద్యార్థులను సమితిలోకి సభ్యులుగా తీసుకోవలసి ఉండేది. అట్లా సమితిలో చేర్చుకున్న ప్రతి కొత్త విద్యార్థి పూర్తి వివరాలు కేంద్ర సమితికి తెలపవలసి ఉండేది. తన ప్రాంతంలో ప్రభుత్వ విధేయుల నుంచి ఆయుధాలు స్వాధీనం చేసుకోవడంగాని, దొంగిలించడం గాని ఆర్గనైజర్ కర్తవ్యాలుగా ఉండేవి. కాని ఢాకా నుంచి అనుమతి లేకుండా పెద్ద చర్యలేవీ చేపట్టడానికి వీలులేదు. త్రైమాసిక నివేదికలు, జమా ఖర్చు లెక్కలు తప్పనిసరిగా ఢాకాకు పంపవలసి ఉండేది. జిల్లా కేంద్రాల నుంచి గ్రామీణ ప్రాంతాలకు ఉపన్యాసకులను పంపించేవాళ్ళు. ప్రతి గ్రామంలో సమితి శక్తి గురించి, పొందిన శిక్షణ గురించి, ఆ గ్రామ జనాభా గురించి, గ్రామ నైసర్గిక పరిస్థితుల గురించి అతి చిన్న వివరాలతో సహా సేకరించడానికి కింది స్థాయి కార్యకర్తల దగ్గర ప్రశ్నపత్రాలుండేవి. ప్రభుత్వంతో తలపడడానికి సమయం రావాలనీ, రహస్యంగా, గుట్టుచప్పుడు కాకుండా పనిచేస్తూ అన్ని ఏర్పాట్లు పూర్తయ్యాకనే ప్రభుత్వం మీద దాడి చేయాలనీ పులిన్‌దాస్ భావించేవాడు.

ఈ పోరాట కథనానికి మధ్యలోనే ఈ పోరాటం మీద నిర్బంధాలు, నిషేధాలు మొదలయ్యాయి. 1907 మే, నవంబర్‌లలో నిర్దిష్ట ప్రాంతాలలో "రాజద్రోహకరమైన" సమావేశాల్ని నిషేధించే ఉత్తర్వులొచ్చాయి. ముద్రణాలయాల్ని జప్తు చేసుకునే అధికారం ఇచ్చే పత్రికా చట్టాలు 1908 జూన్‌లో, 1910 ఫిబ్రవరిలో వెలువడ్డాయి. 1908 డిసెంబర్‌లో వచ్చిన క్రిమినల్ లా అమెండ్‌మెంట్ అక్ట్ అనే చట్టం దేశంలో ప్రజా సంస్థల్ని నిషేధించే అధికారాల్ని ప్రభుత్వానికిచ్చింది. ఈ చట్టం కింద మొట్టమొదట 1909 జనవరిలో ఐదు ప్రధాన సమితులను (స్వదేశ్ బాంధవ్, బ్రతి, ఢాకా అనుశీలన్, సుహృద్, సాధనా) నిషేధించారు. 1908 డిసెంబర్‌లో తొమ్మిదిమంది బెంగాలీ నాయకులను దేశాంతర వాసం పంపించారు. ఇన్ని నిషేధాలను, నిర్బంధాలను తట్టుకుని కూడ ఈ సంస్థల కార్యాచరణ కొనసాగింది. చివరికి 1917 డిఫెన్స్ ఆఫ్ ఇండియా అక్ట్ ప్రకటించి జుగాంతర్, అనుశీలన్ నాయకులను జైళ్ళలో పెట్టారు. కార్యకర్తల మీద గ్రామాలు వదలగూడదని నియమాలు పెట్టారు.

ఈ మొత్తం కథనం తేల్చి చెప్పేదేమంటే, ప్రజా ఉద్యమం మీద బ్రిటిష్

ప్రభుత్వం అమలుచేసిన నిర్బంధకాండ విఫలమైపోయింది. నిషేధించిన సంస్థలు నిజానికి ఇంకా విస్తృతమయ్యాయి, బలపడ్డాయి. స్వదేశీ ఉద్యమ కాలపు బహిరంగ సంస్థలు పోలీసు దమనకాండకు, నాయకత్వపు మితవాదానికీ బలి అయి విచ్ఛిన్నమై పోయినప్పుడు, ఈ నిషిద్ధ సంస్థలే అజ్ఞాత వాసంలో పనిచేస్తూ, రానున్న విప్లవ ప్రయత్నాల్ని ప్రచారం చేస్తూ జాతీయోద్యమ స్ఫూర్తిని సజీవంగా ఉంచాయి. అంతేగాక ఈ నిషిద్ధ బృందాల నుంచే గదర్ పార్టీ, తొలి భారతీయ కమ్యూనిస్టులు రూపొందారు. ఆ రకంగా వలసవాద ప్రభుత్వం ప్రకటించిన నిషేధం, అమలు చేసిన నిర్బంధకాండ జాతీయోద్యమ చైతన్యాన్ని అరికట్టలేదు సరిగదా, క్రియాశీల జాతీయోద్యమానికి, నిజమైన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట ధారకు దారితీసింది.

× × ×

ఏడవ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ పరిపాలనలో అక్షరాస్యుల జనాభా ఆరుశాతం. హైదరాబాద్ సంస్థానంలో ఉస్మాన్ అలీఖాన్ పాలన ప్రారంభకాలానికి రెండు మూడు చోట్ల తెలుగు గ్రంథాలయాలు ఏర్పడడం మినహా ప్రజాసంస్థల ఏర్పాటు జరగలేదు. అసలు సంస్థాన రాజకీయాలలోనే కనీస ప్రజాస్వామ్యం కూడ అమలులో లేకుండింది. మొదటి సాలార్‌జంగ్ ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు ఒక శాసనసభను ఏర్పరిచే ప్రయత్నం జరిగింది గాని ఆ శాసనసభలో కూడ 22 మంది సభ్యులలో ఎన్నికల ద్వారా వచ్చే సభ్యులు నలుగురే. ఆ నలుగురి ఎన్నిక కూడ జాగీర్దార్లకు, వకీళ్ళకు పరిమితమై ఉండేది గాని సార్వత్రిక వయోజన వోటుహక్కు ఉండేది కాదు. ఇక ప్రభుత్వ అనుమతి లేకుండా సభలు, సమావేశాలు జరుపుకోవడానికి వీలు లేదు.

ఇటువంటి వాతావరణంలో 1921 లో హైదరాబాద్ స్టేట్ రిఫారమ్స్ అసోసియేషన్ అనే సంస్థ ఏర్పడి రాజ్యాంగ సంస్కరణల కోసం ఒక మహాసభ జరపడానికి ప్రయత్నించింది. ప్రభుత్వం ఈ సభను నిరోధిస్తూ ఫర్మానా జారీ చేసింది. గ్రంథాలయాల వార్షికోత్సవాలు, వర్తక సంఘాల సభలు, సంఘ సంస్కరణ సభలు కూడ జరుపుకోవడానికి వీలులేని పరిస్థితులొచ్చాయి. ఈ నేపథ్యంలో ఏర్పడింది ఆంధ్రజన సంఘం. క్రమక్రమంగా ఈ దశాబ్దమే హైదరాబాద్ రాష్ట్రంలో అనేక ప్రజాసంస్థల ఆవిర్భావానికి నాంది పలికింది.

1930 ల నుంచి భారత జాతీయ కాంగ్రెస్‌ను స్వదేశీ సంస్థానాలలో నెల

కొల్సాలా లేదా అని విస్తృతమైన చర్చ జరుగుతూ వచ్చింది. కాంగ్రెస్‌కు సంస్థానాలలో శాఖలు ఏర్పరచగూడదని, ఆ యా ప్రాంతాలలో బాధ్యతాయుత పాలనను కోరే సంస్థలు ఏర్పడవచ్చునని స్వయంగా గాంధీ అన్నాడు. ఈ చర్చ సాగుతుండగానే హైదరాబాద్ రాష్ట్రంలో స్టేట్ కాంగ్రెస్‌ను ఏర్పరచాలని ప్రయత్నాలు మొదలయ్యాయి. రాష్ట్రంలో స్టేట్ కాంగ్రెస్ ఏర్పడకుండా చెయ్యడానికి నిజాం ప్రభుత్వం 1938 లో (1348 ఫసలీ) ప్రజా రక్షణ చట్టం తీసుకొచ్చింది. 1908 క్రిమినల్ లా అమెండ్‌మెంట్ అక్ట్‌ను అనువర్తింపజేసుకున్న ఈ చట్టం స్టేట్ కాంగ్రెస్‌ను ఏర్పడక ముందే నిషేధించింది.

హైదరాబాద్ రాష్ట్రంలో 'హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్' పేరుతో ఒక సంస్థను ఏర్పాటు చేసే ఉద్దేశ్యంతో 1938 జూలై లో ఒక తాత్కాలిక కమిటీ ఏర్పాటయింది. తాత్కాలిక కమిటీ సమావేశకర్త బూర్గుల రామకృష్ణారావు. కాంగ్రెస్ ఉద్దేశ్యాలు తెలుపుతూ, ప్రజల సహకారం కోరుతూ, సభ్యులుగా చేరమని ప్రజలకు విజ్ఞప్తి చేస్తూ అగస్టులో తాత్కాలిక కమిటీ తరపున ప్రకటన వెలువడింది. ఈ ప్రకటనకు స్పందించి 1200 మంది స్టేట్ కాంగ్రెస్‌లో సభ్యులుగా చేరారు. సెప్టెంబర్ 9 న ఈ సభ్యులందరినీ సమావేశపరచి లాంఛనంగా స్టేట్ కాంగ్రెస్ ఆవిర్భావాన్ని ప్రకటించాలనుకున్నారు.

కాని నిజాం ప్రభుత్వం సెప్టెంబర్ 7 న ఒక ఫర్మాన్ జారీ చేసింది. ఆ ఫర్మాన్ ప్రకారం దస్తూరుల్ అమల్ తహఫుజ్ అమనే అమ్ (ప్రజా సంరక్షణ చట్టం) అనేది అమలులో కొచ్చింది. "ఇది ఇంతవరకు బ్రిటిష్ ఇండియాలో అమలులో నున్న క్రిమినల్ లా అమెండ్‌మెంట్ అక్ట్ లాంటిదని చెప్పవచ్చును" అని మందుముల నరసింగరావు రాశారు.

సెప్టెంబర్ 9 సమావేశం తాత్కాలిక కమిటీ సభ్యుడు జి. రామాచారి ఇంటిలో జరగవలసి ఉండింది. హైదరాబాద్ కొత్వాల్ సెప్టెంబర్ 7 న రామాచారిని పిలిపించి సమావేశం జరిగితే ఇంటిని స్వాధీనం చేసుకుంటామని బెదరించాడు. సమావేశం వాయిదా పడింది. ప్రధాని అక్బర్ హైదరీ ముఖ్యులను పిలిపించి సమావేశాన్ని రద్దు చేయమని ఆదేశం లాంటి సలహా ఇచ్చాడు. చర్చలు, సంప్రదింపులు అట్లా ఎడతెగకుండా సాగుతూ పోయాయి.

స్వామీ రామానంద తీర్థ మాటల్లో చెప్పాలంటే "మేమందరమూ ఆలోచించి నటువంటి రాజకీయ సంస్థ ఆవిర్భవించేటందుకు అధికారులు ఇష్టపడలేదు. దాన్ని వారు ఆదిలోనే తుంచి పారెయ్యాలనుకొన్నట్టున్నారు. ఒక బలమైన పిడికిలి మా తలమీద పడేటందుకు సిద్ధంగా ఉన్న లక్షణాలు కన్పించాయి. మతావేశమూ, భూస్వామ్య తత్వమూ కలిసి గడ్డ కట్టుకుని రూపొందిన నిరంకుశ ప్రభుత్వాధికారము కొనసాగిస్తున్న సంస్థానంలోని ప్రజలు బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సాధించుకొనే టందుకు ఏర్పాటు చేసుకోదలచుకున్న సంఘము అవతరించడాన్ని ఆ ప్రభుత్వం సహించగలదా? అది తమకు సంబంధించిన విషయం కాదన్నట్లు చూస్తూ ఊరుకో గలదా ?"

స్టేట్ కాంగ్రెస్ ఒక మత పక్షపాత సంస్థ అని, ప్రజలను మోసగించడానికే భారత జాతీయ కాంగ్రెస్ పేరు పెట్టుకున్నదని నిషేధాజ్ఞలో ప్రభుత్వం ఆరో పించింది. దేశీయ రాజ్యాలలో జరిగే ఆందోళనల్లో తమ పేరు ఉపయోగించగూడదని జాతీయ కాంగ్రెస్ నిర్ణయించినా, హైదరాబాదులో మాత్రం ఆ పేరే ఉపయోగిస్తున్నా రని, ఈ పేరు వల్ల అనవసరంగా ఇది జాతీయ కాంగ్రెస్ అనుబంధ శాఖ అనే అభిప్రాయం కలుగుతుందని ప్రభుత్వం వాదించింది. బ్రిటిష్ ఇండియాలో ఉన్నటు వంటి ప్రత్యేక పరిస్థితులు హైదరాబాదు సంస్థానంలో లేనందువల్ల ఈ సంస్థ అవసరం లేదని ప్రభుత్వం ప్రకటించింది.

స్టేట్ కాంగ్రెస్ ఇంకా లాంఛనంగా పుట్టడానికన్న ముందే నిషేధాజ్ఞ పుట్టుకురావడం వల్ల తాత్కాలిక కాంగ్రెస్ కమిటీ సాధ్యమయ్యే ప్రత్యామ్నాయాల గురించి ఆలోచనలు ప్రారంభించింది. సత్యాగ్రహం చేయడం మినహా మరో ప్రత్యామ్నాయం లేదనే నిర్ణయానికి వచ్చింది. తాత్కాలిక కమిటీ రద్దయి, దాని స్థానంలో కార్యాచరణ కమిటీ ఏర్పాటయింది. ఈ కమిటీకి గోవిందరావు నానల్ అధ్యక్షుడు కాగా, రావి నారాయణరెడ్డి సభ్యుల్లో ఒకరు. 1938 అక్టోబర్ 24 న హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ స్థాపించబడిందని ప్రకటించి, సత్యాగ్రహాలు, శాసనోల్లంఘన సాగించాలని నిర్ణయించారు. అనుకున్నట్టుగానే సత్యాగ్రహం జరి గింది గాని, ఈ సత్యాగ్రహుల మీద ప్రభుత్వం నిషేధ చట్టాన్ని ప్రయోగించలేదు. బహిరంగ ప్రదర్శనకు అనుమతి లేదనే కారణం చూపి గక్షీ నిషాన్ 53 కింద నేరారోపణ చేశారు.

ఆ తర్వాత ప్రభుత్వంతో జరిగిన చర్చల్లో హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌ను హైదరాబాద్ నేషనల్ కాన్ఫరెన్స్‌గా పిలిస్తే నిషేధం ఎత్తి వేస్తామనే ప్రతిపాదన వచ్చింది. కొన్నాళ్ళపాటు నలిగిన తర్వాత ఈ ప్రతిపాదన రద్దయిపోయింది. సుదీర్ఘ చర్చల తర్వాత 1946 జులైలో ప్రభుత్వం స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధాన్ని ఎత్తి వేసింది. 1947 జూన్‌లో కాంగ్రెస్ తన మొదటి మహాసభను జరుపుకుని కార్యక్రమాలు ప్రారంభించింది.

మళ్ళీ ఈ సందర్భంలోనూ నిషేధాజ్ఞ ప్రజా ఉద్యమాన్ని అణచలేదు సరిగదా, నిజాం పట్ల వ్యతిరేకత ఉద్యమరూపం ధరించడానికి, సంఘటితం కావడానికి దారి తీసింది. స్టేట్ కాంగ్రెస్‌ను సక్రమంగా ఏర్పడక పోనివ్వడం వల్లనే, స్టేట్ కాంగ్రెస్‌లోనూ, హైదరాబాద్ ప్రజా ఉద్యమంలోనూ అతివాద ధోరణులు తలెత్తాయని మందుముల నరసింగరావు అభిప్రాయపడ్డారు. స్టేట్ కాంగ్రెస్‌లో స్వామీ రామానంద తీర్థ వంటి తీవ్రవాదులు తలెత్తడమే గాక, స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహోద్యమం నుంచి రావి నారాయణ రెడ్డి లాంటి వాళ్ళు కమ్యూనిస్టు రాజకీయాల వైపు వచ్చారు.

ఇక దేశవ్యాప్తంగానూ, తెలంగాణలోనూ కమ్యూనిస్టు రాజకీయాలమీద నిషేధాలకైతే లెక్కలేదు. మొట్టమొదటిసారిగా 1934 జులైలో బ్రిటిష్ ప్రభుత్వం భారత కమ్యూనిస్టు పార్టీని నిషేధించింది. అప్పటికే కమ్యూనిస్టు పార్టీ సభ్యుల మీద మీరట్ కుట్రకేసు రూపంలోను, ఇతర రూపాలలోను నిర్బంధాలు అమలవుతూనే ఉన్నాయి. నిజానికి కమ్యూనిస్టు పార్టీకి దేశవ్యాప్త శాఖలు ఏర్పాటయిందీ, సభ్యత్వం విపరీతంగా పెరిగిందీ నిషేధం తర్వాతనే. ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ (1934) గాని, తెలంగాణాలో కామ్రేడ్స్ అసోసియేషన్ (1939) గాని ఏర్పడింది నిషేధకాలంలోనే. భారత కమ్యూనిస్టు పార్టీ మీద నిషేధం అమలవుతుండిన కాలంలో పార్టీ సభ్యులు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో ప్రవేశించారు. తద్వారా భారత జాతీయ కాంగ్రెస్‌తో కూడ సన్నిహిత సంబంధాల్లో ఉన్నారు. 1937-39 మధ్య కాలంలో రాష్ట్రాల్లో కాంగ్రెస్ మంత్రి వర్గాలు ఎన్నికయినప్పుడు కమ్యూనిస్టు పార్టీ సెమీ-లీగల్‌గా పనిచేయగలిగింది. ఒకవైపు నిషేధంలో ఉంటూనే 1938 జనవరిలో తన సొంత వారపత్రికను ప్రారంభించ గలిగింది. 1940 మార్చ్‌లో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ తన సభ్యులలోని కమ్యూనిస్టులందరినీ బహిష్కరించింది. రెండో ప్రపంచ

యుద్ధకాలంలో యుద్ధం పట్ల కమ్యూనిస్టు పార్టీ వైఖరి మారిన సందర్భంగా ప్రభుత్వం కమ్యూనిస్టులందరినీ జైళ్ళ నుంచి విడుదల చేసింది. కమ్యూనిస్టు పార్టీ మీద నిషేధాన్ని ఎత్తివేసింది.

అయితే హైదరాబాద్ రాష్ట్రంలో మాత్రం నిజాం ప్రభుత్వం 1946 డిసెంబర్‌లో కమ్యూనిస్టు పార్టీని నిషేధించింది. మొదటి నుంచీ ఆంధ్ర మహాసభ కార్యకలాపాల మీద నిఘా వేసి ఉంచిన ప్రభుత్వం 1944లో ఆంధ్ర మహాసభ కమ్యూనిస్టు పార్టీకి పర్యాయ పదంగా మారిన తర్వాత నిర్బంధకాండను పెంచింది. దాదాపు ఆ సమయంలోనే తెలంగాణ గ్రామీణ ప్రాంతాలలో భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు ప్రారంభమయ్యాయి. భూస్వాముల గూండాలు, నిజాం పోలీసులు మూకుమ్మడిగా ప్రజల మీద దాడులు సాగిస్తూ వచ్చారు. ఈ దాడుల కొనసాగింపు గానే కడివెండిలో 1946 జులై 4న దొడ్డి కొమరయ్య హత్య జరిగింది. తెలంగాణ రైతాంగం సాయుధపోరాటానికి సిద్ధపడింది. ఈ రైతాంగ సాయుధపోరాటం మీద ప్రభుత్వం నవంబర్‌లో పెద్ద ఎత్తున దమనకాండ సాగించింది. ఈ దమనకాండలో భాగంగానే కమ్యూనిస్టు పార్టీపై నిషేధం కూడ అమలులోకి వచ్చింది. 1952 చివరి దాకా ఈ నిషేధం తొలగలేదంటే తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం ప్రధానంగా పార్టీ నిషిద్ధంగా ఉన్నప్పుడే నడిచింది. 1948 సెప్టెంబర్‌లో 'పోలీసు చర్య' జరిగి రాష్ట్రంలో కేంద్ర ప్రభుత్వ పాలన ఏర్పడినా పార్టీ మీద నిషేధం తొలగలేదు. నిజానికి ఆ సమయంలో మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్ర ప్రాంతంలో కూడ పార్టీ మీద కొత్తగా నిషేధం అమలులోకి వచ్చింది. టంగుటూరు ప్రకాశం ముఖ్యమంత్రిగా తీసుకొచ్చిన ప్రజా రక్షణ చట్టం కోస్తాంధ్ర జిల్లాల్లో దారుణ దమనకాండకు కారణమైంది. మలబార్ పోలీసులు కోస్తాంధ్ర ప్రజానీకం మీద విచ్చలవిడిగా దాడులు సాగించారు.

తెలంగాణా సాయుధ పోరాటాన్ని ఉపసంహరించుకోవాలనే ఆలోచన, చర్చలు ప్రారంభమైన తర్వాత నిషేధం రద్దు చేయాలనే డిమాండ్ కూడ ఒక ముఖ్యాంశమైంది. ఒకవైపు అంతరంగిక విభేదాల వల్ల, మరోవైపు ప్రభుత్వం అనుసరించిన రెండు నాల్కల వైఖరి వల్ల పార్టీ మీద నిషేధం తొలగిపోతుందానే పార్టీ పోరాటాన్ని ఉపసంహరించుకుంటానని, ఆయుధాలు స్వాధీనం చేస్తానని ప్రకటించింది. 1951 అక్టోబర్ 21న పోరాట ఉపసంహరణ జరిగినా, ఆయుధ విసర్జన ప్రారంభ

మైనా వెల్లోడి నాయకత్వంలోని ప్రభుత్వ, సైనిక బలగాలు పార్టీ మీద, ప్రజల మీద దమనకాండను మానలేదు. నిషేధం తొలగింపు, సాయుధ మిలటరీ బలగాల ఉప సంహరణ, గ్రామాల మీద దాడుల ఆపివేత 1952 జనవరికి కూడ అమలులోకి రాలేదు. 1952 జనవరిలో తెలంగాణలో జరిగిన మొదటి సార్వత్రిక ఎన్నికల్లో కమ్యూనిస్టు పార్టీ సభ్యులు, సానుభూతిపరులు ప్రోగ్రెసివ్ డెమొక్రటిక్ ఫ్రంట్ పేరుతో పోటీ చేశారు. ప్రొగ్రెసివ్ డెమొక్రటిక్ ఫ్రంట్ ఎన్నికల ప్రణాళికలో కూడ నిషేధం ఉపసంహరణ డిమాండ్ ఒక ప్రధానాంశమైంది. ఈ ఎన్నికల్లో పి డి ఎఫ్ అభ్యర్థులు ఘనవిజయం సాధించిన తర్వాత గాని, సుప్రీంకోర్టు ఈ నిషేధాన్ని కొట్టి వేసిన తర్వాత గాని పార్టీమీద నిషేధం తొలగలేదు.

1947 తర్వాత దేశవ్యాప్తంగా కూడ కేంద్రప్రభుత్వం అనేక సంస్థల మీద నిషేధాలు ప్రకటించింది. 1948లో గాంధీ హత్య తర్వాత రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్‌ను నిషేధించారు. 1950లో అమలులోకి వచ్చిన రాజ్యాంగంలో 19 (సి) అధికరణం ద్వారా సంస్థల్ని ఏర్పరచుకునే హక్కుకు హామీ దొరికింది గాని సంస్థల మీద నిషేధాల పరంపర మాత్రం కొనసాగింది. 1960 లలో నాగా, మిజో ఉద్య మాల్ని నిషేధించారు. 1975లో ఎమర్జెన్సీ విధించిన తర్వాత ఆర్ ఎస్ ఎస్, ఆనంద మార్గ్ వంటి మత సంస్థలతో పాటు విప్లవ సంస్థల్ని కూడ కలిపి 24 సంస్థల్ని నిషేధించారు. ఎమర్జెన్సీ ఎత్తివేసే వరకు ఈ నిషేధం అమలులో ఉండింది. 1980 దశాబ్దంలో నిషేధాలు మరీ పెచ్చుమీరిపోయాయి. ఒకవైపు దేశవ్యాప్తంగా జాతుల పోరాటాలు, ప్రత్యేక రాష్ట్రాల కోసం పోరాటాలు, రైతాంగ పోరాటాలు పెల్లుబుకు తున్న నేపథ్యంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఈ పోరాటాలను అణచడానికి నిషేధ చట్టాల్ని వాడుకున్నాయి. నిషేధ చట్టాల ఆయుధాగారంలోకి ప్రభుత్వం 1967 చట్ట వ్యతిరేక కార్యకలాపాల చట్టం అనే కొత్త ఆయుధాన్ని సమకూర్చుకుంది. ఈ చట్టం సాయంతోనే ఆల్ ఇండియా సిఖ్ స్టూడెంట్స్ ఫెడరేషన్, జమ్మూ కాశ్మీర్ లిబరేషన్ ఫ్రంట్, యునైటెడ్ లిబరేషన్ ఫ్రంట్ ఆఫ్ అస్సాం, గూర్ఖా నేషనల్ లిబరేషన్ ఫ్రంట్, మావోయిస్ట్ కమ్యూనిస్ట్ సెంటర్, మజ్దూర్ కిసాన్ సంఘర్ష్ సమితి, లిబరేషన్ టైగర్స్ ఆఫ్ తమిళ్ ఈలం వంటి అనేక సంస్థలను ఆ యా రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వం నిషేధించాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1908

క్రిమినల్ లా అమెండ్‌మెంట్ అక్ట్‌ను ఉపయోగించుకుని కోస్తా ఆంధ్ర, రాయలసీమ జిల్లాలలోను, 1348 ఫసలీ ప్రజారక్షణ చట్టాన్ని ఉపయోగించుకుని తెలంగాణ జిల్లాలలోను సిపిఐ (ఎంఎల్) పీపుల్స్‌వార్ పైన, ఎనిమిది ప్రజా సంస్థల పైన 1992 మే 21న నిషేధాన్ని ప్రకటించింది. ఈ రెండు చట్టాలకు ఎప్పుడో కాలం చెల్లిందని, సుప్రీంకోర్టు వీటిని కొట్టివేసిందని గుర్తించిన తర్వాత జూన్ 24న ప్రజారక్షణ ఆర్డినెన్స్ అనే మరో కొత్త నిషేధ చట్టాన్ని తయారుచేసి ఈ చట్టం సాయంతో కొత్తగా నిషేధాన్ని ప్రకటించింది.

నిషేధించే అధికారాలెన్ని వచ్చినా, నిషేధాలెన్ని అమలయినా, పాత నిషేధాజ్ఞలే కొత్త అవతారాలెత్తినా ఇరవయో శతాబ్దపు తొలిదశకానికీ, చివరి దశకానికీ మధ్య భారత చరిత్రలో ప్రజా ఉద్యమాల విస్తృతీ, ఉధృతీ తగ్గలేదు. విప్లవోజ్వల గాథల మీద చీకటి పరచుకోలేదు. శతాబ్ది ఉదయం నుంచీ అస్తమయం దాకా ఆగని పోరాట సాంప్రదాయం మీద, ఆరిపోని వెలుగు మీద చీకటి కప్పాలనే విఫల ప్రయత్నాలు ఈ నిషేధాజ్ఞలు.

ఆధారాలు :


* సుమిత్ సర్కార్ – మాడర్న్ ఇండియా 1885-1947, మాక్మిలన్, 1983.
* రజత్ కాంతరే – సోషల్ కాన్‌ఫ్లిక్ట్ అండ్ పొలిటికల్ అన్‌రెస్ట్ ఇన్ బెంగాల్ 1875-1927, ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ ప్రెస్, 1984.
* భూపేంద్రనాథ్ దత్త – భారతదేశ ద్వితీయ స్వాతంత్ర్య సంగ్రామం, మార్క్సిస్టు అధ్యయన వేదిక, 1991.
* స్వామి రామానంద తీర్థ – హైదరాబాద్ స్వాతంత్ర్య పోరాటం అనుభవాలు, ప్రభాత ప్రచురణ సమితి, 1984.
* మందుముల నరసింగరావు – 50 సంవత్సరముల హైదరాబాదు, మందుముల నరసింగరావు స్మారక సమితి, 1977.

# సెన్సార్‌షిప్ గురించి మార్క్స్

ప్రష్యన్ ప్రభుత్వం 1841 డిసెంబర్ 24 న కొత్త సెన్సార్‌షిప్ నిబంధనలను ప్రకటించింది. నిజానికి 1819 అక్టోబర్ 18న జారీ అయిన సెన్సార్‌షిప్ ఆదేశాలకు ఇవి కొనసాగింపు మాత్రమే. కాకపోతే కొత్త నిబంధనలు ఉదారవాద పదజాలంతో పాత నిబంధనలనే తీవ్రతరం చేశాయి. కొత్త నిబంధనలు 1842 జనవరి 14న పత్రికల్లో అచ్చయింతర్వాత జనవరి 15 నుంచి ఫిబ్రవరి 10 వరకు మార్క్స్ ఈ నిబంధనల మీద వ్యాఖ్య రాయడానికి పూనుకున్నాడు. ఆర్నాల్డ్ రూజ్ సంపాదకత్వంలో వెలువడుతుండిన డచ్ జార్‌బుషర్ పత్రిక కోసం మార్క్స్ ఈ వ్యాసం రాశాడు. కాని సెన్సార్‌షిప్ నిబంధనల వల్ల ఈ వ్యాసాన్ని ఆ పత్రికలో ప్రచురించే అవకాశం లేకపోయింది. 1843 లో స్విట్జర్లాండ్ నుంచి వెలువడిన అనెక్డోటా అనే సంకలనంలో ఈ వ్యాసం మొదటిసారి అచ్చయింది. విప్లవ పాత్రికేయుడిగా మార్క్స్ రాసిన తొలి వ్యాసం ఇదే. 1851 లో మొదటిసారిగా మార్క్స్ సంకలిత రచనలు అచ్చువేసే ప్రయత్నం జరిగినప్పుడు వెలువడిన మొదటి సంపుటంలో మొదటి రచనగా ఈ వ్యాసం ఉండాలని మార్క్స్ కోరాడు. ఈ వ్యాసపు మొట్టమొదటి ఇంగ్లీషు అనువాదం 1967 లో అచ్చయింది. మార్క్స్, ఎంగెల్స్‌ల సంపూర్ణ రచనల సంకలనం మొదటి సంపుటంలో అచ్చయిన పాఠం నుంచి అవసరమైన భాగాల్ని ఇక్కడ అనువదిస్తున్నాం.

'కానుకలు పట్టుకొస్తున్నప్పుడైనా సరే, గ్రీకులంటే నాకు భయం' అని వర్జిల్ రాసినట్టుగా, కొత్త ప్రష్యన్ సెన్సార్‌షిప్ ఆదేశాలు వెలువడీ వెలువడగానే ఆపోహ పడేంత దురభిప్రాయం మాకేమీ లేదు. అందుకు భిన్నంగా, ఇప్పటికే వెలువడిన చట్టాల్ని పరిశీలించడానికి కొత్త ఆదేశం అనుమతిస్తుంది గనుక, ఈ పరిశీలన ప్రభుత్వ అభిప్రాయాలతో అంగీకరించనిదైనప్పటికీ, మేం ఇక్కడ ఈ పరిశీలనకు పూనుకుంటున్నాం. సెన్సార్‌షిప్ అంటే అధికారిక విమర్శ. దాని ప్రమాణాలు విమర్శక ప్రమాణాలు. కనుక సెన్సార్‌షిప్ కూడ విమర్శ క్షేత్రంలోనే ఉన్నందువల్ల దాన్ని విమర్శకు అతీతంగా చూడడానికి వీలు లేదు.

ఆదేశానికి ఉపోద్ఘాతంలో వ్యక్తమైన సాధారణ ధోరణిని అంగీకరించకుండా ఎవరూ ఉండలేరు :

"సర్వోన్నతుడి ఉద్దేశ్యాలకు వ్యతిరేకంగా అమలవుతున్న అక్రమ నిబంధనల నుంచి పత్రికలకు స్వేచ్ఛ కల్పించవలసిన అవసరం ఇప్పటికే ఏర్పడిన దృష్ట్యా, ఈ నెల పదవ తేదీన మంత్రిత్వశాఖకు ఇచ్చిన ఒక అత్యున్నత ఆదేశం ప్రకారం రచయితల కార్యకలాపాలపైన అనుచితమైన ఆటంకాలన్నిటినీ రద్దు చేయనున్నామని ప్రకటించడానికి మహాఘనతవహించిన ప్రభువు సంతోషిస్తున్నారు. నిర్మొహమాట మైన, మర్యాదపూర్వకమైన ప్రచారపు విలువనూ, అవశ్యకతనూ గుర్తించి, 1819 అక్టోబర్ 18 నాటి సెన్సార్‌షిప్ ఆదేశపు రెండో అధికరణాన్ని సక్రమంగా పాటించ వలసిందిగా సెన్సార్ అధికారులను కొత్తగా ఆదేశించేందుకు మాకు అధికారమిచ్చారు" అని ఈ ఉపోద్ఘాతంలో రాశారు.

నిజమే! సెన్సార్‌షిప్ ఒక అవసరమే అయినట్టయితే, నిర్మొహమాటమైన ఉదార సెన్సార్‌షిప్ మరింత అవసరమవుతుంది.

వెంటనే ఆశ్చర్యం గొలిపేది ఇక్కడ ఉదహరించిన చట్టపు తేదీ. 1819 అక్టోబర్ 18 అనేది ఆ తేదీ. ఏమిటది? సమయ సందర్భాన్ని బట్టి బహుశా రద్దు చేసి ఉండవలసిన చట్టం కాదా అది? చూడగా దానికి కాలం చెల్లినట్టు లేదు. ఎందు కంటే దాన్ని పాటించమని సెన్సార్ అధికారులను కొత్తగా ఆదేశాలందుతున్నాయి. అంటే ఈ చట్టం 1842 దాకా అమలులో ఉండిందన్నమాట. కాని దాన్ని పాటించడం జరగలేదన్నమాట. ఎందుకంటే సర్వోన్నతుడి ఉద్దేశ్యాలకు వ్యతిరేకంగా అమలవు తున్న అక్రమ నిబంధనల నుంచి పత్రికలకు స్వేచ్ఛ కల్పించవలసిన అవసరం ఇప్పటికే ఏర్పడిందట.

అంటే, చట్టం ఉన్నప్పటికీ, పత్రికల మీద ఇప్పటి దాకా అక్రమ నిబంధ నలు అమలయినాయన్నమాట- ఈ ఉపోద్ఘాతం నుంచి తీయగలిగిన నిర్ధారణ ఇదే.

అయితే ఇదీ చట్టాన్ని వ్యతిరేకించే వాదనా, లేక సెన్సార్ అధికారులను వ్యతిరేకించే వాదనా?

రెండోది నిజమని అనుకోవడానికి అవకాశం లేదు. ఎందుకంటే ఇరవై రెండు సంవత్సరాలపాటు ఈ అధికారం చట్టవ్యతిరేకమైన కార్యకలాపాలు సాగి స్తున్నదన్నమాట. ఈ అధికారం పౌరుల అత్యున్నత ప్రయోజనాలకు, వాళ్ళ మనసు లకు అధిపతిగా ఉండింది. ఈ అధికారం రోమన్ సెన్సార్ అధికారం కంటె

బలవత్తరమైనది. వాళ్ళ కంటె ఎక్కువగా వయ్యక్తిక పౌరుల ప్రవర్తనను మాత్రమేగాక, ప్రజా బాహుళ్యపు మానసిక ప్రవర్తనను నియంత్రించే అధికారం కలిగి ఉండింది. రాజ్యపు అత్యున్నత సేవకుల నుంచి ఇంత నీతిరహితమైన ప్రవర్తనను, ఇంత పెద్ద ఎత్తున అవిధేయతను, సువ్యవస్థితమైన, తన అధికారుల గురించి గర్వంగా చెప్పుకునే ప్రష్యన్ రాజ్యంలో ఊహించవచ్చునా? లేక, రాజ్యమే, ఎల్లప్పుడూ మతి తప్పి ఉండి, అతి కష్టమైన పదవులకు అత్యంత అనర్హులను ఎంపిక చేసిందా? లేక, చిట్టచివరిగా, ప్రష్యన్ రాజ్యంలో పౌరుడికి చట్ట వ్యతిరేక చర్యల గురించి ఫిర్యాదు చేసే అవకాశమే లేదా? తమ అస్తిత్వం గురించి తెలియ జెప్పే చట్టాలేమిటో తెలియనంతటి అజ్ఞానులు గానూ, మూర్ఖులు గానూ ప్రష్యన్ రచయితలు ఉండిపోయారా? లేక ఆ చట్టాల్ని పాటించమని అడగలేనంతటి పిరికి వాళ్ళుగా ఉండిపోయారా?

మనం సెన్సార్ అధికారులదే తప్పని అంగీకరించామంటే, వాళ్ళ పరువు మాత్రమే కాదు, ప్రష్యన్ రాజ్యపు పరువూ, ప్రష్యన్ రచయితల పరువూ కూడ పోతుంది.

అంతేగాక, సెన్సార్ అధికారులు ఇరవై ఏళ్ళకు పైగా చట్ట వ్యతిరేకంగా ప్రవర్తించారని, శాసనాన్ని ధిక్కరించారని అంటే, అదే ఒక నమ్మదగిన రుజువు అవుతుంది. అటువంటి బాధ్యతా రహితులైన వ్యక్తుల కోసం అటువంటి సాధారణ ఆదేశాలు సరిపోవన్నమాట. పత్రికలకు ఇతర హామీలు అవసరమవుతాయన్నమాట. ఏ చట్టమూ పరిష్కరించలేని మౌలిక లోపమేదో సెన్సార్‌షిప్ స్వభావంలోనే ఉన్న దని చెప్పడానికి ఇదే రుజువు అవుతుంది.

అట్లాగాక, ఒకవేళ, సెన్సార్ అధికారులు శక్తిమంతులే అయి ఉండి, చట్టమే సరైనది కానట్టయితే, అది దారితీసిన చెడుగును తొలగించడానికి మళ్ళీ దాన్నే పాటించమనడం ఏం సబబు?

లేక, బహుశా, ఒక వ్యవస్థలోని వస్తుగత లోపాలను వ్యక్తులకు ఆపాదించ డం జరుగుతున్నదా? తద్వారా, ఏ ప్రధానమైన మెరుగుదలా జరపకుండానే పరి స్థితిని మెరుగు పరిచినట్టు బూటకపు అభిప్రాయం కల్పించే ప్రయత్నం జరుగు తున్నదా? కుహనా ఉదారవాదపు అలవాటేమిటంటే, రాయితీలు ఇవ్వవలసిన అవ

సరం వచ్చినప్పుడు, అది వ్యక్తులను, సాధనాలను బలిపెడుతుంది. అసలు విషయాన్ని, వ్యవస్థను మాత్రం యథాతథంగా ఉంచుతుంది. ఈ రకంగా పై పైన మాత్రమే చూసే ప్రజా ఆసక్తిని పక్కదారి పట్టించడం జరుగుతుంది.

ఒక విషయానికి వ్యతిరేకంగా ఉండే అసమ్మతి వ్యక్తుల పట్ల అసమ్మతిగా కూడ మారుతుంది. అందువల్ల మనుషులు మారగానే ఆ విషయమే మారిపోయిందనే అభిప్రాయం కలుగుతుంది. దృష్టి సెన్సార్‌షిప్ మీది నుంచి వ్యక్తిగతంగా సెన్సార్ అధికారుల మీదికి మళ్ళుతుంది. మార్పు కోరుతామనే క్షుద్ర రచయితలు ఆదేశాల ప్రకారం క్షుద్ర ధైర్యాన్ని తెచ్చుకుని ఏలినవారి ప్రాపకం కోల్పోయిన వాళ్ళకు వ్యతిరేకంగా రాస్తారు. ప్రభుత్వాన్ని కీర్తిస్తూ ఎన్ని పనులు చేయాలో అన్నీ చేస్తారు.

ఇంకా మరొక ఇబ్బంది కూడ ఉంది.

కొత్త సెన్సార్‌షిప్ ఆదేశాలను కొత్త సెన్సార్‌షిప్ చట్టంగానే భావించే పత్రికా రచయితలు కొందరున్నారు. వాళ్ళు పొరపాటు పడుతున్నారు. కాని ఆ పొరపాటు క్షమార్హమే 1819 అక్టోబర్ 18న వచ్చిన సెన్సార్‌షిప్ చట్టం తాత్కాలికంగా 1824 వరకు మాత్రమే ఉండవలసింది. ఇప్పుడు వచ్చిన ఆదేశాల ప్రకారం అది ఎప్పుడూ అమలులోకి రాలేదంటున్నారు గనుక ఇవాళ్టిదాకా ఆ చట్టం తాత్కాలిక చట్టంగానే ఉండేదని అనుకోవాలి.

నిజానికి 18,9 చట్టం ఒక మధ్యంతర చర్యగా కూడ ఉండింది. ఒకే ఒక్క తేడా ఏమంటే అక్కడ ఐదు సంవత్సరాల నిర్ణీత వ్యవధిని ప్రకటించడం జరిగింది. కాగా కొత్త ఆదేశంలో దానికి అపరిమిత వ్యవధి ఉంది. అట్లాగే పాత చట్టం సమయంలో వాటిని పత్రికా స్వాతంత్ర్యం మీద చట్టాలుగా చెప్పగా ఇప్పుడు అవి సెన్సార్‌షిప్ చట్టాలుగా ఉన్నాయి.

మరికొందరు పత్రికా రచయితలు కొత్త సెన్సార్‌షిప్ ఆదేశాలను పాత సెన్సార్‌షిప్ చట్టానికి మెరుగులు దిద్దడంగా చూస్తున్నారు. కాని ఆదేశాలే వాళ్ళ పొరపాటును తిరస్కరిస్తాయి.

కొత్త సెన్సార్‌షిప్ ఆదేశాన్ని మేం ఊహించదగిన సెన్సార్‌షిప్ చట్టపు రానున్న అంతస్సారంగా భావిస్తున్నాం. అట్లా భావించడంలో మేం 1819 సెన్సార్

షిప్ చట్టపు సారానికి కచ్చితంగా కట్టుబడి ఉంటున్నాం. దాని ప్రకారం పత్రికలకు సంబంధించినంతవరకు చట్టాలకు, ఆర్డినెన్సులకు సమాన ప్రాధాన్యతే ఉంటుంది.

ఇప్పుడు మళ్ళీ ఆదేశాలను చూద్దాం.

"ఈ చట్టం ప్రకారం", అంటే రెండో అధికరణం ప్రకారం, "గంభీరమైన, వినయ పూర్వకమైన సత్యాన్వేషణను సెన్సార్‌షిప్ అడ్డగించదు. రచయితల మీద అనుచితమైన నిరోధకాలు విధించదు. పుస్తకాల వ్యాపారం స్వతంత్రంగా నడవకుండా ఆటంకాలు కల్పించదు".

సెన్సార్‌షిప్ అడ్డగించడానికి వీలులేని సత్యాన్వేషణ ప్రధానంగా గంభీరమైనదిగానూ, వినయపూర్వకమైనది గానూ ఉండాలన్నమాట. కాని ఈ నిర్వచనాలు అన్వేషణా వస్తువుకు సంబంధించినవి కావు. వస్తువుకు బైట ఉండే మరేదానికో సంబంధించినవి. మొట్టమొదటి నుంచే వాళ్ళు అన్వేషణను సత్యం నుంచి పక్కకు లాగి, తెలియని మూడో విషయం వైపు దృష్టిని మళ్ళింపజూస్తున్నారు. ఒక మూడో అంశానికి చట్టం సాధికారత కల్పిస్తున్నది. ఆ చంచలమైన అంశం మీదనే అన్వేషణ ఎల్లవేళలా శ్రద్ధ వహించాలి. ఇక ఆ అన్వేషణ చూపు సత్యం మీది నుంచి తప్పిపోదా? సత్యాన్వేషి ప్రథమ కర్తవ్యం సత్యం మీదనే దృష్టి కేంద్రీకరించడం-కాదా? సత్యాన్వేషి మరెటువైపూ చూడకుండా ఉండొద్దా? నేను ఒక నిర్ణీత రూపంలో ప్రకటించడానికే కట్టుబడి ఉండాలంటే, అసలు విషయపు సారాన్ని మరిచిపోవడం జరగదా?

వెలుగుకు ఎంత తక్కువ వినయం ఉంటుందో సత్యానికీ అంతే వినయం ఉంటుంది. మరి సత్యం ఎవరి పట్ల వినయంగా ఉండాలి? తనకు తానే వినయంగా ఉండాలా? సత్యమే సత్యాసత్యాల గీటురాయి అన్నాడు స్పినోజా. అంటే సత్యం అసత్యం పట్ల వినయంగా ఉండాలా?

ఒకవేళ వినయం అనేది అన్వేషణకు స్వాభావిక లక్షణమైతే, అసత్యం కన్న సత్యమే ఎక్కువ భయం గొలుపుతుందనడానికి అది సూచనన్నమాట. అంటే నేను వేసే ప్రతి ముందడుగు దగ్గరా అదీ ఒక నిరుత్సాహ సాధనమన్నమాట. అంటే అది అన్వేషణ మీద ఎక్కడ ఫలితం సాధిస్తానో అనే భయాన్ని విధించడమన్నమాట. అంటే సత్యానికి వ్యతిరేకంగా కాపలా కాసే సాధనమన్నమాట.

ఇంకా చెప్పాలంటే, సత్యం సాధారణమైనది. అది నా ఒక్కడికే చెందినది కాదు. అది అందరికీ చెందినది. సత్యమే నన్ను స్వంతం చేసుకుంటుంది. నేను దాన్ని స్వంతం చేసుకోను. నా అస్తి రూపం మాత్రమే. అదే నా మానసిక వ్యక్తిత్వం. పద్ధతే మనిషిని పట్టి ఇస్తుందంటారు గదా. ఔను. నిజమే! చట్టం నన్ను రాయడానికి అనుమతిస్తుందట, కాని ఒకటే షరతు, నేను నాది కాని పద్ధతిలో రాయాలట! నేను నా మానసిక వ్యక్తీకరణను చూపొచ్చునట, కాని నేను మొదట దాన్ని నిర్ణీత పరిధు ల్లోనే కూర్చాలట! ఆత్మాభిమానం ఉన్న ఏ మనిషయినా ఈ సూచనలు చూసి సిగ్గు పడకుండా ఉంటాడా? వల్లెవాటులో ముఖం దాచుకోకుండా ఉంటాడా? వల్లెవాటులో తలదాచుకున్నప్పుడు కనీసం ఆ మనిషికి జూపిటర్ తల అయినా గుర్తుకొస్తుంది. నిర్ణీత పరిధి అంటే మాత్రం కాకిముక్కుకు దొండపండే.

ప్రకృతిలో ఎంత ఆనందదాయకమైన వైవిధ్యం ఉన్నదో, ఎంత అపరిమితమైన సంపద ఉన్నదో చూసి మీరు ఆరాధిస్తారు. మీరు గులాబీ వయొలెట్ లాంటి సువాసననే ఇవ్వాలని అడగరు. అన్నిటిలోకీ సంపన్నమైనదయిన ఆత్మ ఒకే ఒక్క రకంలో ఉనికిలో ఉండాలనీ కోరుకోరు. నాకు హాస్యం రాయాలని ఉంది. కాని చట్టం నన్ను గంభీరంగా మాత్రమే రాయాలని శాసిస్తుంది. నాకు ధైర్యం ఉంది. కాని చట్టం నన్ను వినయపూర్వకమైన శైలిలో రాయమని ఆదేశిస్తుంది. బూడిద రంగు, మొత్తం బూడిదరంగే, ఏకైక, సాధికారికమైన స్వేచ్ఛా వర్ణం. సూర్యకాంతి ప్రతిఫలించినప్పుడు ప్రతి ఒక్క మంచు బిందువూ అనంతమైన వర్ణ సమ్మేళనంగా మెరిసిపోతుంది. కాని మానసిక సూర్యుడు ఎంతమంది వ్యక్తులలో, ఏ యే రకాల వస్తువులలో ప్రతిఫలించినా, కేవలం అధికారిక వర్ణాన్నే సృష్టించాలి! మనసుకు అతి ప్రధానమైన రూపం ఆనందం, వెలుగు. కాని మీరు మనసుకు ఏకైక వ్యక్తీకరణ రూపం నీడ అంటారు. దాన్ని కేవలం నల్ల రంగులో కప్పేయాలంటారు. మరి పూలల్లో ఒక్కటికూడ నల్లని పువ్వు లేదు గదా. మనసు సారాంశం ఎల్లవేళలా సత్యం మాత్రమే. కాని మీరు దాని సారాంశం ఏమని చెపుతున్నారు? వినయం అట. నీచుడైన దౌర్భాగ్యుడు మాత్రమే వినయంగా ఉంటాడన్నాడు గెథె. మరి మీరు మనసును అటువంటి నీచ దౌర్భాగ్యంగా మార్చదలిచారా? లేదా షిల్లర్ అన్నట్టు వినయం అనేది మహామేధావి వినయం అయితే, మొట్టమొదట మీ పౌరులందరినీ, అందరికన్న మిన్నగా మీ సెన్సార్ అధికారులను మహామేధావులుగా మార్చండి.

కాని మహామేధావి వినయం విద్యావంతుల భాషలాగ, అంటే యాసనూ, మాండలి కాన్నీ కోల్పోయి ఉండదు. ఆ భాషలో విషయమే యాస, సారమే మాండలికం. దానిలో వినయం, అవినయం అనేవి మరిచిపోయి, అసలు విషయ సారాంశాన్ని గ్రహించడం ఉంటుంది. మనసుకు చెందిన విశ్వవ్యాప్త వినయం హేతువే. హేతువు అనే సార్వజనీన ఆలోచనా ఉదారత్వం ప్రతి విషయం పట్లా, ఆ విషయపు ప్రధాన స్వభావాన్ని బట్టి ప్రతిస్పందిస్తుంది.

ఇంకా ముందుకు వెళ్తే, గాంభీర్యం అనేదానికి ట్రిస్ట్రామ్ షాండీ ఇచ్చిన నిర్వచనం, అంటే, ఆత్మలోపాల్ని దాచుకోవడానికి శరీరం అనుసరించే కపట ప్రవర్తనే గాంభీర్యం అనే నిర్వచనం కాక సారాంశంలో గాంభీర్యం అనే అర్థం తీసుకున్నట్టయితే మొత్తం సూచనే కుప్పకూలిపోతుంది. ఎందుకంటే, హాస్యాస్పద మైన దాన్ని హాస్యాస్పదంగా చూసినప్పుడే గంభీరంగా చూసినట్టవుతుంది. అహం కారం ఎదుట వినయంగా ఉండడమంటే మనసు అతి గంభీరమైన అహంకారాన్ని ప్రదర్శించినట్టే.

గాంభీర్యం, వినయం ! ఎంత చంచలమైన, సాపేక్షమైన భావనలు! ఎక్కడ గాంభీర్యం అంతమై, హాస్యం ప్రారంభమవుతుంది ఎక్కడ వినయం అంతమై, అహంకారం ప్రారంభమవుతుంది ? మనమిక సెన్సార్ అధికారి స్వభావం మీద ఆధారపడి ఉండాలన్నమాట. రచయితకు శైలిని ఆదేశించడం ఎంత తప్పో, సెన్సార్ అధికారికి స్వభావాన్ని ఆదేశించడం అంత తప్పు. మీరు సౌందర్యాత్మక విమర్శలో క్రమం తప్పకుండా ఉండాలంటే సత్యాన్వేషణ మరీ గంభీరంగానూ, మరీ వినయంతోనూ కూడ ఉండగూడదని ఆదేశించండి. ఎందుకంటే, అతి గాంభీర్యం అనేది అన్నిటికంటె హాస్యాస్పదమైనది. అతి వినయం అనేది కఠినమైన వ్యంగ్యం.

చిట్టచివరిగా, నాందీ ప్రస్తావనే సత్యం గురించి పూర్తిగా వక్రమైన, పరమ మైన దృష్టితో మొదలయింది. రచయిత కార్యకలాపాల లక్ష్యాలన్నిటినీ 'సత్యం' అనే ఒకే ఒక్క సాధారణ భావన కింద గ్రహించారు. స్వీయ మానసిక కథనపు కోణాన్ని, అంటే ఒకే వస్తువు వివిధ వ్యక్తుల్లో వేరు వేరుగా ప్రతిఫలిస్తుందనీ, దాని వేరు వేరు అంశాలు మరిన్ని వేరు వేరు మానసిక పాత్రలుగా రూపొందుతాయనీ చెప్పే కోణాన్ని పక్కన పెట్టినప్పటికీ, వస్తుపు లక్షణానికి పరిశోధన మీద ఏ ప్రభావమూ, చిన్న

మెత్తు ప్రభావమైనా ఉండదని అనుకోవాలా ? సత్యంలో ఫలితం మాత్రమే కాదు, దానికి మార్గం కూడ కలిసే ఉంటుంది. సత్యాన్వేషణ దానికదిగా కూడ సత్యంగానే ఉండాలి. నిజమైన అన్వేషణ అంటే అభివృద్ధి చెందిన సత్యమే. వేరు వేరుగా ఉన్న దాని అంశాలను ఒకే దగ్గరికి తేవడమే ఫలితం. అట్లాగే, వస్తువును బట్టి అన్వేషణా పద్ధతి కూడ మారగూడదా ? వస్తువు హాస్యస్ఫోరకమైన విషయం కలిగి ఉంటే, దాని పద్ధతి గంభీరంగా ఉండాలట. వస్తువు అనంగీకారయోగ్యమైన దైతే, దాని పద్ధతి వినయంగా ఉండాలట. తద్వారా ఆ వస్తువు హక్కునూ, పరిశీల కుడి హక్కునూ కూడ మీరు ఉల్లంఘిస్తున్నారు. సత్యాన్ని నిరపేక్షమైనదిగా గ్రహించి, మనసును ఒక పరిశోధక న్యాయమూర్తిగా, సత్యానికి నిస్సారమైన జాబితా రాసేవాడిగా చూస్తున్నారు.

లేక, ఇటువంటి అధిభౌతిక చర్చ అవసరమే లేదా ? సత్యం అంటే ప్రభుత్వం ఆదేశించినదే అని సులభంగా అర్థం చేసుకుంటే సరిపోతుందా? తద్వారా, అన్వేషణ అనేది అనవసరమైన, ప్రయోజనం లేని అంశమనీ, కాని మర్యాద కోసం దాన్ని పూర్తిగా నిరాకరించడానికి వీలు లేదనీ అనుకోవలసిందేనా ? దాదాపు ఇదే నిజమనిపిస్తుంది. ఎందుకంటే, అన్వేషణ అంటే ముందుగానే సత్యానికి విరుద్ధమైన దిగా అర్థమవుతోంది. అది గాంభీర్యంతోను, వినయంతోను అనుమానపు అధికారిక సాహచర్యంతో కనబడుతోంది. ఇదంతా పూజారులతో మామూలు మనుషుల సంబంధం లాగుంది. ప్రభుత్వ అవగాహన ఒక్కటే రాజ్యపు హేతువు. కొన్ని సందర్భాలలో, భిన్నమైన అవగాహనకు, భిన్నమైన భాషకు రాయితీలు ఇవ్వవలసి వచ్చేమాట నిజమే. కాని ఈ అవగాహన రాయితీ గురించి, తనకు హక్కు లేక పోవడం గురించి, పూర్తి స్పృహతోనే రంగం మీదికి వస్తుంది. వినయంగా, లొంగి పోయి, గంభీరంగా, విసుగెత్తించేదిగా ఉంటుంది. 'మిమ్మల్ని విసుగెత్తించేది తప్ప మిగిలినవన్నీ మంచివే' అని వోల్టేర్ అన్నాడు గాని, ప్రస్తుత సందర్భంలో విసు గెత్తించే రకం ఒక్కటే మిగులుతోంది. ఇది ఇప్పటికే "రైన్ రాష్ట్రీ శాసన సభ కార్యక్రమాల" ప్రస్తావనలో తగినంతగా రుజువైంది. మరి పాత జర్మన్ శైలి ఎందుకు ఉండగూడదు ? మీరు స్వేచ్ఛగా రాసుకోవచ్చు, కాని అదే సమయంలో ప్రతి ఒక్కమాటా ఉదార సెన్సార్ షిప్ పట్ల మర్యాదపూర్వకంగా ఉండాలి. అది మీ గంభీర, వినయపూర్వకమైన అభిప్రాయాలు వ్యక్తం చేసేందుకు అనుమతిస్తుంది. నిజంగా మీ భక్తిప్రపత్తుల్ని మాత్రం వదలగూడదు !

చట్టబద్ధ ప్రాధాన్యత అంతా సత్యం మీద కాదు, గాంభీర్యం మీదా, వినయం మీద మాత్రమే. కనుక ఇక్కడ ప్రతి ఒక్కటీ అనుమానానికి తావిస్తుంది: గాంభీర్యం, వినయం, అన్నిటి కన్న ఎక్కువ సత్యం అనుమానానికి తావిస్తాయి. సత్యానికి అనంత పరిధి ఉన్నది గనుక ఆ పరిధిలో ఒక చాల కచ్చితమైన, చాల అనుమానాస్పదమైన రకపు సత్యం కూడ దాగి ఉన్నదనిపిస్తుంది.

ఆదేశంలో ఇంకా ఏం చెప్పారంటే "ఎట్టి పరిస్థితిలోనూ సెన్సార్‌షిప్‌ను ఈ చట్టాన్ని అధిగమించి సంకుచిత వ్యాఖ్యానంతో అమలు చేయగూడదు".

ఈ మాటలో వాడిన ఈ చట్టాన్ని అనే పదం 1819 చట్టంలోని రెండో అధికరణానికి సంబంధించినది. కాని తర్వాత ఆదేశం సెన్సార్‌షిప్ ఉత్తర్వు మొత్తాన్ని పరిగణించి దాని 'సారం' గురించి ప్రస్తావిస్తుంది. రెండు నిబంధనలను సులభంగా కలగలిపారు. రెండో అధికరణం సెన్సార్‌షిప్ ఉత్తర్వుకు సంఘటిత సారం. ఇంకా సాగిన పునర్విభజన, ఇంకా వివరమైన ప్రత్యేకతలు ఇతర అధికరణాలతో కనబడతాయి. ఈ సారం ఏమిటనేదానికి ఈ కింద ఇచ్చిన వ్యక్తీకరణ కన్న సరైన నిర్వచనం మరొకటి ఉండదనే మేం భావిస్తున్నాం :

అధికరణం VII. "అకాడమీ అఫ్ సైన్సెస్‌కు, విశ్వ విద్యాలయాలకూ ఇంత కాలం అనుమతించబడిన సెన్సార్‌షిప్ రహిత స్వేచ్ఛ ఇక నుంచి ఐదు సంవత్సరాల పాటు తొలగించబడుతుంది".

సెక్షన్ 10. "ప్రస్తుత తాత్కాలిక నిర్ణయం ఇవాళ్టి నుంచి ఐదు సంవత్సరాల వరకు అమలులో ఉంటుంది. ఈ వ్యవధి ముగిసే లోపు బుండెస్టాగ్‌లో వివరమైన పరిశీలన సాగుతుంది. ఈ పరిశీలనలో, బుండెసాక్టెలో 18 వ అధికరణంలో ప్రతిపాదించిన పత్రికా స్వాతంత్ర్యానికి సంబంధించినటువంటి నిబంధనలను ఏ విధంగా అమలులోకి తేవచ్చునో చూసి, జర్మనీలో పత్రికా స్వాతంత్ర్యంపై సాధికారికమైన అంశాల విషయంలో కచ్చితమైన నిర్ణయం తీసుకోవడం జరుగుతుంది".

ఇంతవరకూ ఉనికిలో ఉన్న పత్రికా స్వాతంత్ర్యాన్ని రద్దు చేసే చట్టం, పత్రికా స్వాతంత్ర్యాన్ని ఉనికిలోకి తేవలసిన చోట సెన్సార్‌షిప్ అమలు చేసి దాన్ని అనవసరం చేసే చట్టం పత్రికలకు అనుకూలమైనదని చెప్పడానికి ఎంత మాత్రం వీలు లేదు. అంతేగాక, సెక్షన్ 10 ప్రత్యక్షంగానే ఒప్పుకున్న ప్రకారం,

బుండెసాక్టె 18వ అధికరణంలో ప్రతిపాదించినట్టు పత్రికా స్వాతంత్ర్యానికి బదులుగా తాత్కాలికంగా సెన్సార్‌షిప్ చట్టాన్ని ప్రవేశ పెట్టబోతున్నారు. దాన్ని కొంతకాలం తర్వాత అమలులోకి తెస్తారు. ఇట్లా ఒకదాని బదులుగా మరొకదాన్ని గందరగోళం చెయ్యడాన్ని బట్టి ఆ కాలపు పరిస్థితులు పత్రికల మీద ఆంక్షలకు వీలుగా ఉన్నాయని విశదమవుతుంది. అంటే ఈ ఉత్తర్వులు పత్రికల పట్ల అపనమ్మకం నుంచి పుట్టుకొచ్చాయని తెలుస్తుంది. తాత్కాలికమనే మాటతో కలిపి తెచ్చారు గనుక, ఐదు సంవత్సరాలే ఉంటుందన్నారు గనుక ఈ కోపాన్ని క్షమించవచ్చును- కాని దురదృష్టవశాత్తూ అది 22 సంవత్సరాల పాటు ఉండిపోయింది.

ఆదేశంలో మరుసటి వాక్యమే అది ఎట్లా వైరుధ్యంలో చిక్కుకుపోయిందో చూపుతుంది. ఒకవైపు నుంచి, చట్టాన్ని అధిగమించే వ్యాఖ్యానంలో సెన్సార్‌షిప్‌ను అమలు చేయగూడదని అంటూనే, అదే సమయంలో అది అటువంటి అధిగమనాన్ని సూచిస్తుంది :

"ఆంతరంగిక వ్యవహారాల విషయంలో కూడ నిర్మొహమాటమైన చర్చను సెన్సార్ అధికారి ఆమోదించవచ్చును".

సెన్సార్ అధికారి ఆమోదించవచ్చును అట, ఆమోదించాలి అని కాదు. అది తప్పనిసరేమీ కాదు. ఈ జాగ్రత్తపూరితమైన ఉదారవాదం కూడ కచ్చితంగా ఉత్తర్వు సారాన్ని అధిగమించి మాత్రమే కాదు, సెన్సార్‌షిప్ ఉత్తర్వులోని స్పష్టమైన సూచనలను అధిగమించి ఉంది. పాత సెన్సార్‌షిప్ ఉత్తర్వు, స్పష్టంగా చెప్పాలంటే ఆ దేశంలో ఉదహరించిన రెండో అధికరణం, ప్రష్యన్ వ్యవహారాల నిర్మొహమాటపు చర్చను అనుమతించక పోవడం మాత్రమే కాదు, చివరికి చైనా వ్యవహారాల చర్చను కూడ అనుమతించదు.

ప్రష్యన్ రాజ్యపు భద్రతకు, జర్మన్ సమాఖ్య రాజ్యాల భద్రతకు ప్రమాదాలుగా చూడబడే వాటిలో "ఏ దేశంలోనైనా ఆ రాజ్య వ్యవస్థను కూలదోయడానికి ప్రయత్నించే పక్షాలను అనుకూల వైఖరితో చిత్రించే ప్రయత్నాలన్నీ" కూడ ఉంటాయని ఆదేశం వ్యాఖ్యానించింది.

చైనా జాతీయ వ్యవహారాలనో, టర్కీ జాతీయ వ్యవహారాలనో నిర్మొహమాటంగా చర్చించడాన్ని అనుమతించే పద్ధతి ఇదేనా ? ఇంత సుదూర సంబంధాలు

కూడ జర్మన్ సమాఖ్య సున్నితమైన భద్రతకు ప్రమాదకరమైనవయినప్పుడు, ఆంతరంగిక వ్యవహారాల పట్ల ప్రతికూలత మాత్రం ప్రమాదకరం కాదా ?

ఈ రకంగా, ఒక వంక, ఈ ఆదేశం సెన్సార్‌షిప్ ఉత్తర్వులోని రెండో అధికరణపు సారాంశాన్ని అధిగమిస్తుంది. ఉదారవాదపు దిశలో పయనిస్తుంది. ఇది ఒక అతి. దీని అసలు వస్తువేమిటో తర్వాత స్పష్టమవుతుంది. కాని ఇది రెండో అధికరణపు కొనసాగింపునని చెప్పుకున్నంతవరకూ రూపపరంగా అనుమానాస్పదంగానే ఉంటుంది. ఆ రెండో అధికరణం నుంచి కూడ మొదటి సగాన్ని మాత్రమే ఉటంకించడం జరిగింది. అదే సమయంలో అధికరణం మొత్తాన్ని సంప్రదించవలసిందిగా సెన్సార్ అధికారికి సూచించడం జరిగింది. మరో వంక, ఈ ఆదేశం సెన్సార్‌షిప్ ఉత్తర్వును అధిగమించి ఉదారవాదవ్యతిరేక దిశలో పయనించి, పాత పత్రికా ఆంక్షలకు తోడుగా కొత్త ఆంక్షలను ప్రకటిస్తుంది.

పైన ఉటంకించిన సెన్సార్‌షిప్ ఉత్తర్వు రెండో అధికరణం ఏమని ప్రకటిస్తుందంటే :

"(సెన్సార్‌షిప్) లక్ష్యం మత సాధారణ సూత్రాలకు వ్యతిరేకమైన వాటన్నిటినీ నియంత్రించడం. రాజ్యంలో అనుమతించబడిన వ్యక్తిగత మత పక్షాలకూ తెగలకూ ఉన్న అభిప్రాయాలతో, సిద్ధాంతాలతో ఈ సాధారణ సూత్రాలకు నిమిత్తం లేదు".

1819 లో అప్పటికింకా హేతువాదం చలామణీలో ఉండేది. సాధారణంగా మతం అంటే హేతువుతో కూడిన మతం అనే అర్థం ఉండేది. హేతువాద దృక్పథమే సెన్సార్‌షిప్ ఉత్తర్వు దృక్పథంగా ఉండేది. అయితే ఈ దృక్పథం ఎంత అసంబద్ధంగా ఉండేదంటే, దాని లక్ష్యమేమో మతాన్ని పరిరక్షించడం కాగా, అది మతరహిత దృక్పథాన్ని అవలంబించేది. ఎందుకంటే మతపు అసలైన వస్తువు నుంచీ, ప్రత్యేక లక్షణాల నుంచీ మతపు సాధారణ సూత్రాలను విడదీయడమనేది ఆ సాధారణ సూత్రాలకు విరుద్ధమైనది. ఎందుకంటే ప్రతి మతమూ తనను తాను ఇతర మతాలనుంచి తన ప్రత్యేక స్వభావంవల్ల వేరయినదిగా పరిగణించుకుంటుంది. కచ్చితంగా తన ప్రత్యేక లక్షణాలే తనను నిజమైన మతంగా తయారు చేస్తున్నాయనుకుంటుంది. రెండో అధికరణాన్ని ఉటంకించేటప్పుడు కొత్త సెన్సార్‌షిప్ ఆదేశం మినహాయింపునిచ్చే అదనపు

నిబంధనను తొలగించింది. అంటే వ్యక్తిగత మతపక్షాలు, తెగలు అనుల్లంఘ నీయతనుంచి మినహాయించబడడాన్ని తొలగించింది. ఆ ఆదేశం ఇంతటితో మాత్రమే ఆగిపోలేదు. ఈ క్రింది వ్యాఖ్యను కూడ చేసింది.

"మొత్తంగా క్రైస్తవ మతానికి వ్యతిరేకంగాను, ప్రత్యేకంగా ఏదైనా ఒక ప్రత్యేక విశ్వాసానికి వ్యతిరేకంగాను ఉద్దేశించిన చిల్లర రాతలను, శత్రుపూరిత రాతలను ఎంత మాత్రం సహించడానికి వీలులేదు".

పాత సెన్సార్‌షిప్ ఉత్తర్వు అసలు క్రైస్తవ మతాన్ని ప్రస్తావించనే ప్రస్తావించదు. అందుకు భిన్నంగా అది మతానికీ, అన్ని వ్యక్తిగత మత పక్షాలకూ, తెగలకూ మధ్య భేదాన్ని చూస్తుంది. కొత్త సెన్సార్‌షిప్ ఆదేశం సాధారణ మతాన్ని క్రైస్తవ మతంగా మార్చడం మాత్రమే కాదు, మరొక ప్రత్యేక విశ్వాసాన్ని కూడ చేర్చింది. ఇది మన క్రైస్తవీకరించిన శాస్త్రం కనిపెట్టిన సంతోషదాయక వస్తువు! ఇది పత్రికల మీద కొత్త సంకెళ్ళు వేస్తున్నదనే దాన్ని కాదనే వాళ్ళెవరు? ఆదేశం ఏమంటున్నదంటే, మతాన్ని మొత్తంగా గాని, నిర్దిష్టంగా గాని విమర్శించగూడదట. లేక చిల్లర, శత్రుపూరిత అనే మాటలు వాడడం ద్వారా ఆ ఆదేశం కొత్త సంకెళ్ళను గులాబీ మాలలుగా మార్చిందని మీరేమైనా అనుకుంటున్నారా? ఎంత నేర్పుగా రాశారా మాటలు: చిల్లర, శత్రుపూరిత! చిల్లర అనే విశేషణం వాడడం ద్వారా పౌరుడి మర్యాద స్పృహను రేకెత్తించదలిచారు. అదీ మొత్తంగా ప్రపంచానికే సంబంధించిన మామూలు మాట. మరి శత్రుపూరిత అనే విశేషణాన్ని సెన్సార్ అధికారి చెవిలో రహస్యంగా ఊదుతున్నారు. చిల్లరతనానికి చట్ట పరిభాషలో శత్రుపూరితం అని అర్థం అన్నమాట. ఈ ఆదేశంలో ఇటువంటి నేర్పుకు చాల ఉదాహరణలున్నాయి. అంటే దానిలో ఒక మాట ప్రజలకేమో స్వీయమానసిక అర్థాన్ని స్ఫురింపజేస్తుంది. వాళ్ళకు సిగ్గు కలిగిస్తుంది. కాని అదే సమయంలో సెన్సార్ అధికారికి మాత్రం వస్తుగత అర్థాన్ని స్ఫురింపజేస్తుంది. తద్వారా రచయిత భయంతో పాలిపోయేట్టు చేస్తుంది. ఈ రకంగా రాజాజ్ఞ భయభీతావహాన్ని సృష్టిస్తుంది.

ఇక ఎటువంటి బ్రహ్మాండమైన వైరుధ్యంలో తనను తాను చిక్కుపడేసుకుంది కొత్త సెన్సార్‌షిప్ ఆదేశం! అర్థమనస్కతతో చేసే విమర్శే చిల్లర విమర్శ. అది ఒక దృగ్గోచరాంశంలో విడివిడి కోణాలకే పరిమితమవుతుంది. విషయపు సారాంశాన్ని పట్టుకోగలిగినంత లోతుగాను, వ్యగ్రతతోను ఉండదు. అంటే ఒక

ప్రత్యేక లక్షణం మీద మాత్రమే చేసే విమర్శనే కచ్చితంగా చిల్లర విమర్శ అనవచ్చు. కనుక, మరి క్రైస్తవ మతం మీద మొత్తంగా విమర్శ చేయడం నిషేధం అంటే, దాని మీద చిల్లర విమర్శ చేయడానికి అనుమతి ఉన్నదనే గదా. మరో వైపు నుంచి చూస్తే, మతపు సాధారణ సూత్రాల మీద విమర్శ, దాని సారాంశం మీద విమర్శ, ఒక ప్రత్యేక లక్షణం దాని సారాంశపు వ్యక్తీకరణ అయినప్పుడు ఆ ప్రత్యేక లక్షణం మీద చేసే విమర్శ శత్రుపూరిత విమర్శ అవుతుంది. అంటే మతాన్ని శత్రుపూరిత పద్ధతిలోనో, చిల్లర పద్ధతిలోనో మాత్రమే విమర్శించే వీలుంది. మరి మూడో మార్గం లేదు. అయితే కొత్త ఆదేశం చిక్కుకున్న ఈ అసంబద్ధత పైకి కనిపించేది మాత్రమే. ఎందుకంటే మొత్తం మీద మతం మీద ఏదో ఒక రకమైన విమర్శకు అనుమతి ఉన్నదనే ఆభాస మీద అది ఆధారపడింది. కాని సరిగ్గా పరిశీలిస్తే తెలిసే విషయమేమంటే ఈ ఆభాస కేవలం ఆభాస మాత్రమే. మతాన్ని విమర్శించనే గూడదు. శత్రుపూరితంగానైనా, చిల్లర పద్ధతిలోనైనా, సాధారణంగానైనా, నిర్దిష్టంగానైనా అంటే అసలు మొత్తంగానే విమర్శ చేయడానికే వీలులేదు.

మరి కొత్త ఆదేశం, 1819 సెన్సార్‌షిప్ ఉత్తర్వును బహిరంగంగా వ్యతిరేకిస్తూ తాత్విక పత్రికల మీద కొత్త సంకెళ్ళు విధించినప్పుడు, తగినంత సంబద్ధంగా ఉండదలచుకుంటే పాత హేతువాద ఉత్తర్వు మత పత్రికల మీద విధించిన పాత సంకెళ్ళను తొలగించవలసి ఉండింది. ఎందుకంటే పాత ఉత్తర్వు ప్రకారం సెన్సార్‌షిప్ లక్ష్యం "మత విశ్వాసాలను రాజకీయాలలోకి బదిలీ చేసే ఉన్మత్తతను, తత్ఫలితంగా ఏర్పడే భావాల గందరగోళాన్ని వ్యతిరేకించడం".

కొత్త ఆదేశం ఎంత తెలివయినదంటే, రెండో అధికరణాన్ని ఉటంకించి ఆమోదించినప్పటికీ, తన వ్యాఖ్యానంలో ఈ పై నిబంధనను మాత్రం ప్రస్తావించ లేదు. మత విశ్వాసాలను రాజకీయాలలోకి ఉన్మత్తంగా బదిలీ చేయడమంటే అర్థమేమిటి ? దాని అర్థమేమంటే, మత విశ్వాసాలను, వాటి నిర్దిష్ట స్వభావం వల్ల, రాజ్యపు నిర్ణాయక అంశాలుగా మార్చడం. దాని అర్థమేమంటే, మతపు ప్రత్యేక స్వభావాన్ని రాజ్యపు కొలమానంగా మార్చడం. పాత సెన్సార్‌షిప్ ఉత్తర్వు ఈ భావాల గందరగోళాన్ని సరిగానే వ్యతిరేకించింది. ఎందుకంటే అది ఒక ప్రత్యేక మతాన్ని, దాని నిర్దిష్ట సారాంశాన్ని విమర్శకు లక్ష్యంగా ఉంచింది. అయితే పాత

ఉత్తర్వు నిస్సారమైన, పై పై హేతువాదం మీద ఆధారపడింది. ఆ హేతువాదాన్ని మీరు కూడ అసహ్యించుకున్నారు. కాని, మీరు, రాజ్యాన్ని అన్ని వివరాలతో విశ్వాసం మీద, క్రైస్తవం మీద ఆధారపడేటట్టు చేయాలకునేవాళ్ళు, క్రైస్తవ రాజ్యం ఉండాలనుకునేవాళ్ళు, మీరెట్లా ఈ భావాల గందరగోళాన్ని అడ్డుకునే సెన్సార్ షిప్‌ను సిఫార్సు చేయగలరు ?

రాజకీయాన్నీ, క్రైస్తవ మత సూత్రాన్నీ గందరగోళం చేయడమే అధికారిక సిద్ధాంతంగా మారినట్టుంది. ఈ గందరగోళాన్ని మేం క్లుప్తంగా వివరించదలచుకున్నాం. గుర్తించబడిన మతం క్రైస్తవం ఒక్కటే అనుకుంటే, మీ రాజ్యంలో కాథలిక్కులా, ప్రొటెస్టెంట్‌లా ఉంటారు. ఇరుపక్షాలకూ రాజ్యం పట్ల సమాన బాధ్యతలుంటాయి గనుక, ఇరుపక్షాలూ రాజ్యం నుంచి సమాన హక్కులు కోరుకుంటాయి. ఇరుపక్షాలూ తమ మత భేదాలను పరిగణనలోకి తీసుకోకుండా, రాజ్యం అనేది రాజకీయ, న్యాయ హేతువు మూర్తీభవించేట్టు ఉండాలని సమానంగా కోరుతారు. కాని మీరేమో క్రైస్తవ రాజ్యం కోరుకుంటున్నారు. మీ రాజ్యం లూథరన్ క్రైస్తవ రాజ్యం అయితే, కాథలిక్‌కు అది తనకు చెందని చర్చ్ అవుతుంది. ఆ చర్చ్ తాను నాస్తికమని నిరాకరించ వలసిందవుతుంది. దాని అంతర్గత సారం తనకు వ్యతిరేకమైనదవుతుంది. అవతలి వైపు కూడ అంతే. అయితే, ఒక వేళ క్రైస్తవ సాధారణ స్ఫూర్తినే మీ రాజ్యపు నిర్దిష్ట స్ఫూర్తిగా గ్రహించదలచినట్టయితే, క్రైస్తవపు సాధారణ స్ఫూర్తి ఏమిటనేదాన్ని మీ ప్రొటెస్టెంట్ అభిప్రాయాల పునాది మీదనే నిర్ణయిస్తున్నారన్న మాట. మత విషయాలకూ లౌకిక విషయాలకూ మధ్య, రాజ్యానికీ చర్చ్‌కూ మధ్య భేదం చూడడంలో కొందరు ప్రభుత్వాధికారులు విఫలమవుతున్నారనే విషయాన్ని ఈ మధ్యకాలం మీకు నేర్పినప్పటికీ, మీరింకా క్రైస్తవ రాజ్యం అంటే ఏమిటో నిర్వచిస్తున్నారు. ఈ భావాల గందరగోళం విషయంలో నిర్ణయించడం కాదు, చర్చించవలసి ఉంది. అది కూడ సెన్సార్ అధికారులు కాదు, దౌత్యవేత్తలు. చివరిగా, ఒక నిర్దిష్టమైన మతవిశ్వాసాన్ని అప్రధానమైనదిగా నిరాకరిస్తున్నారంటే మీరు నాస్తిక దృక్పథాన్ని అవలంబిస్తున్నారన్నమాట. మీరు మీ రాజ్యాన్ని సాధారణ క్రైస్తవ రాజ్యంగా పిలుస్తున్నారంటే, దౌత్యపరమైన మాటల గారడీతో మీ రాజ్యం క్రైస్తవేతరమయినదని అంగీకరిస్తున్నారన్నమాట. కనుక, అయితే రాజకీయాలలోకి మతాన్ని ప్రవేశ పెట్టడాన్ని

పూర్తిగా రద్దు చేయనైనా చేయండి. కాని మీరది ఇష్టపడరు. మీరు రాజ్యాన్ని స్వేచ్ఛా హేతువు మీద నిర్మించదలచలేదు, విశ్వాసం మీద నిర్మించదలిచారు. మీకు మతమంటే కొనసాగుతున్న స్థితికి సాధారణ అనుమతి. కాకపోతే, రాజకీయాలలోకి మతాన్ని ఉన్మత్తంగానైనా ప్రవేశించనివ్వండి. మతాన్ని దాని పద్ధతిలో రాజకీయాలతో సంబంధం పెట్టుకోనివ్వండి. కాని మీరు ఆ పనీ చేయరు. లౌకిక అధికారాన్ని మతం సమర్థించాలంటారు. లౌకిక అధికారం మాత్రం మతానికి లోబడనక్కర లేదంటారు. ఒకసారి మతాన్ని రాజకీయాల్లో ప్రవేశపెట్టిన తర్వాత, రాజకీయ వ్యవహారాల్లో మతం ఎట్లా లౌకికంగా వ్యవహరించాలో నిర్ణయించడమంటే అది సహించడానికి వీలులేని, ఆ మాటకొస్తే, మత వ్యతిరేకమైన, అహంకారమవుతుంది. మత ఉద్వేగాలను బట్టి మతంతో కలిసి ఉండదలచుకున్న ఏ వ్యక్తి అయినా అన్ని విషయాలలోను మతానికే నిర్ణయాధికారం ఇవ్వవలసి ఉంటుంది. లేదా, మతమంటే మీ అపరిమిత అధికారానికీ, ప్రభుత్వ విజ్ఞతకూ వంతపాడే సిద్ధాంతమని మీరు అనుకుంటున్నారా ఏం?

పాత సెన్సార్‌షిప్ ఉత్తర్వు హేతువాదంతో కొత్త సెన్సార్‌షిప్ ఆదేశాల ఛాందససారం ఘర్షణపడే పద్ధతి మరొకటి కూడ ఉంది. పాత ఉత్తర్వులో సెన్సార్‌షిప్ లక్ష్యాలలో "నీతికీ, మర్యాదకరమైన ప్రవర్తనకూ వ్యతిరేకమైన వాటిని" అణచివేయడం కూడ చెప్పుకున్నారు. కొత్త ఆదేశాలు పాత ఉత్తర్వులోని రెండో అధికరణం నుంచి ఈ భాగాన్ని కూడ ఉటంకించాయి. కాని కొత్త ఆదేశాలు వ్యాఖ్యానంలో, మతం విషయంలో చేర్పులు చేసినట్టుగానే, నీతి విషయంలో తొలగింపులున్నాయి. 'నీతికీ, మర్యాదకరమైన ప్రవర్తనకూ వ్యతిరేకమైన వాటిని' స్థానంలో "ఔచిత్యం, ప్రవర్తన, బాహ్య మర్యాదల" ఉల్లంఘన అనేది వచ్చి చేరింది. తన నియమాలను తాను పాటించే ప్రపంచపు సూత్రమైన నీతి దాని కదిగా అదృశ్యమైపోయి, ఆ సారాంశం స్థానంలో బాహ్య వ్యక్తీకరణలు కనబడడం చూస్తాం. అవి పోలీసు గౌరవనీయత, సాంప్రదాయిక మర్యాద. ఎవరికి గౌరవం చూపాలో వారికే గౌరవం అన్నమాట. ఇక్కడ అసలైన సంబద్ధత ఉంది. నిర్దిష్టంగా క్రైస్తవ శాసనకర్త అయినవాడు నీతిని దానికదే పవిత్రమైన స్వతంత్ర రంగంగా ఎంచడు. ఎందుకంటే నీతి సాధారణ సారాంశం మతానికి చెందుతుందని అతడు వాదిస్తాడు. స్వతంత్ర నీతి అనేది మత సాధారణ సూత్రాలను భంగపరుస్తుంది. మతపు

ప్రత్యేక భావనలు నీతితో ఘర్షణ పడుతుంటాయి. నీతి కేవలం తన సొంత విశ్వ వ్యాప్త, హేతుబద్ధ మతాన్ని మాత్రమే గుర్తిస్తుంది. మతం కేవలం తన ప్రత్యేక అనుకూల నీతిని మాత్రమే గుర్తిస్తుంది. కనుక, ఈ కొత్త ఆదేశాల ప్రకారం సెన్సార్‌షిప్ నైతిక మేధో నాయకులైన కాంట్, ఫిక్టె, స్పినోజావంటి వాళ్ళను మత వ్యతిరేకులుగా, ఔచిత్యాన్ని, ప్రవర్తనను, బాహ్య మర్యాదను భంగపరిచిన వాళ్ళుగా నిరాకరించవలసి ఉంటుంది. ఈ నీతికర్తలందరూ కూడ నీతికీ, మతానికీ మధ్య సూత్రరీత్యా వైరుధ్యం ఉన్నదనే దగ్గర ప్రారంభమవ్వారు. ఎందుకంటే నీతి మానవ మనో స్వతంత్ర ప్రతిపత్తి మీద ఆధారపడింది. మతం మానవ అస్వతంత్రత మీద ఆధారపడింది. సెన్సార్‌షిప్ ఈ అవాంఛనీయ అన్వేషణలన్నీ చేసిందన్న మాట. ఒక వైపు నుంచేమో అది దాని నైతిక అంతరాత్మను బలహీనం చేసుకుంది. మరోవైపు నుంచేమో అది దాని మత అంతరాత్మను కఠినంగా బలోపేతం చేసుకుంది. సరే ఇక ఈ అన్వేషణల నుంచి మన దృష్టిని సెన్సార్‌షిప్ తెచ్చిన ఆహ్వానించదగిన రాయితీల వైపు మళ్ళిద్దాం.

"రాజ్య పరిపాలనను మొత్తంగా గాని, దాని విడివిడి శాఖలను గాని అంచనా కట్టే రచనలను; అమలులో ఉన్న చట్టాలను గాని, ప్రవేశపెట్టనున్న చట్టాలను గాని వాటి అంతర్గత విలువల దృష్ట్యా పరీక్షించి, పొరపాట్లు, తప్పుడు అవగాహనలను బైటపెట్టి, మెరుగులను సూచించడమో, ధ్వనించడమో చేసే రచనలను అవి ప్రభుత్వ అభిప్రాయాలతో ఏకీభవించని దృష్టి నుంచి రాయబడినందువల్ల నిరాకరించ గూడదు. వాటి రూపం మర్యాదకరంగా ఉన్నంతవరకు, వాటి ధోరణి సదుద్దేశ్య పూరితంగా ఉన్నంత వరకు వాటిని నిరాకరించగూడదు".

వినయం, గాంభీర్యంతో కూడిన అన్వేషణ- కొత్త ఆదేశం, పాత సెన్సార్ షిప్ ఉత్తర్వు రెండూ కూడ వీటిని కోరుతాయి. కాని వినయాన్ని మర్యాదకరమైన రూపంలో చెప్పడమంటే వస్తువుకు సత్యమెంత అవసరమో అంతే. దానికి ధోరణి అనేదే ప్రధాన ప్రమాణం. నిజంగా చెప్పాలంటే ధోరణే దాని నిండా ఉండే ఆలోచన. కాగా ఉత్తర్వులో కనీసం ధోరణి అనే మాట కూడ కనబడదు. అట్లాగే కొత్త ఆదేశం కూడ ధోరణి అంటే ఏమిటో వివరించదు. కాని ఈ ఆదేశానికి ధోరణి అనేదెంత ముఖ్యమో కింది ఉటంకింపు నుంచి చూడవచ్చు :

"ప్రభుత్వ చర్యలకు వ్యతిరేకంగా వ్యక్తమయ్యే నిరసనల ధోరణి దురుద్దేశ్య పూరితంగా గాని, గాయపరిచేదిగా గాని ఉండగూడదనేది అనివార్యమైన షరతుగా ఉంటుంది. అది సదుద్దేశ్యపూరితంగా ఉండాలి. ఒక సందర్భం నుంచి మరొక సందర్భాన్ని ఎట్లా వేరుచేసి చూడాలో తెలియాలంటే సెన్సార్ అధికారికి సహృదయత, అంతర్దృష్టి ఉండాలి. దీన్ని దృష్టిలో ఉంచుకుని, సెన్సార్ అధికారులు పత్రికా రచనల రూపం పట్ల, పద్ధతి పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించాలి. ఒక వేళ ఆ రచనల ధోరణి ఉద్వేగం వల్లనో, మొండితనం వల్లనో, అహంకారం వల్లనో ప్రమాదకరంగా ఉన్నట్టయితే వాటి ప్రచురణకు అనుమతించగూడదు".

కనుక, రచయిత అతి భయంకరమైన హింసావాదానికి ఎర అయిపోయాడన్నమాట. అనుమానపు పరిధిలోకి లాగబడ్డాడన్నమాట. ధోరణికి వ్యతిరేకమైన చట్టాలు, వస్తుగత ప్రమాణాల్ని ప్రకటించని చట్టాలు, హింసావాద చట్టాలు అవుతాయి. రాబ్స్పియర్ నాయకత్వంలోని రాజ్యపు అత్యవసర పరిస్థితుల్లోను, రోమన్ చక్రవర్తుల కింద అవనీతికరమైన రాజ్యంలోను ఇటువంటి చట్టాలు కనిపెట్టబడ్డాయి. ఏ చట్టాలైనా వాటి ప్రధాన ప్రమాణంగా పనులను గాక, పనిచేసిన వ్యక్తి మానసిక చక్రాన్ని ఎంచుకుంటే, ఆ చట్టాలు చట్ట రాహిత్యానికి అసలైన అనుమతులవుతాయి. రష్యన్ చక్రవర్తి పీటర్ ది గ్రేట్ తన సేవకులందరి గడ్డాలను కోసక్కులతే కత్తిరింపించాడట. అది నయం. నేను గడ్డం పెంచుకోవడం ఒకానొక మానసిక స్థితి ఫలితమైనందువల్ల గడ్డం కత్తిరించాలనే ప్రమాణం పెట్టలేదు!

నన్ను నేను బాహ్యంగా వ్యక్తీకరించుకున్నంతవరకే, వాస్తవ రంగంలో ప్రవేశిస్తాను. అంటే శాసనకర్త రంగంలోకి ప్రవేశిస్తాను. నా చర్యలకు బైట, చట్టం దృష్టిలో నాకు అస్తిత్వమే లేదు. నేను దాని లక్ష్యాన్ని కాను. చట్టానికి నా మీద పట్టు ఉండే ఏకైక అంశం నా చర్యలు మాత్రమే. ఎందుకంటే ఆ ఒక్క అంశం ద్వారా మాత్రమే నేను నా అస్తిత్వ హక్కును కోరుతాను. వాస్తవికతా హక్కును కోరుతాను. అందువల్లనే నేను వాస్తవ చట్టపు పరిధిలోకి ప్రవేశిస్తాను. అయితే, ధోరణిని శిక్షించే చట్టం, నన్ను నేను చేసిన పనికి శిక్షించడం మాత్రమే కాక, నా పనులకు బైట, నేను ఏం ఆలోచిస్తానో అందుకు శిక్షిస్తుంది. అందువల్ల అటువంటి చట్టం పౌరుడి ఆత్మగౌరవానికి అవమానకరం. అది నా అస్తిత్వానికి ప్రమాదకరమైన భయంకరమైన చట్టం.

నేను నా ఇష్టప్రకారం ప్రవర్తించగల అవకాశం ఉంది. అది వాస్తవాలకు సంబంధించిన సమస్య కాదు. నా మనుగడే అనుమానాస్పదంగా ఉంది. నా అంతరాంతరాల సారం, నా వ్యక్తిత్వం చెడ్డదిగా పరిగణించబడుతున్నది. నా పట్ల ఈ అభిప్రాయం ఉన్నందువల్ల నేను శిక్షించబడుతున్నాను. చట్టం నన్ను నేను పాల్పడిన ఏ తప్పుకూ శిక్షించడం లేదు. నేను చేయని తప్పుకు శిక్షిస్తోంది. నేను నిజంగా శిక్షించబడుతున్నది నా చర్య చట్టానికి వ్యతిరేకమయినందువల్ల కాదు. నా చెడు మానసిక చిత్రం బహిరంగ పడనంత తెలివి గలదయి, దాన్ని గ్రహించడానికి ఉదారుడూ, సహృదయుడూ అయిన న్యాయమూర్తికి అవకాశం కల్పిస్తేనే నేను శిక్షించబడతాను.

మానసిక చట్టానికి వ్యతిరేకమయిన చట్టం నిజానికి ఒక రాజ్యం తన పౌరుల కోసం చేసే చట్టం కాజాలదు. అది ఒక పక్షం మరో పక్షానికి వ్యతిరేకంగా చేసే చట్టం మాత్రమే అవుతుంది. ధోరణిని శిక్షించే చట్టం, తన ఎదుట పౌరుల సమానత్వాన్ని రద్దు చేస్తుంది. ఆ చట్టం ఏకం చేసేదికాదు, విభజించేది. విభజించే చట్టాలన్నీ అభివృద్ధి నిరోధకమైనవే. అది అప్పుడు చట్టం కాదు, ప్రత్యేక హక్కు అవుతుంది. ఒకరు మరొకరు చేయలేని పని చేయవచ్చు. ఆ మరొకరికి భౌతిక సమర్థత లోపించడమే కారణం కానక్కర లేదు. ఉదాహరణకు చిన్నపిల్లలు ఒప్పందాల మీద సంతకం చేయడానికి వీలులేదు. కాని, ఆ మరొకరి సదుద్దేశ్యాలు, మానసిక చిత్రం అనుమానాస్పదమైనవైతే చాలు. నైతికరాజ్యం తన పౌరులందరూ రాజ్యపు మానసిక చిత్రాన్నే కలిగి ఉండాలని కోరుకుంటుంది. ఆ పౌరులు రాజ్యపు ఒక భాగానికి, ప్రభుత్వానికి వ్యతిరేకంగా పని చేసినా సరే. కాని ఏ సమాజంలోనైతే ఒక రాజ్యపు భాగమే తానే సమస్తం అనుకుంటుందో, రాజ్యహేతువుకూ, రాజ్య నీతికీ తానే హక్కుదారుననుకుంటుందో, ఏ ప్రభుత్వమైతే సూత్రరీత్యా ప్రజల్ని వ్యతిరేకిస్తుందో, తన రాజ్య-వ్యతిరేక మానసిక చిత్రమే సాధారణమైన, సక్రమమైన మానసిక చిత్రమని అనుకుంటుందో ఆ సమాజంలో, ఆ ప్రభుత్వంలో ఒక ముఠాకు చెందిన తప్పుడు అవగాహనే ధోరణికి వ్యతిరేకమైన చట్టాలను సృష్టిస్తుంది. అవి ప్రతీకార చట్టాలు. ప్రభుత్వ సభ్యుల మనసులలోనే పీఠం వేసుకుని కూచున్న చిత్రానికి వ్యతిరేకమైన చట్టాలు. మానసిక చిత్రానికి వ్యతిరేకమైన చట్టాలు ఏ సూత్రంలేని మానసిక చిత్రంపైన, రాజ్యం పట్ల అవినీతికరమైన,

క్షుద్రమైన దృక్పథం పైన ఆధారపడతాయి. అవి ఒక తప్పుడు అవగాహన అని వార్యంగా వేసే కేకగా ఉంటాయి. ఇటువంటి చట్టాన్ని ఎట్లా అమలు చేయవలసి ఉంటుంది? చట్టం కన్న అసహ్యకరమైన పద్ధతులలో మాత్రమే. అంటే గూఢ చారుల ద్వారా. లేదా, ముందే అనుకున్నట్టు అన్ని సాహిత్య ధోరణులనూ అను మానాస్పదమైనవిగా గుర్తించడం ద్వారా. అంటే, ఒక వ్యక్తి ఏ ధోరణికి చెందు తాడో ఆ ధోరణిపైన విచారణ జరపడం ద్వారా. ధోరణికి వ్యతిరేకమైన చట్టంలో వస్తువులో చట్టపరమైన రూపం వైరుధ్యంలో ఉన్నట్టుగానే, ఒక చట్టాన్ని చేసిన ప్రభుత్వం ఆ చట్టాన్ని తన మీదనే, అంటే రాజ్య వ్యతిరేక మానసిక చట్రం మీదనే, ప్రయోగించుకున్నట్టుగానే, ప్రతి ఒక్క సందర్భంలోనూ తన చట్టాలకు తానే వ్యతిరేక ప్రపంచమైనట్టు కనబడుతుంది. ఎందుకంటే అది ద్వంద్వ ప్రమాణాలను అనుసరిస్తుంది. ఒక పక్షానికి ఏది ఒప్పో, అవతలి పక్షానికి అది తప్పవుతుంది. ప్రభుత్వం జారీ చేసిన చట్టాలే ఆ చట్టాలకు వ్యతిరేకంగా మారిపోతాయి.

కొత్త సెన్సార్‌షిప్ ఆదేశం కూడ ఈ ద్వంద్వంలో చిక్కుబడిపోతుంది. పత్రికల విషయంలో ఏ యే పనులనయితే రాజ్య వ్యతిరేకమయినవని చట్టం ఖండి స్తుందో, ఆ పనులన్నిటినీ ఆ చట్టమే చేస్తుంది. ఆ పనులు చేయడం సెన్సార్ అధి కారుల కర్తవ్యమని నిర్దేశిస్తుంది. చట్టంలో ఈ వైరుధ్యం ఉంది.

వ్యక్తులకు చెందిన, లేదా మొత్తం వర్గాలకు చెందిన మానసిక స్థితి పట్ల అనుమానం కలిగి ఉండగూడదని చట్టం రచయితలను నిర్దేశిస్తుంది. అదే సమయంలో అదే చట్టం పౌరులందర్నీ అనుమానాస్పదులుగా, అనుమానాస్పదులు కానివాళ్ళుగా, సహృదయులుగా, దుర్మార్గులుగా విడదీయమని సెన్సార్ అధికారిని ఆదేశిస్తుంది. పత్రికలకు విమర్శించే హక్కు నిరాకరించబడుతుంది. కాని ప్రభుత్వ విమర్శకుడికి మాత్రం విమర్శ అనేది దైనందిన కర్తవ్యం అవుతుంది. అయితే ఈ తారుమారు తోనే విషయం పూర్తయిపోలేదు. పత్రికలలో కూడ వస్తువును బట్టి రాజ్య వ్యతిరేక మయినవి ప్రత్యేకమైనవిగా కనబడతాయి. కాని వాటి రూపాన్ని బట్టి అవి సార్వ త్రికమైన వనిపిస్తాయి. అంటే అవి సార్వత్రిక ప్రశంసకు పాత్రమవుతాయి.

అయితే, ఇప్పుడు మొత్తం వ్యవహారం తలకిందులయిపోయింది. ప్రత్యేక మైనది దాని వస్తువు రీత్యా సమర్థనీయమైనదిగా కనబడుతుంది. రాజ్య వ్యతిరేక మైనది రాజ్యపు దృక్పథంగా, రాజ్య శాసనంగా కనబడుతుంది. మరి రూపం రీత్యా

చూసినప్పుడు, రాజ్య వ్యతిరేకమైనది ప్రత్యేకమైనదిగా కనబడుతుంది. అది వెలుగు చూడడానికి వీలు లేనిదయిపోతుంది. దాన్ని ప్రచారకాంతి నుంచి వెనక్కు నెట్టి ప్రభుత్వ విమర్శకుడి కవిలెకట్టల్లో బంధించవలసి వస్తుంది. ఈ రకంగా కొత్త ఆదేశం మతాన్ని పరిరక్షించదలచింది గాని, వ్యక్తి స్వీయ మానసిక స్థితి అనుల్లంఘనీయమైనదనీ, పవిత్రమైనదనీ చెప్పే అన్ని మతాల అతి సాధారణ సూత్రాన్ని ఈ చట్టం ధిక్కరిస్తోంది. హృదయ న్యాయమూర్తి స్థానం నుంచి అది దేవుణ్ని తొలగించి సెన్సార్ అధికారిని నియమిస్తోంది. ఈ రకంగా అది వ్యక్తుల మీద దాడిచేసే మాటలనూ, నిందాపూర్వకమైన తీర్పులనూ నిషేధిస్తోంది. కాని ప్రతి రోజూ మీ మీద దాడిచేసే, నిందాపూర్వకమైన తీర్పు నిచ్చే అధికారాన్ని సెన్సార్ అధికారికి ఇస్తోంది. దురుద్దేశ్యపూరితులూ, అల్పజ్ఞానులూ అయిన వ్యక్తుల కాకమ్మ కబుర్లను అణచివేయడం తన ఉద్దేశ్యమని కొత్త ఆదేశం చెపుతోంది. కాని సెన్సార్ అధికారి మాత్రం అటువంటి కాకమ్మ కబుర్ల మీద ఆధారపడవచ్చునట. దురుద్దేశ్య పూరితులూ, అల్పజ్ఞానులూ చేసే గూఢచారం మీద ఆధారపడవచ్చునట. తద్వారా అది తీర్పులను వస్తుగత సారం రంగం నుంచి స్వీయ మానసిక అభిప్రాయ రంగంలోకి, నిరంకుశ చర్యల రంగంలోకి దిగజారుస్తోంది. అంటే, రాజ్యపు ఉద్దేశ్యం మీద అనుమాన పడగూడదు. కాని, కొత్త ఆదేశం రాజ్యం దృష్టి నుంచి ప్రారంభించడమే అనుమానంతో ప్రారంభిస్తుంది. అంటే ఏ చెడు మానసిక స్థితినీ మంచి రూపం కింద దాచి ఉంచగూడదు. కాని, కొత్త ఆదేశం తప్పుడు రూపం మీదనే ఆధారపడి ఉంది. అంటే ఆదేశం జాతీయ భావనలను ఉద్దీప్తం చేస్తానంటున్నది. కాని, జాతిని అవమానపరిచే దృక్పథం మీద అది ఆధారపడింది. చట్టబద్ధమైన ప్రవర్తనను, చట్టం పట్ల గౌరవాన్ని మననుంచి ఆకాంక్షిస్తున్నారు. కాని అదే సమయంలో, మనను చట్టానికి బైటపెట్టే, చట్టం స్థానంలో నిరంకుశత్వాన్ని ప్రవేశపెట్టే నిర్మాణాలను మనం గౌరవించాలంటున్నారు. సెన్సార్‌షిప్ వ్యవస్థలో లోపాలున్నప్పటికీ, సెన్సార్ అధికారి మీద నమ్మకం ఉంచాలనేంతగా వ్యక్తిత్వ సూత్రాన్ని గుర్తించాలని మమ్మల్ని కోరుతున్నారు. కాని మీరేమో వ్యక్తిత్వ సూత్రాన్ని ఎంతగా అగౌరవపరుస్తున్నారంటే, ఒక వ్యక్తిత్వం పైన అది చేసిన చర్యల ఆధారంగా మీరు తీర్పు ఇవ్వడం లేదు. తన చర్యల గురించిన అభిప్రాయం పైన అభిప్రాయం ఆధారంగా తీర్పు ఇస్తున్నారు. మీరు మా నుంచేమో వినయం కోరుతున్నారు. కాని మీ నాంధీ

ప్రస్తావనే భయంకరమైన అహంకారం. ఆ అహంకారం విడివిడి రాజ్య ఉద్యోగులను ప్రజా హృదయాల మీద నిఘా వేసే పనికి నియమిస్తున్నది. ఆ గూఢచారులు సర్వజ్ఞులని, తత్వవేత్తలని, మత తాత్వికులని, రాజనీతి కోవిదులని, సర్వశక్తిమంతులని అనుకుంటున్నది. ఒక వైపు నుంచేమో మీరు అహంకారాన్ని గౌరవించడం మా కర్తవ్యం అంటారు. మరోవైపునుంచేమో అహంకారాన్ని నిషేధిస్తారు. నిజమైన అహంకారం ఎక్కడుంటుందంటే, జాతి మొత్తం సాధించిన పరిపూర్ణతను ప్రత్యేక వ్యక్తులకు ఆపాదించడంలో ఉంటుంది. సెన్సార్ అధికారి ఒక ప్రత్యేక వ్యక్తి. మరి పత్రికారంగమంటే మొత్తం జాతి మూర్తీభవించిన రూపం. మీరు మమ్మల్నేమో నమ్మకం ఉంచమని ఆదేశిస్తారు. కాని అపనమ్మకానికి చట్టపు శక్తి నందజేస్తారు. మీరు మీ రాజ్య సంస్థల్లో ఎంత నమ్మకముంచుతారంటే అవి ఒక బలహీన మానవుణ్ని, ఒక అధికారిని మహాత్ముడిగా మారుస్తాయని, అతనికి అసాధ్యాలన్నిటినీ సాధ్యాలుగా మార్చేస్తాయని మీరు అనుకుంటారు. కాని మీరు మీ రాజ్యం సమస్తాన్ని ఎంత అపనమ్మకంతో చూస్తారంటే ఒక ప్రైవేటు వ్యక్తి విడిగా వ్యక్తం చేసే అభిప్రాయం చూసి భయపడతారు. ఎందుకంటే మీరు పత్రికారంగాన్ని ఒక ప్రైవేటు వ్యక్తిగా పరిగణిస్తారు. అధికారులు నిర్లిప్తంగా, ద్వేషం లేకుండా, అనురాగం లేకుండా, సంకుచితత్వం లేకుండా, మానవ బలహీనతలేవీ లేకుండా ప్రవర్తిస్తారని, మీరు అనుకుంటారు. కాని నిర్లిప్తమైనవనబడే భావాల నిండా వ్యక్తిగత కుట్ర, స్వీయమానసిక దుర్మార్గం ఉంటాయని మీరు అనుమానిస్తారు. అధికార యంత్రాంగం పట్ల అపరిమిత విశ్వాసాన్ని కలిగి ఉండాలని కొత్త ఆదేశం కోరుతోంది. అనధికారుల రంగం పట్ల మాత్రం అపరిమిత అవిశ్వాసంతో అది ప్రారంభమైంది. మేం కుక్కకాటుకు చెప్పుదెబ్బ అని ఎందుకనగూడదు? కచ్చితంగా ఈ అధికార యంత్రాంగం పట్ల అవిశ్వాసాన్ని మేం ఎందుకు ప్రదర్శించగూడదు? స్వభావం విషయంలో కూడ ఇదే వర్తిస్తుంది. రహస్యంగా పనిచేసే విమర్శకుడి స్వభావం పట్ల కంటె బహిరంగంగా పనిచేసే విమర్శకుడి స్వభావం పట్ల ఎక్కువ గౌరవాన్ని చూపడం నిష్పక్షపాతమైన వ్యక్తి చేసే పని.

మొత్తం మీద చెడ్డది ఎట్లాగైనా చెడ్డగానే ఉంటుంది. ఆ చెడు ఏ వ్యక్తిలో ఉన్నాసరే. ఆ వ్యక్తి ప్రైవేటు విమర్శకుడైనా సరే, ప్రభుత్వం నియమించిన వాడయినా సరే. కాని ప్రభుత్వం నియమించిన విమర్శకుడు చెడ్డవాడయిన సందర్భంలో

ఆ చెడుగుకు అధికారిక అనుమతి ఉంటుంది. కింది నుంచి మంచితనాన్ని సాధించడానికి పైనుంచి చెడుగు అవసరమని అనిపిస్తుంది.

ధోరణి పట్ల సెన్సార్‌షిప్, సెన్సార్‌షిప్ ధోరణి రెండూ కొత్త ఉదారవాద ఆదేశాలిచ్చిన కానుకలు. ఆదేశంలోని తర్వాతి నిబంధనలను మేం కొంత అపోహతోనే పరిశీలిస్తే మమ్మల్ని ఎవరూ తప్పు పట్టరనుకుంటాను.

"వ్యక్తుల మీద దాడిచేసే విమర్శలు, నిందాపూర్వకమైన తీర్పులు ప్రచురణార్హమైనవి కావు".

ప్రచురణార్హమైనవి కావట! ఈ మృదుత్వానికి బదులు, దాడి చేసే అంటే ఏమిటో, నిందాపూర్వకమైన తీర్పులంటే ఏమిటో వస్తుగత నిర్వచనం ఇచ్చి ఉంటే ఎంత బాగుండును!

"వ్యక్తుల లేదా మొత్తం వర్గాల మానసిక స్థితి పట్ల అనుమానం వ్యక్తం చేయడానికి, పార్టీల పేర్లు వాడడానికి, అటువంటి వ్యక్తిగత దూషణలకు కూడ ఇదే వర్తిస్తుంది".

అంటే, తరగతుల కింద విభజించడం, మొత్తం వర్గాల మీద దాడి చేయడం, పార్టీ పేర్లు వాడడం అన్నికూడ ఆమోదయోగ్యం కానివే. మరి ఆదాం లాగ ప్రతి మనిషీ, తాను ఏ వస్తువుతోనైనా వ్యవహరించాలంటే ఆ వస్తువుకు ఓ పేరు ఇవ్వవలసి వస్తుంది. రాజకీయ పత్రికలకు పార్టీల పేర్లనేవి అత్యవసరమైన సంగతులు....

ఇదంతా వ్యక్తిగత దూషణేనంటారు. మరి ఇక మొదలు పెట్టడమెట్లా? ఒక వ్యక్తిని విమర్శించడానికి వీలులేదు. వర్గాన్ని గాని, సాధారణ, చట్టపరమైన వ్యక్తిని గాని విమర్శించడానికి వీలులేదు. ఒక హక్కుగా రాజ్యం అవమానాలను, వ్యక్తిగత విమర్శలను సహించదు. కాని ఒక సాదా పదం 'లేదా' ద్వారా సాధారణత్వాన్ని, వ్యక్తిత్వాన్ని కలగలిపారు. లేదా అనే మాట ద్వారా సాధారణత్వం వచ్చి చేరింది. చివరికి చేర్చిన మాట ద్వారా మొత్తం వ్యవహారం వ్యక్తిగత విమర్శలకు మాత్రమే సంబంధించినదని అర్థమవుతోంది. కాని ఒక పూర్తిస్థాయి మామూలు పరిణామంగా పత్రికలను అధికారుల మీద అదుపునుంచీ, వ్యక్తుల సమూహాలుగా ఉనికిలో ఉండే సంస్థల మీద అదుపునుంచీ నిషేధించదలిచారన్న మాట.

"1819 అక్టోబర్ 18 నాటి సెన్సార్‌షిప్ చట్టం అవగాహనను అనుసరించి ఈ ఆదేశాల ప్రకారం సెన్సార్‌షిప్‌ను గనుక అమలు చేస్తే మర్యాదకరమైన, యథార్థమైన ప్రచారానికి తగినంత అవకాశం దొరుకుతుంది. తద్వారా పితృభూమి ప్రయోజనాల పట్ల ఇతోధిక సానుభూతి లభిస్తుందనీ, అందువల్ల జాతీయ భావన సంపన్నమవుతుందనీ ఆశించవచ్చు".

మర్యాదకరమైన అనే మాటను సెన్సార్‌షిప్ ఎట్లా అర్థం చేసుకున్నప్పటికీ, ఈ ఆదేశాల ప్రకారం మర్యాదకరమైన ప్రచారానికి కావలసినదానికంటే ఎక్కువ క్షేత్రం ఏర్పడుతుందని అంగీకరించడానికి మాకు అభ్యంతరం లేదు. ఇక్కడ క్షేత్రం అనే మాటను ఇష్టపూర్తిగా వాడుతున్నాను. ఎందుకంటే గాలిలో పక్షీలు కొట్టి సంతృప్తిపడే పత్రికా రంగం కోసం ఈ క్షేత్ర పరిధి నిర్ణయమయింది. ఈ క్షేత్రం యథార్థ ప్రచారానికి సరిపోతుందో లేదో, దాని యథార్థత ఎక్కడుంటుందో అనే ప్రశ్నలు పాఠకుల సూక్ష్మదృష్టికే వదులుతున్నాం. ఇక ఆదేశాలు ఆశించిన లక్ష్యాలు చూస్తే, వింటినారి సారించినందువల్ల టర్కిష్ జాతీయతా భావన ఎంతగా వికసిస్తుందో, ఈ ఆదేశాల వల్ల కూడ అంతగా జాతీయ భావన వికసించవచ్చు. కాని వినయంతోనూ, గంభీరం గానూ ఉన్న పత్రికారంగం పితృభూమి ప్రయోజనాల పట్ల సానుభూతిని రేకెత్తిస్తుందో లేదో దానికదే తేల్చుకోనివ్వండి. బక్కపల్చని పత్రికారంగానికి క్వినైన్ ఇచ్చి లావుపాటిగా మార్చలేం. అయితే బహుశా మేం పైన ఉటంకించిన భాగాన్ని ఎక్కువ తీవ్రంగా పట్టించుకుంటున్నామేమో. బహుశా, దాన్ని గులాబీల మాలలో ఒక ముల్లుగా పరిగణించగలిగితే సరిగ్గా అర్థం చేసుకుంటామేమో. బహుశా ఈ ఉదారవాద ముల్లు చాల నిగూఢమైన విలువ గల ముత్యంగా తేలుతుందేమో. చూద్దాం. అంతా కూడ నేపథ్యం మీద ఆధారపడి ఉంటుంది. పైన ఉటంకించిన భాగంలో ఆశించిన జాతీయభావనా వికాసం, పితృభూమి ప్రయోజనాల పట్ల సానుభూతి రేకెత్తడం రహస్యంగా ఒక ఉత్తర్వుగా మారిపోయాయి. అది మన పేదల మీద మరొక కొత్త ఆంక్ష విధిస్తుంది. కృశించిపోతున్న దినపత్రికల మీద ఆంక్షలు విధిస్తుంది.

ఈ రకంగా రాజకీయ సాహిత్యం, దినపత్రికా రంగం రెండూ కూడ తమ విధిని సరిగా గుర్తిస్తాయని ఆశించవచ్చు. ఇంకా సంపన్నమైన వస్తువును గ్రహించడం ద్వారా అవి ఇంకా గౌరవనీయమైన పద్ధతిని అలవరచుకోవచ్చు. విదేశీ

వార్తాపత్రికల నుంచి తీసుకున్న నిరాధార సమాచారం ఆధారం గానో, దురుద్దేశ్య పూరితులూ, అజ్ఞానులూ అయిన విలేకరుల నుంచి అందిన వార్తలతోనో, కాకమ్మ కబుర్లతోనో, వ్యక్తిగత దూషణలతోనో రచనలను తయారుచేసి తమ పాఠకుల ఆసక్తిని తీర్చాలనే పద్ధతిని భవిష్యత్తులో పత్రికలు అసహ్యించుకోవచ్చు. ఇటువంటి ధోరణికి వ్యతిరేకంగా చర్యలు చేపట్టడమే సెన్సార్‌షిప్ నిస్సందేహమైన కర్తవ్యం".

పైన చెప్పిన పద్ధతిలో రాజకీయ సాహిత్యం, దినపత్రికలు తమ విధిని ఇంకా ఎక్కువగా గుర్తించగలవని ఆశిస్తున్నారు. కాని ఇంకా మంచి గుర్తింపు అనేదాన్ని శాసించి సాధించడం కుదరదు. అంతకన్న ముఖ్యంగా అదీ ఇంకా ఆశిస్తున్న ఫలమే. ఆ ఆశ ఆశగానే ఉండిపోతోంది. కాని ఆదేశం కేవలం ఆశలతో, పవిత్ర కోర్కెలతో సంతృప్తి పడని ఆచరణాత్మకమైనది. ప్రతికారంగం పరిస్థితి భవిష్యత్తులో మెరుగుపడుతుందనే ఒక కొత్త ప్రోత్సాహకాన్ని ఇచ్చిన ఈ దయామయ ఆదేశం అదే సమయంలో పత్రికారంగానికి ఇప్పుడున్న హక్కును నిరాకరిస్తోంది. భవిష్యత్తులో మెరుగుదల ఆశతో ఇప్పుడున్నది పోగొట్టుకోవలసి వస్తోంది. పత్రికా రంగం పరిస్థితి డాన్ క్విక్సోట్‌లో సాంకో పాంజా పరిస్థితి లాగయింది. కడుపులో గందరగోళం జరిగితే, డ్యూక్ ఆజ్ఞలను నెరవేర్చడం అసాధ్యమవుతుందనే కారణంతో కోర్టు డాక్టరు సాంకో పాంజా దగ్గరున్న ఆహారాన్నంతా లాగేసుకున్నాడు.

అదేసమయంలో ఇటువంటి మర్యాదకరమైన శైలిని అనుసరించమని ప్రష్యన్ రచయితకు అందుతున్న ఆహ్వాన అవకాశాన్ని కూడ మనం మరిచిపోగూడదు. వాక్యం మొదటి భాగంలో "ఈ రకంగా ఆశించగలవేమంటే" అన్నారు. ఈ ఏమంటేలో ఎన్నో నిబంధనలున్నాయి. అవి రాజకీయ సాహిత్యం, దినపత్రికలు తమ విధులను ఇంకా సరిగా గుర్తించడం, అవి ఇంకా గౌరవనీయమైన పద్ధతి అలవరచుకోవడం వగైరా, వగైరా విదేశీ వార్తాపత్రికలనుంచి గ్రహించిన నిరాధార వార్తల ప్రచురణను అసహ్యించుకోవడం వగైరా. ఈ నిబంధనలన్నీ కూడ ఇప్పటికి ఆశించగల విషయాలే. కాని చివరికి వచ్చేసరికి నిర్ధారణ ఏమంటే, "ఇటువంటి ధోరణికి వ్యతిరేకంగా చర్యలు చేపట్టడమే సెన్సార్‌షిప్ నిస్సందేహమైన కర్తవ్యం". ఈ నిర్ధారణ సెన్సార్ అధికారిని దినపత్రికల్లో ఆశించదగిన మెరుగుదల కోసం

వేచి చూసే విసుగుదల నుంచి తప్పిస్తుంది. అందుకు బదులుగా అతడు అవాంఛనీయ మని భావించినవాటిని పెద్ద గొడవ లేకుండా కొట్టివేయడానికి అధికారం ఇస్తుంది. అవయవాన్ని అలాగే ఉంచి చికిత్స చేసే బదులు అవయవాన్నే తొలగించడం జరుగుతుందన్నమాట.

"ఈ లక్ష్యాన్ని ఇంకా నిశితంగా సాధించాలంటే, కొత్త ప్రచురణలనూ, కొత్త సంపాదకులనూ అంగీకరించడంలో చాల జాగ్రత్త చూపాలి. తద్వారా మాత్రమే దినపత్రికలను పూర్తిగా తప్పెన్నడానికి వీలులేని వ్యక్తులకు అప్పగించడం సాధ్యమవుతుంది. వాళ్ళ శాస్త్రీయ సామర్థ్యం, స్థితి, శీలం వాళ్ళ ప్రయత్నాల వ్యగ్రతనూ, వాళ్ళ ఆలోచనా విధానపు విధేయతనూ హామీ ఇస్తాయి".

ఇంకా వివరంగా పరిశీలించడానికన్న ముందు ఒక సాధారణ పరిశీలన మాత్రం చేస్తాం. కొత్త సంపాదకులకు, అంటే మొత్తం మీద భవిష్యత్ సంపాదకు లందరికీ, ఆమోదాన్ని పూర్తిగా "చాల జాగ్రత్త" కు అప్పగించారు. ఆ చాల జాగ్రత్త సహజంగానే ప్రభుత్వాధికారులది, సెన్సార్‌షిప్ అధికారులదన్నమాట. కాగా పాత సెన్సార్‌షిప్ ఉత్తర్వు సంపాదకుల ఎంపికను, కొన్ని హామీలతో, ప్రచురణకర్తల ఇష్టాయిష్టాలకు వదిలేసింది :

పాత ఉత్తర్వులో "అధికరణం తొమ్మిదీ :" ఒక ప్రతిపాదించబడుతున్న సంపాదకుడు అవసరమైన నమ్మకాన్ని సాధించలేడని ఒక వార్తాపత్రిక ప్రచురణ కర్తకు తెలియజేసే అధికారం అత్యున్నత సెన్సార్‌షిప్ అధికారులకు ఉంటుంది. అటువంటి సందర్భంలో ప్రచురణ కర్త మరొక సంపాదకుణ్ణయినా తీసుకోవాలి. లేదా, ప్రతిపాదించిన సంపాదకుణ్ణే తీసుకోదలచినట్టయితే, అత్యున్నత సెన్సార్‌షిప్ సూచనమేరకు సంబంధిత ప్రభుత్వ మంత్రిత్వ శాఖలు నిర్ణయించిన ధరావత్తును సమర్పించవలసి ఉంటుంది".

కొత్త సెన్సార్‌షిప్ ఆదేశం మరొక రకమైన అవగాహనను ప్రకటిస్తుంది. దాన్ని మానసిక కాల్పనికత అని పిలవవచ్చును. పాత సెన్సార్‌షిప్ ఉత్తర్వేమో ఒక బాహ్యమైన, ఉద్వేగభరితం కాని, అందువల్ల చట్టపరంగా నిర్వచించదగిన ధరా వత్తును కోరుతుంది. ఆ హామీ మీద చివరికి అభ్యంతరకరమైన సంపాదకుణ్ణయినా ఆమోదించవచ్చునంటుంది. కాని కొత్త ఆదేశం మాత్రం దినప్రతికా ప్రచురణకర్త

స్వతంత్ర ఇష్టాయిష్టాల్ని పూర్తిగా కొట్టివేస్తుంది. అంతేగాక, అది ప్రభుత్వపు నిరోధక విజ్ఞతను, అధికారుల మహాజాగ్రత్తను, మేధో అవగాహనను ఆంతరంగిక మైన, స్వీయ మానసికమైన, బాహ్యంగా నిర్వచించడానికి వీలులేని లక్షణాల వేపు మళ్ళిస్తుంది. అయితే, ఒకవేళ, ఈ కాల్పనికతకు చెందిన అనిర్దిష్టత, సున్నితమైన అభినివేశం, స్వీయమానసిక అడంబరత్వం పూర్తిగా బాహ్యమైనవిగా మారితే- అది కూడ ఏ అర్థంలో నంటే బాహ్య అవకాశం దాని అనార్ద్రమైన నిర్దిష్టతలోనూ, పరిమితులతోనూ కాక ఊహాత్మక వైభవంతో, కాల్పనిక గాఢతతో, ఆడంబరత్వంతో కనబడితే- ఇక ఈ కొత్త ఆదేశం కూడ ఇటువంటి కాల్పనిక విధిని తప్పించుకోజాలదు.

మొత్తం పాత్రికేయ కార్యకలాపాలలో ఒక తరగతి అయిన దినపత్రికా సంపాదకులు పూర్తిగా అభిశంసించడానికి వీలులేని వ్యక్తులు కావాలి. ఈ అభిశం సించడానికి వీలులేని తనానికి నిదర్శనంగా అన్నిటికంటె మిన్నగా 'శాస్త్రీయ అర్హతల'ను ప్రకటిస్తున్నారు. ప్రతి తరహా శాస్త్రీయ అర్హత గురించి తీర్పు ఇవ్వడానికి తగిన శాస్త్రీయ అర్హత సెన్సార్ అధికారికి ఉంటుందా అనే విషయంలో చిన్నమెత్తు సందేహం కూడ తలెత్తడం లేదు. ప్రతి నగరంలోనూ ఒక సెన్సార్ అధికారి ఉన్నాడు గనుక. ఇంతమంది సార్వత్రిక మహా మేధావుల గుంపు ప్రష్యాలో ఉన్నదని ప్రభుత్వానికి తెలిసి ఉన్నట్టయితే, ఇంతటి విజ్ఞాన సర్వస్వపు మేధలు రచయితలుగా ఎందుకు తయారవరు ? ఏదో ఒక్క-ప్రక్రియలో మాత్రమే రచనలు చేయగలిగిన, దానిలో కూడ అధికారికంగా అనుమతి పొందిన శక్తిలేని మామూలు రచయితలను సంఖ్యలో ఎందరో ఉన్న, శాస్త్రీయ జ్ఞానంలోనూ, మేధలోనూ బలవంతులైన ఈ అధికారులు తమ రచనల ద్వారా అణచగలిగితే, సెన్సార్‌షిప్ ద్వారా కన్న కూడ ఎక్కువగా పత్రికారంగపు అవక తవకలను అరికట్టవచ్చును. రోమన్ బాతులు కాపిటల్‌ను తమ అరుపుల ద్వారా రక్షించినట్టుగా రక్షించగల ఈ నిపుణులు ఎందుకు మౌనంగా ఉంటున్నట్టు ? వాళ్ళ వినయం మరీ ఎక్కువగా ఉన్నది. శాస్త్రీయమైన మనుషులకు వాళ్ళు తెలి యక పోవచ్చు, కాని ప్రభుత్వానికి తెలుసు.

ఇంతవరకూ ఏ ప్రభుత్వానికీ పూర్తిగా సార్వత్రిక మహామేధావులతో, విజ్ఞాన సర్వస్వపు మేధలతో నిండి ఉన్న మొత్తం వర్గాలు తెలియవు. ఈ వ్యక్తులు

ఇంతవరకూ ఏ ప్రభుత్వం చేతా గుర్తించబడని వాళ్ళే అయితే, వీళ్ళను ఎంపిక చేసిన వాళ్ళ మేధ ఎంత గొప్పదయి ఉండాలి ! శాస్త్ర రాజ్యానికి అపరిచితులైన ఈ అధికారులకు సార్వత్రిక శాస్త్రీయ అర్హత ఉన్నదని ధృవపత్రాలు ఇవ్వగలిగా రంటే అ ఇచ్చిన వాళ్ళదెంత రహస్య శాస్త్రమో ! ఈ జ్ఞాన యంత్రాంగంలో పైకి పోతున్న కొద్దీ మనకు ఇంకా ఎక్కువ గొప్ప మేధలు ఎదురవుతుంటాయి. ఇటు వంటి సమగ్ర పత్రికా రంగం వంటి స్తంభాలు కలిగి ఉన్న రాజ్యం ఈ మహాను భావులను అసమగ్ర పత్రికారంగపు రక్షకులుగా నియమించడం సరయినదేనా ? ఉచితమేనా ? అది ఒక సంపూర్ణతను అసంపూర్ణతతో వ్యవహరించే సాధనంగా దిగ జార్చడం కాదూ ?

మీరు ఎంత ఎక్కువగా సెన్సార్ అధికారులను నియమిస్తే, అంత ఎక్కు వగా పత్రికా ప్రపంచం మెరుగుపడే అవకాశాలను తొలగించేస్తారు. మీ సైన్యం లోని ఆరోగ్యవంతులను తొలగించి వాళ్ళను అనారోగ్యవంతుల వైద్యులుగా మార్చేస్తారు.

పాంపీలాగ నేలమీద కాలిని తాటించండి చాలు. ప్రతి ప్రభుత్వ భవనంలోంచీ సర్వసాయుధుడయిన దేవత అవతరిస్తాడు. అధికారిక పత్రికారంగాన్ని ఎదుర్కొనే సారహీనమైన దినపత్రికా రంగం శూన్యంగా మారిపోతుంది చీకటిని బహిష్క రించడానికి వెలుగు అస్తిత్వం చాలు. మీ వెలుగు వెలగనివ్వండి. దాన్ని దాచి పెట్టకండి. ఏ సెన్సార్‌షిప్ పూర్తి సమర్థతయితే సమస్యేనని మీరే అంగీకరిస్తు న్నారో, అటువంటి అసమగ్ర సెన్సార్‌షిప్ బదులు, మాకు ఒక సమగ్ర పత్రికా రంగాన్ని ఇచ్చి, చైనాలో శతాబ్దాలుగా ఉన్నటువంటి నమూనాను, కేవలం ఒక్క మాటతో లొంగిపోయే పత్రికా రంగాన్నివ్వండి.

కాని దినపత్రికల రచయితలకు శాస్త్రీయ అర్హతను ఏకైక, అవసరమైన షరతుగా విధించడమంటే, అది మనసుకు సంబంధించిన నిబంధన కాదా ? గౌర వాలను ఖాతరు చేయకపోవడం కాదా ? సాంప్రదాయిక కోర్కెకు భిన్నమైనది కాదా ? అది విషయానికి సంబంధించిన, వ్యక్తికి సంబంధించిన నిబంధన కాదా ?

దురదృష్టవశాత్తూ మా వాదనను సెన్సార్‌షిప్ ఆదేశం అడ్డుకుంటోంది. శాస్త్రీయ అర్హత అనే హామీతో పాటే స్థితి, శీలం అనే కోర్కెలు కూడ ఉన్నాయి. స్థితి, శీలం !

స్థితి వెంటనే శీలం వచ్చిందంటే, ఆ శీలం స్థితి నుంచి వెలువడినదే అయి ఉంటుంది. కనుక మనం మొదట స్థితి గురించి చూద్దాం. ఆ మాట శాస్త్రీయ అర్హతకూ, శీలానికీ మధ్య ఎట్లా నలిగిపోయిందంటే దాన్ని కోరినవాళ్ళ సదుద్దేశ్యాన్ని అనుమానించకుండా ఉండడం కష్టం.

శాస్త్రీయ అర్హత కోసమేమో ఒక సాధారణమైన కోర్కె, ఎంత ఉదారత్వం ! స్థితి గురించేమో ప్రత్యేకమైన కోర్కె, ఎంత ఉదారరాహిత్యం ! శాస్త్రీయ అర్హత, స్థితీ కలిసి ఉండడం, ఎంత కుహనా ఉదారత్వం ! శాస్త్రీయ అర్హత, శీలం అనేవేమో అనిర్దిష్ట అంశాలు కాగా, మరో పక్క స్థితి అనేది చాల నిర్దిష్టమైనది. కనుక తార్కిక న్యాయం ప్రకారం ఈ అనిర్దిష్ట అంశాలు నిర్దిష్ట అంశం మీద ఆధారపడతాయనీ, దానినుంచే స్థిరత్వాన్నీ సారాన్నీ గ్రహిస్తాయనీ మనం ఎందుకు నిర్ధారించగూడదు ? మరి సెన్సార్ అధికారి ఒకవేళ శాస్త్రీయ అర్హత, శీలం సాంఘికంగా వ్యక్తీకరణ పొందే బాహ్యరూపం స్థితి అని కొత్త ఆదేశం చెపుతున్నదని అర్థం చేసుకుంటే అది పెద్ద తప్పేమీ కాదేమో. ఎందుకంటే సెన్సార్ అధికారి సొంత స్థితి తన అభిప్రాయమే రాజ్యపు అభిప్రాయమనే హామీ నిస్తూ ఉంటుంది గదా. ఇటువంటి వ్యాఖ్యానం లేకపోతే ఈ వ్యవహారం అర్థంలేనిదయిపోతుంది. ఒక రచయితకు శాస్త్రీయ అర్హత, శీలం అనే రెండు షరతులు సరిపోవా ? స్థితి అనే మూడో షరతు ఎందుకు అనే ప్రశ్న వస్తుంది. ఇక సెన్సార్ అధికారికి గనుక సమస్య ఎదురయినట్టయితే, ఈ షరతులు అన్నీ కలిసి లేకపోతే, ఎక్కడో ఒక చోట మాత్రమే కనబడితే, ఆ అధికారి అప్పుడు ఎంచుకోవలసిందేమిటి ? ఏదో ఒక ఎంపిక అయితే తప్పదు. ఎందుకంటే ఎవరో ఒకరు వార్తాపత్రికలకు, పత్రికలకు సంపాదకత్వం వహించాలి గదా. స్థితితో సంబంధం లేకుండా శాస్త్రీయ అర్హత, శీలం అన్న లక్షణాలనే చూస్తే వాటి అనిర్దిష్టత వల్ల అవి సెన్సార్ అధికారికి ఇబ్బందిని కలిగిస్తాయి. అసలు స్థితి లేకుండా ఈ లక్షణాలు విడిగా ఉండగలవా అని సెన్సార్ అధికారికి ఆశ్చర్యం కూడ కలగవచ్చు. మరో వైపు, స్థితి ఉన్నచోట శాస్త్రీయ అర్హత, శీలం ఉన్నాయా లేవా అని సెన్సార్ అధికారి అనుమానించాల్సిన అవసరం ఉంటుందా ? అటువంటి సందర్భంలో తన సొంత తీర్పు మీదికన్న రాజ్యపు తీర్పు మీద సెన్సార్ అధికారికి తక్కువ నమ్మకం కలుగుతుంది. కాగా, అందుకు పూర్తిగా భిన్నమైన సందర్భంలో సెన్సార్ అధికారికి రాజ్యం మీదికన్న రచయిత మీద

ఎక్కువ విశ్వాసం ఉండవలసి వస్తుంది. మరి సెన్సార్ అధికారి ఇంత తెలివి తక్కువగా, ఇంత గందరగోళంగా ఉండవచ్చునా ? అది ఊహించడానికే వీలులేని విషయం. ఎవరూ ఊహించడం గూడ లేదనుకుంటాను. అనుమానాస్పద సందర్భాలలో నిర్ణయాత్మక ప్రమాణంగా ఉన్న స్థితే, అన్ని సందర్భాలలోనూ పరమమైన నిర్ణయాత్మక ప్రమాణంగా కూడ ఉంటుందన్న మాట.

కనుక, ఇంతకుముందు తన ఛాందసత్వం వల్ల సెన్సార్‌షిప్ చట్టంతో విభేదించినట్టుగానే, ఇప్పుడు తన కాల్పనికత వల్ల ఆ చట్టంతో విభేదిస్తోంది కొత్త సెన్సార్ షిప్ ఆదేశం. ఈ కాల్పనికత అనేది ఎప్పుడయినా ధోరణి యొక్క కవితాత్మకత. పూర్తిగా అనార్థ్రమైన, నిజమైన షరతుగా ఉండే ద్రవ్యరూప ధరావత్తు ఊహాత్మకమైపోతుంది. ఈ ఊహాత్మక షరతు పూర్తిగా నిజమైన, వ్యక్తిగతమైన స్థితిగా మారిపోతుంది. అది ఒక నిగూఢమైన, కాల్పనికమైన ప్రాముఖ్యతను సంతరించు కుంటుంది. ఈ రకంగానే షరతుల ప్రాముఖ్యత గూడ మారిపోతుంది. ఇక అధికారుల షరతులను అంగీకరించేలా ఒక సంపాదకుణ్ని ప్రచురణకర్త ఎంచుకోడు. అందుకు బదులుగా అధికారులే ప్రచురణకర్త కోసం ఒక సంపాదకుణ్ని ఎంపికచేసి పెడతారు. ఆ సంపాదకుని గురించి తమకు తామే హామీ ఇచ్చుకుంటారు. పాత చట్టమేమో సంపాదకుని పనిని ఆకాంక్షించింది. ఆ పని కోసం ప్రచురణకర్త ద్రవ్యరూప ధరావత్తు హామీగా ఉంటుందని భావించింది. కొత్త ఆదేశానికి మాత్రం సంపాదకుని పనితో పనిలేదు. ఆ వ్యక్తితోనే దానికి పని. అది ఒక నిర్దిష్ట వ్యక్తి వ్యక్తిత్వాన్ని కోరుతోంది. ఆ వ్యక్తిత్వాన్ని కల్పించవలసింది ప్రచురణకర్త డబ్బు. కొత్త ఆదేశం పాత చట్టం లాగనే పై పైననే చూస్తోంది. కాని పాత చట్టమేమో స్వాభావికంగానే అనార్ధ్రంగా నిర్వచించిన నిబంధనలను వ్యక్తీకరించింది, స్పష్టం చేసింది. కాగా ఆదేశం మాత్రం కేవలం యాదృచ్ఛికతకు ఊహాత్మక ప్రాముఖ్యాన్నిస్తోంది. కేవలం వ్యక్తిగతమైనదాన్ని సాధారణమైనదన్నట్టుగా వ్యక్తీకరిస్తోంది.

అయితే సంపాదకుని విషయంలోనేమో ఈ కాల్పనిక ఆదేశం తీవ్రమైన ఉపరితల నిర్దిష్టతను చాల అలవోకగా అనిర్దిష్టత గురించి మాట్లాడుతున్నట్టుగా వ్యక్తీకరించింది గాని సెన్సార్ అధికారి విషయంలో మాత్రం చట్టపరమైన నిర్దిష్టతా స్వరంతో అస్పష్టమైన అనిర్దిష్టతను ప్రకటించింది :

"సెన్సార్ అధికారి నియామకంలోనూ ఇటువంటి జాగ్రత్తనే పాటించాలి. తద్వారా సెన్సార్ అధికారి పదవి పరీక్షించబడిన మానసిక చరిత్రమూ, సామర్థ్యమూ గలవాళ్ళకే అందాలి. ఆ పదవికి ఎంత గౌరవనీయ విశ్వాసం అవసరమో అందుకు తగినవాళ్ళే ఆ పదవిలో నియమించబడాలి. సరైన ఆలోచనలు గలవాళ్ళకు, నిశిత దృష్టి గలవాళ్ళకు, ఒక విషయపు సారం నుంచి రూపాన్ని వేరు చేయగల శక్తి గల వాళ్ళకు, ఒక రచన భావమూ ధోరణీ తమంత తాము తన అనుమానాన్ని సమర్థించనప్పుడు ఆ అనుమానాన్ని పక్కన పెట్టడం ఎట్లాగో తెలిసినవాళ్ళకు ఈ పదవి దక్కాలి".

రచయితకు స్థితి, శీలం కావాలని కోరినదానికి బదులుగా, ఇక్కడేమో పరీక్షించబడిన మానసిక చరిత్రం కోరబడుతున్నది. ఎందుకంటే ఇక్కడ స్థితి ఎట్లాగూ ఉన్నది గదా. ఇంకా ముఖ్యమైన అంశమేమంటే, రచయిత విషయంలో శాస్త్రీయ అర్హత కోరారు గాని, సెన్సార్ అధికారి విషయంలో మాత్రం తదనంతర వివరణేమీ లేకుండా కేవలం సామర్థ్యం అని అపేశారు. రాజకీయాలలో మినహా ఇతర విషయాలతో హేతుబద్ధ స్పృహతో రాయబడిన పాత చట్టం మూడో అధికరణంలో "శాస్త్రీయ శిక్షణ పొందిన", "చైతన్యవంతులైన" సెన్సార్ అధికారులు కావాలని రాశారు. కొత్త ఆదేశంలో ఈ రెండు లక్షణాలూ వదిలేయబడ్డాయి. ఒక నిర్దిష్టమైన, అభివృద్ధి చెందిన సామర్థ్యాన్ని, వాస్తవమైనదిగా మారినదాన్ని సూచించే రచయిత అర్హత స్థానంలో సెన్సార్ అధికారికి ఉండవలసిన అర్హత పట్ల అభిరుచి అనేదీ, సాధారణమైన సామర్థ్యం అనేదీ వచ్చి చేరింది. కనుక వాస్తవ అర్హత పట్ల సెన్సార్ అధికారిగా ప్రవర్తించే సామర్థ్యపు అభిరుచి ఎంత ఎక్కువ స్వాభావికంగా ఉన్నట్టనిపించినప్పటికీ, నిజానికి ఈ సంబంధం తలకిందులుగా ఉండవలసి ఉందన్నదీ స్పష్టమే. చివరిగా, కేవలం ప్రస్తావన కోసం మేం చెప్పదలచిందేమంటే, సెన్సార్ అధికారి సామర్థ్యం అనేదాన్ని దాని వస్తుగత సారాంశం దృష్ట్యా నిర్వచించడం జరగలేదు ఇది దాని స్వభావాన్ని అస్పష్టం చేస్తోంది.

ఇంకా, సెన్సార్ అధికారి ఉద్యోగాన్ని ఎవరికి ఇవ్వాలంటే, "ఆ పదవి ఏ గౌరవనీయమైన విశ్వాసానికి తగినదో ఆ విశ్వాసానికి పూర్తిగా సరిపోయే" మనుషులకు ఇవ్వాలట. ఈ వ్యర్థమైన కుహనా నిర్వచనం, ఒక పదవికి వ్యక్తులను ఎంపిక చేయాలంటే ఆ వ్యక్తులలో విశ్వాసం, కచ్చితంగా ఒక పూర్తి విశ్వాసం ఉండీ, అదీ

గౌరవనీయమైన విశ్వాసానికి పూర్తిగా తగినదిగా ఉండాలని చెపుతుంది. దీని గురించి ఇంక చర్చించడం కూడ అనవసరం.

చివరగా సెన్సార్ అధికారులు ఎటువంటి మనుషులు అయి ఉండాలంటే, "సరైన ఆలోచన చేసేవాళ్లూ, నిశిత దృష్టి గలవాళ్ళూ కావాలి. విషయపు సారాంశం నుంచి రూపాన్ని వేరు చేయగలిగి ఉండాలి. సందేహం వచ్చినపుడు, ఆ సందేహాన్ని ఒక రచనలోని భావమూ ధోరణీ తమంత తాముగా సమర్థించలేనపుడు చతురతతో ఆ సందేహాన్ని పక్కన పెట్టగల నేర్పు ఉండాలి".

మరోవైపు నుంచి, కొద్ది ముందుగా, సెన్సార్ షిప్ ఆదేశం మరోదాన్ని నిర్దేశిస్తోంది. "ధోరణిని పరిశోధించడం విషయంలో, సెన్సార్ అధికారులు పత్రికా రచనల రూపానికీ, స్వరానికీ ప్రత్యేక శ్రద్ధ వహించాలి. ఆ ధోరణి ఒకవేళ ఉద్వేగం వల్లనో, గాఢత వల్లనో, మొండితనం వల్లనో ప్రమాదకరంగా ఉన్నట్టయితే, ఆ రచనలను అచ్చు వెయ్యడానికి అనుమతించగూడదు".

అంటే, ఒక సందర్భంలోనేమో, సెన్సార్ అధికారి రూపం నుంచి ధోరణిని వేరు చేసి తీర్పు చెప్పాలి. మరో సందర్భంలోనేమో ధోరణి నుంచి రూపాన్ని వేరు చేసి తీర్పు చెప్పాలి. మొదట మనం సెన్సార్‌షిప్ ప్రమాణాల నుంచి వస్తువు ఎట్లా అదృశ్యమయిందో చూశాం. ఇప్పుడిక రూపం కూడ అదృశ్యమవుతుందన్న మాట. ధోరణి మంచిదయినంతవరకు, రూపపు లోపాలను పట్టించుకోనక్కర లేదు. ఒకవేళ రచన సరిగ్గా నిశితమైనదనో, వినయ పూర్వకమైనదనో అనిపించినప్పటికీ, అది గాఢమైనదనీ, ఉద్వేగభరితమైనదనీ, మొండిదనీ అనిపించనప్పటికీ ఆ బైటికి కనబడే మొరటుతనాన్ని చూసి ఎవరు భయపడతారు ? రూపాన్నీ, సారాంశాన్నీ వేరు చేయడం ఎట్లాగో నేర్చుకోవాలి. నిర్వచనాలు అనబడే వాటన్నిటినీ వదిలేయవలసి వచ్చింది. ఈ కొత్త ఆదేశం తనకు తానే పూర్తిగా వైరుధ్యంలో పడిపోవలసి వచ్చింది. దేనివల్లనైతే ధోరణిని గుర్తించగలమని అనుకుంటామో, దాన్ని ధోరణి ద్వారా నిర్ధారించడం, ధోరణి ద్వారానే గుర్తించడం జరుగుతోంది. దేశభక్తుడి గాఢత పవిత్ర దీక్ష అవుతుంది. అతని ఉద్వేగం ప్రేమికుడి సున్నితత్వం అవుతుంది. అతని మొండితనం వినయాన్ని కొలవడానికి వీల్లేనంత అంకిత సానుభూతి అవుతుంది.

అన్ని వస్తుగత ప్రమాణాలనూ వదిలెయ్యడం జరిగింది. ప్రతి ఒక్కదాన్నీ చివరికి వ్యక్తిగత సంబంధంగా తగ్గించడం జరిగింది. సెన్సార్ అధికారి నేర్పునే హామీగా చూపడం జరిగింది. ఇక సెన్సార్ అధికారి ఉల్లంఘించడానికి మిగిలేదేమిటి ? నేర్పు ఒక్కటే. కాని నేర్పు లేకపోవడమనేది నేరమేమీ కాదు. మరి రచయిత విషయంలో ప్రమాదంలో పడేదేమిటి ? అతని మనుగడ. కొందరు అధికారుల నేర్పు మీద ఆధారపడేట్టుగా కొన్ని వర్గాల మనుగడను మార్చెయ్యగల రాజ్యం ఎప్పుడన్నా ఉండిందా ?

నేను మళ్ళీ చెపుతున్నాను. అన్ని వస్తుగత ప్రమాణాలూ రద్దయి పోయాయి. రచయితకు సంబంధించినంతవరకు, ధోరణి ఒక్కటే అతని నుంచి కోరబడు తున్న, అతనికి ఆదేశించబడుతున్న అంతిమ వస్తువు. రూపరహితమైన అభిప్రాయం వలె ధోరణి విషయంగా కనబడుతుంది. అదే ధోరణిని విషయంగా చూస్తే, అభి ప్రాయాల పట్ల అభిప్రాయంగా, సెన్సార్ అధికారి నేర్పుగానూ, అతని ఏకైక ప్రమాణంగానూ కనబడుతుంది.

కాని, ఎక్కడైతే సెన్సార్ అధికారి నిరంకుశత్వం (కేవలం అభిప్రాయపు అధికారాన్ని అనుమతించడమే నిరంకుశత్వాన్ని అనుమతించడం) వస్తుగత నిర్వచ నాల ఆభాస వెనుక దాగిన తార్కిక ఫలితమవుతుందో, మరోవైపు ఈ సెన్సార్ షిప్ ఆదేశం పూర్తి చైతన్యయుతంగానే ఉన్నత సెన్సార్ అధికారుల నిరంకుశ త్వాన్ని వ్యక్తీకరిస్తుంది. ఉన్నత సెన్సార్ అధికారుల్లో ఏ మినహాయింపులూ లేని నమ్మకాన్ని ప్రకటించడం జరుగుతోంది. ఈ నమ్మకమే ప్రతీకారంగానికి అంతిమ హామీగా ఉంటోంది. అంటే మొత్తం మీద సెన్సార్‌షిప్ సారాంశం అంతా కూడ పోలీసు రాజ్యం తన అధికారుల గురించి కలిగి ఉన్న మూర్ఖపు ఊహాత్మక భావం మీద ఆధారపడి ఉందన్నమాట. అతి సాదా విషయాలలో కూడ సాధారణ ప్రజా నీకపు జ్ఞానం మీద, మంచితనం మీద నమ్మకం లేదు. కాని అధికారుల విషయంలో మాత్రం అసాధ్యాలు కూడ సాధ్యాలేననే అనుకుంటున్నారు.

ఈ మౌలిక లోపం మన అన్ని నిర్మాణాలలోను అంతర్గతంగా ఉంది. అందువల్లనే, ఉదాహరణకు, న్యాయ విచారణలలో న్యాయమూర్తి, నేరారోపకుడు సమర్థకుడు అందరూ ఒకే వ్యక్తిలో సమ్మిళితమయ్యారు. ఈ సమ్మేళనం మన తత్వ శాస్త్ర నియమాలన్నిటినీ ధిక్కరిస్తుంది. కాని అధికారిని మన తత్వ శాస్త్ర నియమా

లకు అతీతుణ్ణి చేయడం జరిగింది. కాగా సాధారణ ప్రజానీకమేమో ఆ అధికారి కింద ఉండాలి. అయినా సరే, రాజ్యానికి ఒక తప్పుడు సూత్రం ఉంటే క్షమించ వచ్చు. కాని అది ఒకే రీతిగా ఉండేంత నిజాయితీగా కూడ లేకపోవడం మాత్రం క్షమార్హం కాదు. అధికారులు సాధారణ ప్రజానీకం కన్న లెక్కలేనంత పైన ఉన్నారు గనుక వాళ్ళ బాధ్యత కూడ అంతే ఘనంగా ఉండడం భావ్యం. సరిగ్గా ఇక్కడే ఔచిత్యం అనేదానికి పాత్ర ఉంది. అది ఈ వ్యవహారాలలో సూత్రాన్ని సమర్థించి, దాన్ని న్యాయమనిపించేటట్టు చేస్తుంది. కాని, సరిగ్గా ఇక్కడే ఈ ఔచిత్యాన్ని వదిలెయ్యడం, దానికి పూర్తిగా భిన్నమైన సూత్రాన్ని అమలు చేయడం జరిగింది.

సెన్సార్ అధికారి అంటే కూడ, ఒకే వ్యక్తిలో నేరారోపకుడు, సమర్థకుడు, న్యాయమూర్తి కలిసి ఉండడమే. మనసును నియంత్రించే పని సెన్సార్ అధికారికి అప్పగిస్తున్నారు. అతను బాధ్యతా రహితంగా ఉంటున్నాడు.

సెన్సార్‌షిప్‌కు ప్రాథమికంగానైనా విధేయస్వభావం ఎప్పుడుంటుందంటే, అది మామూలు న్యాయస్థానాలకు అప్పగించబడినప్పుడు. కాని సెన్సార్‌షిప్‌ను నియంత్రించే వస్తుగత చట్టాలు లేనంత కాలం ఇవి అసాధ్యం. కాని అన్నిటికన్న ఘోరమైన పద్ధతి ఏమంటే, సెన్సార్‌షిప్‌ను సెన్సార్‌షిప్‌కే అప్పగించడం ద్వారానో, లేదా సెన్సార్ అధికారుల వ్యవస్థ ద్వారానో.

పత్రికా రంగానికీ, సెన్సార్‌షిప్‌కూ మధ్య ఉన్న సంబంధానికి ఏమేమి వర్తిస్తాయో, సెన్సార్‌షిప్‌కూ, అత్యున్నత సెన్సార్‌షిప్‌కూ మధ్య ఉన్న సంబంధానికీ, రచయితకూ అత్యున్నత సెన్సార్ అధికారికీ మధ్య ఉన్న సంబంధానికీ కూడ అవన్నీ వర్తిస్తాయి. కాకపోతే చివరి సంబంధంలో ఒక మధ్యవర్తిత్వం వచ్చి చేరుతుంది. ఈ చివరి సంబంధం ఒక ఉన్నత స్థితికి ఎదిగింపజేసిన మామూలు సంబంధమే. విషయాలను వాటికవిగా వదిలేసి, ఇతర వ్యక్తుల ద్వారా వాటికి మరొక స్వభావం కల్పించడానికి ఇక్కడ ప్రయత్నం జరిగింది. నిర్బంధపూరితమైన రాజ్యం విధేయంగా ఉండదలిస్తే తనను తాను రద్దు చేసుకోవాలి. ప్రతి అంశంలోనూ అంటే నిర్బంధం, అంతే ప్రతికూలత అవసరమవుతుంది. అత్యున్నత సెన్సార్‌షిప్‌ను కూడ సెన్సార్‌షిప్‌కు గురి చేయవలసి ఉంటుంది. ఈ విషవలయం నుంచి బయటపడేందుకు

కన్యాశుల్కం :

# జీవిత నాటకం

—హరి

మన దేశ భాషలన్నింటిలోనూ, పూర్తిగా వచనంలో, అందులోకీ వ్యవహారిక శైలిలో, మొట్టమొదటిసారిగా నాటకం రాసింది గురజాడ అప్పారావుగారనే అనుకుంటాను. సాంఘిక వాస్తవికతను దర్పణంలోవలె యథాతథంగా ప్రతిబింబించిన కళాఖండం మనభాషలోనే కాదు, ఇతర భారతీయ భాషల్లోనైనా మొదటిదీ ఆఖరుదీ 'కన్యాశుల్కమే' అనుకుంటాను. కన్యాశుల్కం నాటకాన్ని ఆ తెగలో మించటం మాట అటుంచి, ఆ దరిదాపులకైనా రాగల నాటకం మన దేశంలో ఏదైనా ఉంటే దాని సంగతి ఇంతవరకూ ఎవరికీ తెలియకపోవటం ఆశ్చర్యకరమే అని నేననుకుంటాను.

—శ్రీశ్రీ

అంతకంటే ఆశ్చర్యకరమైన విషయం : శ్రీశ్రీ అకడమిక్ సంయమనం

---

గాను అవిధేయంగా ఉండాలనే నిర్ణయం తీసుకోవడం జరుగుతుంది. అంటే చట్ట రాహిత్యం మూడోదశలో గాని, తొంభైతొమ్మిదో దశలోగాని మొదలవుతుంది. పెత్తందారీ రాజ్యానికి దీని గురించి అస్పష్టమైన అవగాహనే ఉంటుంది గనుక, కనీసం అది చట్టరాహిత్యాన్ని చాల పైస్థాయిలో ఎవరికీ కనబడనంత ఎత్తులో పెట్టాలని చూస్తుంది. ఇక చట్ట రాహిత్యం అదృశ్యమైపోయిందని భావిస్తుంది.

సెన్సార్‌షిప్‌కు నిజమైన, మౌలికమైన మందు దాని రద్దు మాత్రమే. ఎందుకంటే ఆ వ్యవస్థే చెడ్డది. వ్యవస్థలు ప్రజలకన్న శక్తివంతమైనవి. మా అభిప్రాయం సరైనది కావచ్చు, కాకపోవచ్చు. కాని ఏది ఏమైనా కొత్త సెన్సార్‌షిప్ ఆదేశం వల్ల ప్రష్యన్ రచయితలకు మేలే జరుగుతుంది. నిజమైన స్వేచ్ఛలో గాని, లేదా భావాల స్వేచ్ఛలో గాని, చైతన్య స్వేచ్ఛలో గాని మేలే జరుగుతుంది.

"ఏమనుకుంటే అది ఆలోచించే
ఏమాలోచిస్తే అది మాట్లాడేచోట,
ఎంత అరుదైన సంతోష సమయమది". (టేసిటస్)

అధికంగా పాటించి "'కన్యాశుల్కం' లాంటి నాటకం మనదేశంలో మరెక్కడాలేదు" అని కచ్చితంగా చెప్పకపోవడం. 'కన్యాశుల్కం'లో వ్యక్తమయ్యే నిర్దుష్టమైన వాస్తవికతా ధోరణిని అవలంబించిన రచన యూరపియన్ నాటకరంగంలో కూడా కనీసం ఆనాటికి లేదని శ్రీశ్రీ రాయకపోవడమూ ఆశ్చర్యకరమే. శ్రీశ్రీకి ఆంధ్ర భక్తి మెండని అందరికీ తెలుసు. కాని పై వాక్యాలను ఎంత జాగ్రత్తగా- అతి జాగ్రత్తగా- రాసాడో గమనిస్తే 1980 దశకంలో మాత్రమే కన్యాశుల్కం ప్రాముఖ్యత గురించి వేరే కోణం ఆవిష్కారం కావడం మాత్రం ఆశ్చర్యకరం కాదు. 1980కి ముందు కన్యాశుల్కం నాటకంలోని వాస్తవికతనూ కళా సౌష్ఠవాన్నీ, పాత్రల స్వభావాలనూ రకరకాలుగా వివరించి వ్యాఖ్యానించిన పెద్దలనేకులున్నారు. 'కన్యాశుల్కం' నాటకమే కాదనేవారి సంగతి రామప్పంతులు చెప్పినట్టు వేరే కథ. 1980 తర్వాత వాస్తవ జీవితంలోని నాటకీయత 'కన్యాశుల్కం' లో గమనించడం ప్రారంభమైంది. 'కన్యాశుల్కం' ఒక కల్పన కాదనీ, వాస్తవ జీవిత శకలాల పేర్పు అనీ, ఆ జీవిత శకలాల నేపథ్యం కథకో నాటక రూపానికో పరిమితమైన వ్యవహారం కాదనీ.... ఒక నూతన దృష్టి 1980 దశకంలో మాత్రమే వ్యక్తమైంది. నాటకంలో జీవితాన్ని అన్వేషించడంకంటె, జీవితంలోని నాటకీయతను గుర్తించడం మరింత ప్రయోజనకరమని నిర్ణయానికి రావడం ఇక్కడి ప్రధానాంశం. జీవితం- కళారూపం- జీవితం.... ఇదొక పెద్ద గొలుసు.

ఫలితంగా, కన్యాశుల్కం కథా వస్తువు, ఇతివృత్తం, నిర్మాణవ్యూహం మొదలైన వివరాలకు పోకుండానే కొన్ని నిర్ణయాలకు రావచ్చును. 'కన్యాశుల్కం' లోని సంభాషణలనన్నింటినీ 'గ్రంథస్థం చేసిన సంభాషణలు'గా (Recorded Dialogues) పేర్కొనవచ్చును. ఎటూ వచ్చి గ్రంథస్థం చేయడంలో రచయిత తీసుకున్న జాగ్రత్త, చూపిన సంయమనం, ఆచరించిన నిజాయితీ....అన్నీ కలిసి కన్యాశుల్కాన్ని ఒక చారిత్రక పత్రంగా రూపొందించాయి. అంటే 'గ్రంథస్థం చేయడం' గొప్ప శ్రమతో కూడుకున్న వ్యవహారమన్నమాట. 1909కి ముందు రాసిన 'కొండు భట్టీయం'లోని కొన్ని సంభాషణలు, కొన్ని వివరాలు.... 'కన్యాశుల్కం'లో చేరుకున్నాయని గమనిస్తే గురజాడ 'కన్యాశుల్కం' రచనను పరిపుష్టం చేయడానికి చేసిన 'వ్యాయామం' (Exercise)కూడా మనకు స్ఫురిస్తుంది. కథకూ కథనానికీ అవసరమైన దృశ్యాలనూ, సంభాషణలనూ మాత్రమే 'పరిమితంగా' తీసుకుని

ఉంటే 'కన్యాశుల్కం' ఒక నాటకంగా మాత్రమే మనకు గుర్తుండేదీ. అందుకు భిన్నంగా, ఒక నిర్దిష్ట ప్రాంతంలో ఒక నిర్దిష్ట కాలంలో, ఉన్న సామాజిక భావాల రాశి 'కన్యాశుల్కం'లో మనకు పుష్కలంగా లభిస్తోంది. కనకనే దాన్ని మనం జీవితంలో భాగంగా చూడాల్సి వస్తోంది. ఆంధ్రదేశపు సాంఘిక చరిత్ర రాయడానికి- ముఖ్యంగా కళింగాంధ్ర చరిత్ర- కన్యాశుల్కం ఒక ఆధారంగా పనికి వస్తుంది. ఈ సందర్భంలో, గురజాడ 'కళింగాంధ్రదేశ చరిత్ర' రాసాడని గుర్తు పెట్టుకోవడం మరింత అవసరం. నడుస్తున్న చరిత్రను 'కన్యాశుల్కం' అక్షరబద్ధం చేసింది.

నిత్యనైమిత్తికాలు, బ్రిటిషు వలస విధానం, దాని వారసత్వం, సాంఘిక దురాచారాలు – సదాచారాలు కూడా – సంస్కరణ, దేశ స్వాతంత్ర్యం, హ్రస్వదృష్టి, దీర్ఘదృష్టి, నిజాయితీ, ఆత్మవంచన, నైర్మల్యం, కౌటిల్యం, సారళ్యం, సంక్లిష్టత, ఆదర్శం, అవినీతి.... ఇలా జీవితంలో తటస్థపడే ప్రతి అంశమూ కన్యాశుల్కంలో ప్రస్తావనకు వచ్చింది. అన్నింటికంటె ముఖ్యంగా, ఆధునికతా స్వభావం గురించీ, సంప్రదాయబద్ధతను గురించీ.... అప్పుడు వ్యాప్తిలో ఉన్న భావాల ప్రకటన 'కన్యాశుల్కం'లో అనాచ్ఛాదితంగా కనబడుతుంది.

'కన్యాశుల్కం' పాత్రలు అప్పటి సంకీర్ణ సమాజంలోని వ్యక్తులుగానే మనకు కనబడతాయిగాని, నాటకానికి "అవసరమైన" పాత్రల్లాగా కనబడవు. ఆ యా పాత్రల ప్రవర్తన, ఆ పాత్రల అవసరాలనూ, ఆశలనూ, లక్ష్యాలనూ అంటిపెట్టుకుని ఉండడం కూడా అందువల్లనే విశిష్టంగా కాక, సహజంగా కనబడుతుంది. అలాగే, కన్యాశుల్కంలో కొన్ని పాత్రలు గురజాడ ఊహలను కూడా దాటిపోయి స్వకీయ వ్యక్తిత్వాన్ని రూపొందించుకొని గురజాడను 'ధిక్కరించాయ'ని కొందరు విమర్శకుల నింద. నిజానికి ఇది ప్రశంస. గురజాడ పరిశీలనకూ, నిజాయితీకీ ఈ వ్యాఖ్య ఒక అద్భుతమైన కితాబు.

అయితే గురజాడ జీవిత సంకీర్ణత వర్ణించడానికి ఎన్నుకున్న పాత్రలు, స్వభావాలు.... స్థూలంగా ఒక ప్రణాళికను అనుసరించినట్లు కనబడుతుంది. నాటకంలోని పాత్రలను ఒక్కొక్కటిగా కాక, జంటలుగా రూపొందించాడు గురజాడ. (జంటలు అంటే స్వాభావికంగా అభిముఖమైన జంటలు) ఈ విధానం సమాజంలోని వైవిధ్యాన్ని ప్రదర్శించడానికి అనుకూలంగా ఉండడమే కాక నాటకీయతా పోషణకు కూడా సౌష్ఠవాన్ని కూరుస్తుంది.

'కన్యాశుల్కం' నాటకంలో వర్ణితమైన సమాజానికి కొంచెం ఎడంగా ఉన్న పాత్ర గిరీశం పాత్ర. ఆ సమాజానికి అతడు కొత్తవాడు. పరాయివాడు. ఒక పాత్రకూ అతడున్న సామాజిక వాతావరణానికీ మధ్య దూరమున్నప్పుడు విచిత్ర సంఘటనలు పన్ని పేళాలు సహజమే. హనుమంతుని లంకాయాత్ర, ఊహాప్రపంచంలో ఉండే డాన్‌క్విక్‌సెట్ చుట్టూ ఉన్న వాస్తవ ప్రపంచం, అఖం శఖం తెలియని పార్వతీశం ఇంగ్లండు ప్రయాణం.... ఇలా ప్రతిచోట్లా ఇదే పరిస్థితిని చూడ వచ్చును. అయితే ఇక్కడ గిరీశం ఇంచుమించుగా మిగిలిన అన్ని పాత్రలకూ అభిముఖమైన పాత్రను పోషించాడు. గిరీశాన్ని మినహాయిస్తే.... మిగతా పాత్రలను అభిముఖమైన జంటలుగా విడదీసి పరిశీలించవచ్చును. అనేక సమాన లక్షణాలుండి ఒకటి రెండు అంశాల్లో పూర్తిగా భిన్నమైన లక్షణాలను కలిగిన రెండు పాత్రలను అభిముఖమైన పాత్రలుగా నిర్వచించుకోవచ్చును. అభిముఖ స్వభావాలను (Polarities) వర్ణించడంలో అనేకత్వాన్ని ఆవిష్కరించడమే గురజాడ లక్ష్యం.

అగ్నిహోత్రావధాన్లు, లుబ్ధావధాన్లు.... జంటనే తీసుకుందాం. ఇద్దరిదీ ఇంచు మించు ఒకే రకమైన వారసత్వమే. అయితే అగ్నిహోత్రావధాన్లు మరికొంచెం ఎక్కువగానే సంప్రదాయ విద్యా గంధం కలవాడు. మరోవైపున తన వ్యవహారాలు తానే చూసుకునేవాడు. సంప్రదాయాల్లోనూ, సాంస్కృతిక వారసత్వంలోనూ తర తమ భేదాలతో ఒక సమూహానికి చెందినవారే. అయితే లుబ్ధావధాన్లుకు అనుభవం వలన చివరికి పశ్చాత్తాపం లాంటి ఆలోచనలు వస్తాయి. అగ్నిహోత్రావధాన్లు 'సర్వ జ్ఞుడు' "సందేహాలు లేనివాడు..." అందువలన అతనిలో మార్పు అసంభవం. ఇలా నాటకంలో మిగతా పాత్రలను జంటలుగా గమనించవచ్చును.

మహేశం, వెంకటేశం; పూటకూళ్ళమ్మ, మీనాక్షి, కొండిభొట్లు, కాంబొట్లు; గిరీశం, బైరాగి, గిరీశం, రామప్పంతులు; రామప్పంతులు, కరటక శాస్త్రి.... ఇలా జంటలను పెంచుకుంటూ పోవచ్చును. పాత్రల గతితార్కిక వైవిధ్యమే 'కన్యా శుల్కం' ప్రత్యేకత అని సరిపెట్టుకోనక్కర్లేదు. అలాగే సమాజంలోని పొరలనన్నిం టినీ పరిశీలించడానికీ, ఆవిష్కరించడానికీ చేసిన ప్రయత్నం వల్లనే 'కన్యా శుల్కం'లో సంకీర్ణత ఒకోసారి మరీ సరళం (simple) గా కూడా కనబడుతుంది. అంటే సంకీర్ణత, సారళ్యం జంటగా 'కన్యాశుల్కం' నాటకమంతటా ఆవరించి ఉండడం గమనించవచ్చు.

అసిరిగాడి పాత్రనే తీసుకుంటే, అతడు సర్వ సాధారణమైన వ్యక్తిగా కన బడతాడు. అన్నట్లు అగ్నిహోత్రావధాన్లు నౌకరు పేరు కూడా అసిరిగాడవడం యాదృచ్ఛికం కాదు. ఈ సాధారణతను వ్యక్తం చేయడానికే ఆ పేరు. మన జీవితంలో కూడా ఇది సాధారణమే. ఎందుచేతనో ఎక్కువమంది పనిచేసుకునే పిల్లలకు లక్ష్మి అనే పేరు ఉండడం మనం గమనించవచ్చును. అసిరిగాడు అనే పేరు ఎంత సాధారణమైనదో, అతని వ్యక్తిత్వం అంత సంకీర్ణమైంది కూడా. అతనికి దయ్యాల మీద నమ్మకం లేదు. కాని 'రెండు దయ్యాల బరువు' ఉందో లేదో చూడమని సీసా చేతికిచ్చినప్పుడు "ఓలమ్మ ! ఎంత బలువుందోస్సి" అంటాడు ! "దయ్యాలకు పెట్టింది తింతున్నారా ?" అని రామప్పంతులును భయపెడతాడు. (మీనాక్షి ఇచ్చిన ఫలహారం తింటూన్నప్పుడు) అలాగే 'అదృశ్యంగా బైరాగి తన వెంట వస్తున్నాడ'ని గవరయ్య చెప్పినప్పుడు కూడా. 'నా కళ్ళకు కనబడుతున్నాదే' అని సమాధానం చెప్పిన అసిరిగాడు "కల్లాకపటం లేనివాడ"ని - అందుకే అతడు బైరాగిని చూడ గలుగుతున్నాడని భావం - గవరయ్య కితాబు సంపాదిస్తాడు. అన్నింటినీ మించి అతడు రామప్పంతులుకూ మీనాక్షికీ ఉన్న లైంగిక సంబంధాన్ని తైపారు వేసిన విధానం ఆశ్చర్యకరం ! అతడికి రామప్పంతులు పట్ల ఇసుమంత గౌరవం కూడా లేదు. లుబ్ధావధాన్లు రామప్పంతులును కర్రతో కొట్టినప్పుడు "చచ్చాన్రా ! కాలెవ్వ‌ర విరిగిపోయిందె"ని మొర్ర పెట్టినప్పుడు "కానేళ ఇంటో జొరబడితే బుగర కొట్టదా ?" అని నిర్దాక్షిణ్యంగా వ్యాఖ్యానిస్తాడు. అదే అసిరిగాడు మీనాక్షిని పిలవమని రామప్పంతులు చెప్పినప్పుడు, అతని దగ్గర డబ్బులు గుంజుతాడు. అయితే మీనాక్షి పట్ల అతనికి ఇంచుకంత కూడా ఏహ్యభావం ఉన్నట్టు దాఖలా లేదు. అతని నైతిక చట్రంలో : లైంగిక సంబంధం మీనాక్షికి సహజమైన అవసరం. రామప్పంతులు వస్తుతహ దుర్మార్గుడు. అందువలన అతనికి శిక్షపడడం అవసరం. లుబ్ధావధాన్లు సమాజ నీతులకు అసిరిగాడు భిన్నమైనవాడు. సహజంగా ఉత్తముడు. అందువలన 'కన్యాశుల్కం' పాత్రలలో నైతిక నియమావళి ప్రకారం పరిశీలించినప్పుడు అసిరిగాడు మధురవాణితో సరిపోగలడు. అసిరిగానిలో సాధారణత, సంక్లిష్టత పెనవేసు కొని ఉండడం వలనే అతని పాత్ర ఒక సంపూర్ణ వ్యక్తిత్వాన్ని సంతరించుకుంది.

ఈ రకంగా విశ్లేషించుకుంటూ పోతే, కొండిభొట్లు, పూటకూళ్ళమ్మ,

## పెరూ విప్లవం-గుజ్‌మన్ అరెస్టు

## —షైనింగ్ పాత్

ఈ మధ్యనే తన సెంట్రల్ కమిటీ సభ్యులతోపాటు అరెస్టు అయిన పెరూ కమ్యూనిస్టు పార్టీ (పి.సి.పి) నేత కామ్రేడ్ అభిమల్ గుజ్‌మన్ (Abimael Guzman) వల్ల పెరూ సాయుధ పోరాటం ప్రపంచ దృష్టికి వచ్చింది. ఇతడు అక్కడ చైర్మన్ గోన్‌జాలోస్ (Chairman Gonzalos) గా సుప్రసిద్ధుడు.

కాని పెట్టుబడిదారులకు సంబంధించిన పత్రికలు, టి.వి.లు తమ శక్తి మేరకు పెరూ కమ్యూనిస్టు పార్టీని ఘోరంగా చిత్రీకరించడానికి ప్రయత్నిస్తూ ఇది మితిమీరిన హింసావాదంతో కూడుకున్నదని, మత్తు పదార్థాలను అమ్మగా వచ్చిన డబ్బుతో ఇది కొనసాగుతున్నదని ఆరోపిస్తున్నవి.

**పెరూ విప్లవ ఆవిర్భావం, అభివృద్ధి :**

500 సం॥లకు పూర్వం పెరూలో బానిసత్వ వ్యవస్థతో కూడుకొన్న ఇన్‌కా సామ్రాజ్యం (Inca Empire) ఉండేది. కాని ఈ సామ్రాజ్యం స్పానిష్ దండయాత్రల వల్ల పతనమైంది. స్పానిష్ దేశస్థుల ఫ్యూడల్ వ్యవస్థ ఇక్కడ ఏర్పడింది. చాలా మంది ప్రజలు బానిసలుగా మారారు. కొన్ని వందల సంవత్సరాలు ఇది వలస రాజ్యంగా ఉండింది. తరువాత దీనికి స్వాతంత్ర్యం వచ్చినా అక్కడి పెట్టుబడిదారుల చేతుల్లోనే అధికారం ఉండిపోయింది. దీనిని పి.సి.పి అర్ధవలస,

---

మునిసిబునాయుడు, వీరేశ, మనవాళ్ళయ్య సారాదుకాణదారు రామందాసు.... ఇలా అన్ని పాత్రలలోనూ సాధారణత, సంక్లిష్టత కలిసి ఉండడం గమనించవచ్చును.

ఇదే విధంగా, 'కన్యాశుల్కం' లోని అంకాలూ, రంగాలూ.... ఇటు సాధారణతనూ, సంక్లిష్టతనూ సంతరించుకున్నట్లు గుర్తించడానికి పెద్ద శ్రమ పడనక్కర్లేదు (అది మరోసారి చూద్దాం). అయితే పాత్రల అభిముఖతా, పాత్రలలోని ద్వంద్వ లక్షణాలూ, దృశ్యాలలోని 'వైరుధ్య సంపుటి' మొత్తం జీవితం నుంచి వచ్చినవే. జీవితం కూడా ఒకేసారి సరళంగానూ, సంక్లిష్టంగానూ ఉండడం గమనించవచ్చును. అందువలన 'కన్యాశుల్కం' సంకీర్ణత జీవితపు సంకీర్ణతే.

అర్థ భూస్వామ్య వ్యవస్థగా గుర్తిస్తుంది. పి.సి.పి నూతన ప్రజాస్వామిక విప్లవ లక్ష్యాలను ఈ విధంగా చెబుతుంది.

1. సామ్రాజ్యవాద పెత్తనాన్ని నాశనం చేయడం. ముఖ్యంగా అమెరికా సామ్రాజ్యవాదాన్ని.
2. బ్యూరోక్రటిక్ పెట్టుబడిదారీ వ్యవస్థను నాశనం చేయడం. గుత్త పెట్టుబడిని స్వాధీనం చేసుకొనడం.
3. భూములపై భూస్వాముల ఆధిపత్యాన్ని దెబ్బతీసే, "దున్నేవానికే భూమి" నినాదంతో ఆ భూమిని భూమి లేనివారికి పంచడం.
4. మధ్యతరహా పెట్టుబడిని కొన్ని షరతులకు లోబడి అంగీకరించడం.

పెరూ కమ్యూనిస్టు పార్టీని 1928 లో జోస్ కార్లోస్ మారిటేగ్ (Jose Carlos Maritag) స్థాపించారు. ఇతని ప్రకారం మార్క్సిజం అంటే విమోచనకు వెలుగు చూపే దారి షైనింగ్‌పాత్ (Sendero Lūminoso). మారిటేగ్ మరణం తరువాత పి.సి.పి చాలాకాలం తెరమరుగు అయ్యింది. 1960 లో సోవియట్ రివిజనిజానికి వ్యతిరేకంగా చేసిన మావో పోరాటం వల్ల తిరిగి మార్క్సిజానికి శక్తి వచ్చింది. తరువాత సాంస్కృతిక విప్లవం వల్ల కూడ పార్టీ గొప్పగా ప్రభావితం అయ్యింది.

కామ్రేడ్ గుంజాలో అప్పటి అయాకుచో (Ayacucho) ప్రాంతపు పార్టీ లీడర్. విప్లవ భావజాలాల అనుగుణంగా పార్టీని పునర్‌నిర్మించారు. ప్రజాయుద్ధం చేయడం ద్వారా విప్లవకర శక్తిని అభివృద్ధి చేయడానికి పార్టీ వ్యూహం పన్నింది. ముఖ్యంగా రైతాంగ పోరాటం, పల్లెల ద్వారా పట్టణాన్ని చుట్టుముట్టి వాటిని స్వాధీనం చేసుకొని నూతన ప్రజాస్వామిక రాజ్యాన్ని ఏర్పరచడం దీని ఉద్దేశ్యం.

19:0 లో పార్టీ సాయుధ పోరాటాన్ని ప్రారంభించటానికి ముందు ఒక సంవత్సరంపాటు విస్తృత తయారీలు చేసుకుంది. అన్ని వర్గాల ప్రజల మనోభావాలను తెలుసుకొనుటకు, పెరూ భౌగోళిక పరిస్థితులను అర్థం చేసుకొని ఏ భాగం నుండి సాయుధ పోరాటం ప్రారంభించాలో తెలుసుకొనుటకు పార్టీ సర్వే కార్యక్రమాన్ని చేపట్టింది. పార్టీ ఒక మిలటరీ స్కూల్‌ను కూడా స్థాపించింది.

1980 మే, 17 నాడు అయకుచో ప్రాంతపు 'చూసి' (Chushi) గ్రామంలో

బ్యాలెట్ బాక్సులను స్వాధీనం చేసుకొని దగ్ధం చేయడం ద్వారా ప్రజాయుద్ధం ప్రారంభం అయ్యింది. మొదట సాయుధ పోరాటం కొంతమంది అనుభవం లేని కార్యకర్తలతో మొదలైనా 1982 డిసెంబర్ కల్లా పెరూ మిలటరీతో యుద్ధంచేసే స్థాయికి పార్టీ చేరుకున్నది.

1983 లో ఏర్పడ్డ పీపుల్స్ గెరిల్లా ఆర్మీ (People's Guerilla Army) పార్టీలో గుణాత్మక మార్పు ఏర్పడడానికి చాలా దోహదపడింది. కొన్ని దళాలలో ఎక్కువగా స్త్రీలే ఉండేవారు. చాలా ఎక్కువమంది స్త్రీలు పార్టీలోకి రావడం వల్ల లీడర్ల స్థాయికి ఎదిగారు. పి.జి.ఎ దళాలు ఇద్దరి కమాండ్ కింద పనిచేస్తాయి. ఒకరు మిలటరీ లీడర్. పోరాట సమయంలో ఇతని మాట ముఖ్యం, ఇంకొకరు పొలిటికల్ లీడర్. ఇద్దరు కూడా పార్టీ మెంబర్స్. కాని పొలిటికల్ లీడర్ మొత్తం దళానికి బాధ్యుడు.

1986 అంతాని కల్ల ప్రజాయుద్ధం కొత్త దశలోకి అడుగు పెట్టింది. బేస్ ఏరియా (Base Area) తయారు చేసుకోవాలనే పథకం 1989 కల్ల పూర్తి అయ్యింది. "దేశవ్యాప్తంగా పట్టు సాధించాలంటే బేస్ ఏరియాను అభివృద్ధి చేసుకో" అన్న నినాదాన్ని పి.సి.పి ఇచ్చింది. వ్యూహాత్మక ప్రతిఘటన నుంచి వ్యూహాత్మక సమతాస్థితికి పార్టీ అభివృద్ధి చెందింది. ఇప్పుడీ పార్టీ వ్యూహాత్మక దాడి స్థాయికి చేరుకుంది.

1980 నుంచి ఇప్పటివరకు 30,000 మంది 'పెరూ' పౌరులు చనిపోయారు. దీనిలో ఎక్కువమంది పల్లెలను భయభ్రాంతులను చేయడంకోసం పెరూవియన్ సైన్యం చేసిన దాడులలో చనిపోయిన సామాన్య పౌరులు. ప్రజాయుద్ధం మొదలు పెట్టినప్పటి నుంచి పి.జి.ఎ 2,00,000 కంటె ఎక్కువగా సాయుధ చర్యలను చేపట్టింది.

1982 చివరిలో భూస్వామ్య వ్యవస్థ నాశనం అయిన తరువాత రైతులు భూమిని పంచుకుందామని అనుకొన్నప్పుడు ప్రజా కమిటీలు ఏర్పడ్డాయి. నూతన వ్యవస్థ ఏర్పడ్డానికి అవసరమైన మిలిటరీ రాజకీయ శక్తులు సరిపోనందున అప్పుడే భూములను పంచడం సరియైన చర్య కాదని పి.సి.పి భావించింది.

భూస్వాముల నుంచి ఆయుధాల ద్వారా స్వాధీనం చేసుకున్న పంటలను

పంచడానికి కూడ ప్రజా కమిటీలు ఏర్పడ్డాయి. తొందరలోనే ఈ కమిటీలు ఇతర విధులను అంటే జూదాన్ని, డ్రగ్స్‌ను, మద్యపానాన్ని, అదృష్టం చెప్పడాన్ని నిషేధించాయి. ఇంకా ఆడవాళ్ళని కొట్టే వారిపై చర్య తీసుకోవడం వరకు కమిటీల విధులు విస్తరింపబడ్డాయి.

ఈ కమిటీలో 5 మంది సభ్యులు ఉంటారు. వీరిని కమీషనర్లు అంటారు. ఈ కమీషనర్లు గ్రామ సంఘాల బాధ్యులచే ఎన్నుకోబడుతారు. వారి విధులు ఏమి టంటే- కొత్త రాజకీయాలను, కొత్త ఆర్థిక వ్యవస్థను, కొత్త సంస్కృతిని ఆయా ప్రాంతాలలో ప్రవేశపెట్టడం.

పట్టణాలు శత్రువుకు కూడా బలమైన స్థావరాలు, రాజకీయ కేంద్రాలు కాబట్టి అక్కడి పి.సి.పి విప్లవ ప్రజల ప్రతిఘటనోద్యమాన్ని (Revolutionary People's defence movement) ను స్థాపించింది. దీని విధులు ఏమిటంటే, ప్రజా ఉద్యమాల ద్వారా ప్రజలను సమీకరించి రాజ్య యంత్రాంగాన్ని కూల గొట్టడం.

పి.సి.పి పట్టణాలలో యూనిట్స్ ఆర్గనైజ్ చేస్తుంది. యూనిట్స్ ముఖ్యంగా పేద ప్రజల నివాస ప్రాంతాలలో పని చేసేవి. వివిధ వర్గాల ప్రజల వరకు, విద్యార్థులు, మేధావులు, కార్మికులు, స్త్రీల వరకు ఈ యూనిట్స్ వెళ్ళేవి. ఈ యూనిట్స్ దేశంలో జరుగుతున్న సాయుధ పోరాటానికి సహాయం చేయడమే కాకుండా అవసర మైనప్పుడు కొన్ని నిముషాలలోనే సాయుధ దళాలుగా తయారు అయి మెరుపు లాంటి ర్యాలీలను తీసి ప్రభుత్వ భవనాలను, ఇతర టార్గెట్‌లను ధ్వంసం చేస్తాయి. దీనిని సాయుధ మూసివేతలు (Armed shuut dours) అంటారు.

లిమా (పెరూ రాజధాని) వంటి పెద్ద పట్టణాల చుట్టూ పేదరికం తొందరగా పెరుగుట వల్ల దరిద్రపు వలయాలు (Rings of Poverty) గా తయారు అయి పెద్ద పట్టణాల చుట్టూ తన ఇనుప బంధనాలను బిగిస్తుంది.

పెరూ ఆర్థిక వ్యవస్థ పతనావస్థలో ఉంది. విదేశీ అప్పు సుమారుగా 22 బిలియన్ల డాలర్లు. ఈ మొత్తం పెరూ దేశంలో ఒక సంవత్సరం మొత్తం ఉత్పత్తికి సమానం. నెలకు 90 మిలియన్లు డాలర్లు పెరూ వడ్డీ మాత్రమే చెల్లి స్తుంది.

అమెరికా, ఐ. ఎం. ఎఫ్. షరతులవల్ల 1990 సం॥లో ఎన్నుకోబడ్డ ప్రెసిడెంట్ "ఫ్యూజిమొరి" (Fujimori) ముఖ్యమైన సరుకులపై సబ్సిడీలను ఎత్తివేసినాడు. నిత్యావసర వస్తువుల ధరలపై కంట్రోల్ తొలగించడంవల్ల కిరోసిన్, బ్రెడ్, మందులు, వంట గ్యాసులు మొదలైనటువంటి వాటి ధరలు కొన్ని రోజుల లోనే 600% పెరిగినవి. బస్సు చార్జీలు విపరీతంగా పెరగడంవల్ల చాలమంది కార్మికులు తమ పనిచేసే స్థలాలకు వెళ్ళలేకపోపుతున్నారు. సుమారుగా పది లక్షల మంది కార్మికులు తమ ఉద్యోగాలు పోగొట్టుకున్నారు. దేశంలో 3 వంతులు దాదాపు 23 మిలియన్ల ప్రజలు పోషకాహార లోపంతో బాధపడుతున్నారు. మనిషి సగటు వయస్సు తరిగి శిశు మరణాలు ఎక్కువైనాయి. అంటువ్యాధులు కూడా ప్రబలి పోతున్నాయి. 1991లో 'లిమా'లో కలరా వ్యాపించడం వల్ల 2,500 మంది చని పోయినారు. 2,03,760 మంది అస్వస్థులు అయినారు. ఇది ఐ. ఎం. ఎఫ్. షరతుల వల్ల పరిశుభ్రతకు సంబంధించిన నిధులపై కోత ఫలితం.

ఎన్నికల బహిష్కరణ: పి.సి.పి. మొదటినుండి ఎన్నికలను బహిష్కరి స్తుంది. ముఖ్యంగా 1989 సం॥ మున్సిపల్ ఎన్నికలు జరుగలేదు. బేస్ ఏరియాలో 1990 సం॥లో జరిగిన అధ్యక్ష ఎన్నికలో 21.2% మంది తమ ఓటు హక్కును వినియో గించుకోలేదు. పోలైన వాటిలో 15.3% మంది బ్యాలెట్ పేపర్‌ను పాడుచేసినారు. ఆయాకుచో వంటి ప్రాంతాలలో 89.3% మంది తమ ఓటు హక్కును వినియోగించు కోలేదు.

పెరూలో ఓటు విధిగా వేయాలి. ఓటు వేయకపోతే అక్కడ శిక్ష విధించు తారు. లేదా పెద్ద మొత్తంలో జరిమాన విధించుతారు. ఈ నేపథ్యంలో పై లెక్క లను చూడాలి. అక్కడి ఓటరు రిజిస్ట్రేషన్ పుస్తకమే జాతీయ గుర్తింపు పత్రం. రిజిస్ట్రేషన్ పుస్తకంలో ఓటు వేసినట్లు స్టాంపు లేకుంటే కనీసం ఉద్యోగాలకు దరఖాస్తు చేసుకోవాలన్నా కష్టమే.

సాయుధ పోరాటంలో 'పెరూ' గణనీయమైన అభివృద్ధి సాధించటం వల్ల అమెరికా మిలటరీ జోక్యం చేసుకోవడానికి విస్తృత ఏర్పాట్లను చేసుకొంటుంది. దక్షిణ అమెరికా, లాటిన్ అమెరికా ప్రాంతాలను తన స్వంత వలసలగా భావిస్తు న్నందున ఇంతకు ముందు అది గ్రెనడా, పనామాలపై దాడి చేసింది.

మాదక ద్రవ్యాలపై దాడి పేరుతో ఇప్పటికే అమెరికా సామ్రాజ్యవాదం హెలికాప్టర్లను, పైలెట్లను, మెకానిక్‌లను పెరూ పంపడం మొదలుపెట్టింది. పనామాపై దాడికి నాయకత్వం వహించిన జనరల్ మాక్స్‌వెల్ థర్మల్ పెరూ, దాని పొరుగు దేశాలపై దాడికి ఎన్నో పథకాలను వేసినాడు. అత్యాధునిక సమాచార వ్యవస్థను నెలకొల్పుకున్నారు.

ఇప్పటికే అమెరికా 34 మిలియన్ల డాలర్లను మిలటరీ చర్యల కోసం విడుదల చేసింది. వియత్నాం పోరాటంలో పాల్గొన్న గ్రీన్ బెరెట్స్ (Green Beretos)ను ఆరు పెరూ బెటాలియన్లతో కూడిన 5,550 మందికి శిక్షణ ఇవ్వడానికి పంపింది. పెరూలోని శాంటిలాషా వద్ద గల అమెరికా స్థావరం అతి పెద్దది. మత్తు పదార్థాల వ్యతిరేక అమెరికా దళం ఈ స్థావరాన్ని నడుపుతుంది.

పెట్టుబడిదారి పత్రికలు షైనింగ్ పాత్ గెరిల్లాలను మత్తుపదార్థాల అక్రమ రవాణాదారులుగా చిత్రీకరించుతున్నాయి. వాస్తవాలు ఏమిటంటే కోకా దేనినుంచి అయితే కోకాయిన్‌ను తయారుచేస్తారో అది పెరూ యొక్క ముఖ్యమైన ఎగుమతి. దీని వలన పెరూకు సాలీనా ఒక బిలియన్ డాలర్ల విదేశీ మారకద్రవ్యం లభిస్తుంది. ఇది మొత్తం ఎగుమతులలో 3వ వంతు. మొత్తం కార్మికులలో 15% మంది ఈ వ్యాపారానికి సంబంధించినవారు. 150 చదరపు మైళ్ళ విస్తీర్ణం గల ఎగువ హువాళ్ళగా లోయ ప్రపంచంలోనే పెద్ద కోకాన్ ఉత్పత్తి చేసే ప్రాంతం.

పెరూ సైన్యం చాలా లంచగొండి సైన్యం. మాదక ద్రవ్యాల అక్రమ రవాణా దారులతో చేతులు కలిపి రైతాంగాన్ని బాధలకు గురిచేస్తుంది. ప్రజల ప్రాణాలను, భూములను, పంటలను రక్షించడం పి. సి. పి. పాలసీ. విప్లవానికి పనికి వచ్చే విధంగా కోకా పంటను పండించే భూమిలో కొంతవరకైనా తిండి గింజలను పండించే టట్లు పి. సి. పి. ప్రజలను చైతన్యం చేస్తుంద. ఈ ఉద్యమంపై పరోక్ష దాడిలో భాగంగానే పాలక వర్గాలు ఈ మాదక ద్రవ్యాలు అనే చర్చను లేవనెత్తాయి.

ఈ పరోక్ష దాడిలో భాగంగా ప్రభుత్వం ధనిక రైతుల సహాయంతో పారా మిలటరీ దళాలను తయారుచేసి ప్రజలపై అనేక దాడులను, మానభంగాలను, లూటీలను చేసి ఈ నేరాలను గెరిల్లాలపై నెట్టుతున్నది. అమెరికా సామ్రాజ్యవాదానికి ఈ విధంగా చేయడం కొత్త కాదు. ఇది ఇంతకుమునుపు వియత్నాం, టర్కీ మొన్నటకు మొన్న కాంట్రాలతో నికరుగ్వాలో చేయించింది.

సామ్రాజ్యవాద వ్యతిరేకులందరూ పెరూలో అమెరికా జోక్యాన్ని ఖండించి అక్కడి ప్రజా పోరాటానికి మద్దతు ఇవ్వడం ముఖ్యమైన అవసరం. సామ్రాజ్యవాదుల చేతుల్లో పావు అయిన ఫిజిమొరో కోర్టును ఒక నెలలో కామ్రేడ్ గుంజాల్‌కి మరణశిక్ష విధించమని అడిగినా జన్మఖైదీని విధించడాన్ని బట్టి చూస్తే ఈ పరిస్థితుల్లో గుంజాల్ రక్తాన్ని చిందిస్తే ప్రజలు షైనింగ్ పాత్ వైపు ప్రజా పోరాటాల వైపు మళ్ళుతారని భయపడి వుండాలి.

చట్టంలో ఉరిశిక్ష లేని పెరూలో న్యాయమైన బహిరంగ విచారణ లేకుండా గోంజలస్‌కు మరణ శిక్ష విధించాలని ప్రభుత్వం ఉవ్విళ్ళూరింది. ప్రపంచవ్యాప్తంగా వచ్చిన ప్రజాస్వామిక ప్రతిఘటనకు కనీసం కోర్టు వెనుకంజ వేసింది. ఇప్పుడు ఆ

## 'నాల్గవ విప్లవ ఖడ్గం!'

పెరూ సాహిత్యంలో కా॥ గుంజాల్‌ని నాల్గవ విప్లవఖడ్గం అని తరుచుగా అంటుంటారు.

పి. సి. పి. మార్క్స్, లెనిన్, మావోలను మొదటి మూడు విప్లవ ఖడ్గాలుగా గుర్తిస్తుంది.

పి. సి పి. మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచన (Marxism, Leninism, Mao Thought) లనే దానికి బదులుగా మార్క్సిజం, లెనినిజం, మావోయిజం అనడం సరియైనదిగా భావిస్తుంది. ఎందుకంటే నేటి సామ్రాజ్యవాద యుగంలో మావో ఆలోచనా విధానమన్నది మార్క్సిజం యొక్క అత్యున్నత రూపం. కాబట్టి మావో ఆలోచనా విధానం ఇజం అనే దశలోకి ప్రవేశించింది. ఆ స్థాయిని సంతరించుకున్నదని పి. సి. పి. భావిస్తున్నది.

నూతన ప్రజాస్వామిక విప్లవం, సాంస్కృతిక విప్లవం వల్ల మావో ఆలోచన (Mao Thought) ఇజాన్ని సంతరించుకున్నదని పి. సి. పి. భావిస్తుంది.

పెరూ పరిస్థితుల కనుకూలంగా వాళ్ళు మార్క్సిజం-లెనినిజం-మావోయిజంకు గుంజాల్ ఆలోచన (Gunjalo Thought) ను చేర్చి Marxism, Leninism, Maoism and Gunjalo Thought (MLMGT) అని పిలుచుకుంటారు.

పుస్తక సమీక్ష :

# ఎందుకిలా మిగిలేం ?

—కె. వి. ఆర్.

చలసాని ప్రసాదరావుగారి 'ఇలా మిగిలేం' చదవడం పూర్తి అయ్యాక బాధతో గూడిన నిట్టూర్పు నాలోంచి వెలువడింది నాకు తెలీకుండానే. గతకాలం సినీమా రీలులాగా మనోనేత్రం ముందు తిరగసాగింది. గ్రంథకర్త ఇచ్చిన ఉదాహరణల్లాంటివి మరెన్నో స్ఫురించాయి. వాటి నన్నింటినీ ఏకరూ పెట్టవచ్చుగాని, పెట్టి లాభం లేదనిపించింది. ఒక్క ఉదాహరణ మాత్రం ఇస్తాను :

తెలంగాణా రైతాంగ సాయుధ పోరాట నాయకులలో బద్దం ఎల్లారెడ్డి ఒకరు. ఒకమారు నేనూ, మరో మిత్రుడూ ఎల్లారెడ్డిగారి అల్లుడితో పనివుండి వారి ఇంటికి వెళ్ళడం తటస్థించింది ఎల్లారెడ్డి తందర బిందర లాడుతూ కనిపించారు. ఫోను రింగ్ చెయ్యడంలో పూర్తిగా నిమగ్నులై వున్నారు. పదిహేను నిమిషాల కాలంలో ఏడెనిమిది సార్లయినా రింగ్ చేసి ఉంటారు. ఏదో జరూరు పని అయివుంటుందను కున్నాను. కాని, అలాంటిదేమీ కాదు; గవర్నరు శాసనసభ్యులకూ తదితరులకూ ఇవ్వబోతూన్న డిన్నర్ పార్టీకి ఆహ్వానం కోసమే ఎల్లారెడ్డి తాపత్రయం అంతా ! ఇది తెలిశాక నివ్వెర పోవడం మిగిలింది. నా మిత్రుడూ నేనూ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నాం. మాకు తెలీకుండానే మా పెదాలమీద చేదు చిరునవ్వు మొలిచింది.

---

విప్లవకారుణ్ని- జైళ్ళు మార్చే సందర్భంలోనో, కోర్టుకు తీసుకవెళ్ళేపుడో తప్పించుకోవడానికి ప్రయత్నం చేసాడనో, బయట వున్న విప్లవకారులు తప్పించే ప్రయత్నం చేసారనో, జీవితాంతం శిక్ష భరించలేక ఆత్మహత్య చేసుకున్నాడనో, జబ్బుపడి మరణించాడనో చెప్పి పెరూ ఫాసిస్టు ప్రభుత్వం హత్యచేసే ప్రమాదం వుందని, అందువల్ల ప్రపంచవ్యాప్తంగా విప్లవ శక్తులు, ప్రజాస్వామిక శక్తులు అప్రమత్తంగా ఆయన విడుదల కోసం డిమాండు చేయాలని జస్టిస్ కృష్ణయ్యర్ తదితర ప్రజాస్వామ్య వాదులు విజ్ఞప్తి చేసారు. బయటి నుంచీ గానీ, పెరూలో గానీ ఏ నిజ నిర్ధారణ కమిటీని అనుమతించని పెరూ ప్రభుత్వ నిరంకుశ వైఖరి నేపథ్యంలో ఈ అనుమానం సహజమైందే.

'జనగామా సింహం' నల్లా నర్సింహులు నెహ్రూ భ్రమలో పడ్డారంటేనూ, రావి నారాయణరెడ్డి "శుద్ధ మితవాదిగా పరిణమింపారంటేనూ, 'బొంబాయి ప్రసాద్' జిల్లేళ్ళమూడి అమ్మకు భక్తుడయ్యాడంటేనూ, కాట్రగడ్డ రాజగోపాలరావు మొదట వంగవీటి మోహన రంగారావుకూ, తర్వాత రత్నకుమారికీ అంతరంగిక సలహాదారు అయ్యాడంటేనూ, కుందుర్తి, సోమసుందర్, ఆరుద్ర వంటి ఆలనాటి అభ్యుదయ కవులలో పెడధోరణి పొటమరించడం వింత గొలపదు. 'విశాలాంధ్ర' పత్రిక సైతం అడ్వర్టయిజ్మెంట్లకు ఎగబడవలసి వచ్చిన పరిస్థితిలో గ్రంథకర్తతో 'చంద్రంగారు' [మద్దుకూరి చంద్రశేఖరరావు] చెప్పిన మాటలు ఆలోచించదగినవి.

"మన పార్టీ బాగా అభివృద్ధి చెందింది. చెందుతోంది.... మధ్యతరగతివారు కూడా పార్టీ వైపు ఆకర్షితులవుతున్నారు. ఇలాంటి పరిస్థితిలో పూర్వంలా మరీ మడిగట్టుకు కూర్చోగూడదు".

ఈ "అభివృద్ధి" దశ ఎప్పుడు మొదలైనట్టు? మీరట్ కుట్రకేసు దరిమిలా నిషేధానికి గురై అజ్ఞాతవాసం గడుపుతూ వచ్చినంతకాలం కమ్యూనిస్టు పార్టీ ఎన్నో పుటాలు పడింది: వన్నెదేలింది: పటిష్ఠమయింది. ఏ సంస్థ జీవిత క్రమంలోనైనా కనిపించే శుద్ధ దశ (Age of Innocence) లాంటి దాన్ని వెనక విడిచి, 1943 తర్వాత పార్టీ సంఖ్యా బలం రీత్యానూ, కార్యకలాపాల రీత్యానూ విస్తరించడం మొదలైంది. ప్రజా నాట్యమండలి, అభ్యుదయ రచయితల సంఘం, మరి ప్రజా సంఘాలూ అస్తిత్వంలోకి వచ్చాయి. మధ్య తరగతివారి సానుభూతి సహకారాలను పొందగలిగాయి. మళ్ళీ తెలంగాణా పోరాటం సాగినంతకాలం, అరణ్య, అజ్ఞాత వాసాలు ప్రాప్తించి పార్టీ తాలూకు లోహం దృఢతరం అయింది. త్యాగ సంప్రదాయం వ్యక్తిగత ఆస్తుల దగ్గర నుంచి అమూల్యమైన ప్రాణాలను పరిత్యజించేదాకా శిఖరాన్ని అధిరోహించింది. కేవలం అవసరం కొద్దీ గాక, ఆదర్శబలం కొద్దీ మాత్రమే పార్టీ నాయకులూ, సభ్యులూ నిరాడంబరమైన సరళ జీవనాలకు అలవాటు పడ్డారు. జీసస్ క్రీస్తు శిష్యులు జీవించినట్టుగా జీవించి ప్రజల్లో తమపట్ల సదభిప్రాయం కలిగించుకున్నారు. పార్టీకి అది బాగా లాభించింది. మరి తెలంగాణా పోరాటం తమ దుస్తులకు కస్తూరి వాసన పట్టించింది. తమ పట్ల ప్రజలకు గురి ఏర్పడింది: అభిమానం పెరిగింది. ఆ పోరాటానికి వెన్నుపోటు పొడుస్తూ పోరాట విజయాలను అక్షరాలా కాకులకూ గద్దలకూ విడిచిపేసి పార్లమెంటరీ పంథా చేపట్టిన తర్వాత

కొంతకాలం వరకు వెనకటి ప్రజాభిమానం కొనసాగింది. దళిత వర్గాల వాళ్ళేగాక, సన్నకారు రైతాంగం, మైనారిటీలైన ముస్లిములూ, క్రైస్తవులూ, ఇంకా మధ్య తరగతిలో కూడా ఒక గణనీయమైన భాగం ఎన్నికల్లో పార్టీకి అండదండ లిచ్చారు. పార్టీ మీద ఆశలు పెట్టుకున్నారు. కాని, పార్టీ ఏం చేసింది ?

విప్లవ లక్ష్యాన్ని పేరులో మాత్రమే నిలుపుకుంది. పార్లమెంటరీ ఊబిలో చిక్కుబడిపోయింది. నేతి బీరకాయలోని నేయిలాగా కాంగ్రెసు పార్టీలో అభ్యుదయం చూడబోయింది. మొదట నెహ్రూ విదేశాంగ విధానానికీ తర్వాత అంతరంగిక విధానానికీ హర్షా మోదాలతో కరతాళ ధ్వనులు చేయసాగింది. ఈ క్రమం పర్యవసానంగా కాంగ్రెసు పాటకు వంతగా మారింది. అంటే, ప్రజా ద్రోహానికి పూనుకుంది. పోరాట సంప్రదాయానికి గుడ్‌బై చెప్పింది. సంస్కరణ వాదాన్ని బుజాన వేసుకుంది. రివిజనిజాన్ని వరించింది. పార్లమెంటరీ 'ప్రతిపక్ష' పార్టీలలో ఒకానొకటి మాత్రమే అయింది. 'కమ్యూనిస్టు' శబ్దాన్ని అగౌను చేసింది. మరి, 'చంద్రంగారి' అంచనా నిజం ఎలా కాదు ? అయితే ఆయన చెప్పిన మాటల్లోని అంతరార్థమే మనకు కావలసింది. ఆయనగారి "అభివృద్ధి" నిజానికి తద్వ్యతిరేకమే— వాపూ బలుపూ వేర్వేరైనట్టు.

ఇక్కడ ఒక మౌలికమైన ప్రశ్న తలెత్తుతుంది, క్షమించాలి: ఈ మన దేశంలో ఏర్పడిన కమ్యూనిస్టు పార్టీ ఎన్నడైనా నిజంగానే శ్రామిక వర్గ (ప్రోలిటేరియన్) పార్టీయేనా ? సిద్ధాంతం దగ్గరకి వస్తే మాత్రం ఈ ప్రశ్న పత్తిదూదిలా ఎగిరిపోవచ్చు. ఎందుకంటే, శ్రామిక వర్గానికి అగ్రగామిదళమే [వేన్‌గార్డ్] కమ్యూనిస్టు పార్టీ అంటే. అంతేగాని, శ్రామికులు మాత్రమే ఆ పార్టీ నిండా వుంటారని గానీ, శ్రామికులే పార్టీ నాయకత్వ స్థానాలన్నిటా వుండాలని గానీ ఏ రూలూ లేదు. విప్లవకర వర్గమే అయిన రైతాంగం నుంచి కూడా పార్టీ సభ్యులూ నాయకులూ ఉండవచ్చు. అలాగే మధ్యతరగతి కింది భాగం నుంచి కూడా. బాగుంది. కాని, శ్రామికేతర వర్గాల నుంచి పార్టీ సభ్యులుగా వచ్చినవారికి శ్రామిక వర్గ స్వభావం అలవడాలి. అంటే, తాము పుట్టి పెరిగిన వర్గాల తాలూకు స్వభావాన్ని ప్రయత్నపూర్వకంగా వదులుకోవాలి. ఇదే 'డీ క్లాస్' కావడమంటే. ఇది మాటలతో జరిగే పనిమాత్రం కాదు. వేషధారణ కూడా దీనికి బాహ్య నిదర్శనం కాదు. ఒకడు దరిచేసిలాగా, సాధు సన్యాసిలాగా కనిపించవచ్చుగాని వాడి అంతఃకరణ ప్రవృత్తి మాత్రం వేషానికి

భిన్నంగా ఉండవచ్చు. కమ్యూనిస్టన్నవాడు శ్రామిక వర్గ స్వభావాన్ని అలవరచు కోవాలి, తప్పదు.

మన కమ్యూనిస్టు పార్టీ ఏర్పడిన అప్పుడు గాని, మరొకప్పుడు గాని, శ్రామిక వర్గం నుంచి సభ్యత్వం, నాయకత్వం పొందినవాళ్ళు దాదాపుగా లేరనవచ్చు. ఉండే అవసరం కూడా లేదు. కాని, గ్రామాల్లో ధనిక రైతు కుటుంబాల నుంచి, పట్నాల్లో పెటీ బూర్జువా సెక్షన్ల నుంచి అధిక సంఖ్యలో సభ్యత్వాన్నీ నాయకత్వాన్నీ పొందినవాళ్ళలో ఎందరు శ్రామికవర్గ స్వభావాన్ని అలవరచుకొన్నట్టు— అంటే, డీక్లాస్ అయినట్టు ? అలా కానప్పుడు, కాజాలనప్పుడు, పార్టీకి శ్రామికవర్గ స్వభావం ఎలా కలుగుతుంది? రాజీలేని వర్గపోరాట పంథాలో పార్టీ ఎలా పురోగమించ గలుగుతుంది ? మాటల్లోగాక, ఆచరణలో విప్లవాభిముఖమైన పురోగమనం ఎలా సాధ్యమవుతుంది? రివిజనిజం గ్రహణం దరిజేరనీకుండా మార్క్సిజం—లెని నిజం ఎలా శాస్త్రమూ శస్త్రమూ కాగలుగుతుంది ?

మన కమ్యూనిస్టు పార్టీ చరిత్ర మొత్తానికే ఉజ్వల శోభ నిచ్చిన తెలంగాణా పోరాటానికి స్వస్తి చెప్పారంటే ఆశ్చర్యంలేదు. రెండు దశాబ్దాలుగా సాగిన మునగాల పరగణా జమీందారీ వ్యతిరేక పోరాటానికి గూడా, ఏ కారణంవల్లనైతే నేమి, నీళ్ళు వదిలారు. చివరకు, వీళ్ళకు మిగిలిన పోరాట—రూపాలు ఏమిటంటే, మహా విజ్ఞాపన పత్రాలు, పార్లమెంటరీ చర్చలు, ధర్నాలు, సంతకాల సేకరణలు, గట్రా, ఎట్సెట్రా. వేరే కుళ్ళింది. సురభిళ పుష్పాలూ, స్వాదుఫలాలూ ఎక్కడినుంచి వస్తాయి ?

"మనమే కమ్యూనిస్టు పార్టీ అనే దానికి జీవధాతువైన వర్గచైతన్యాన్ని కోల్పోయామా ?"

"పార్టీకి ప్రాణమయిన వర్గ సంబంధాల్ని విస్మరించడమేనా ?"

చలసాని ప్రసాదరావుగారి ప్రశ్నలు ఇలాంటివి ఆశ్చర్యార్థకంగా నిలిచినా వింతలేదు. అమాయకమైన ఆయన బాధ మనకూ విస్తరిస్తుంది. అయితే ఇది ఎవరో కొందరు వ్యక్తులకు మాత్రమే పరిమితమైన విషయం కాదు. వ్యక్తి విశేషాలుగా పైకి కనిపించే ఇలాంటి చిన్న చిన్న అంశాలు వెనక మొత్తం పార్టీ వైఫల్యం విషాదకర పూర్ణాంకంగా నిలిచివుంది. వ్యక్తిపరమైన లోపాలనైతే సరిదిద్దవచ్చు నేమో, 'హౌ టు బి ఏ గుడ్ కమ్యూనిస్ట్', చదివి వల్లించి కాని అసలు లోపాన్ని సరిదిద్దాలంటే ఎలా సాధ్యం ? కట్టె వంకర పొయ్యి తీరుస్తుంది-తీర్చాలి.

అలా తీర్చనప్పుడు, మనం ఇలాగాక, మరెలా మిగలగలం ?

సాహిత్య లేఖ :

## సాహితీమిత్రులకు

నమస్తే, వారం వారం కట్టలు కట్టలు కవితలు పోస్టు చేస్తున్నాను 'సృజన'కు. కాని ఏనాడూ పత్రిక బాగోగుల గురించి 'బాధ్యత'గా ఒక వాక్యమూ రాయలేదు, ఇదీ నాలో ఉండకూడని Selfish element యొక్క minute reflection యేనేమో అని బెంగపడ్డాను. పైగా సహజంగా శత్రువు Ideological, Cultural, literal fronts లో full అఫెన్స్‌లో దాడి చేసినప్పుడల్లా మీ మీద విపరీతంగా కోపం వస్తుంది, "ఏం చేస్తున్నార"ని, ఆ హక్కు నాకుంటే 'సృజన' పట్ల మీ ఆచరణని సమీక్షించాల్సిన బాధ్యతా నాకు అంతే ఉంటుంది కదా! పత్రికలన్నీ ముందు పెట్టుకొని చేద్దామనుకుంటూ ఇంత లేటయింది అందుకని ఈ 2 A.Mకి నేను అప్పుడప్పుడు సృజన గురించి అనుకున్నవి రాసి పడుకుందామని లేచాను. ఇప్పటి కయితే జనరల్ విమర్శే! పుస్తకాలు లేవు కనుక (సృజనలతో మరోసారి) ముందుగా సంపాదకీయాల గురించి, మునపటి లాగానే ప్రభుత్వ స్వరూప స్వభావాల్ని (in action) చర్యల్నీ నిర్వహిస్తున్న వ్యక్తుల ఆలోచనల్ని, అట్లాగే విప్లవోద్యమం పట్ల తీసుకుంటున్న వైఖరి వెనుక ఉన్న కారణాలనీ సరిగ్గానే, చాలాసార్లు లోతుగానే వివరించింది. అట్లాగే Political Economyనీ వివరించింది. అయితే విప్లవోద్యమాన్ని శత్రువు విభిన్న కోణాలనుంచి శ్రద్ధగా అధ్యయనం చేసాడు. అన్నింటిని సృజన పట్టుకోలేకపోయింది. సత్యమూర్తి ఏదయితే "ఆర్థిక పోరాటాలు" అన్నాడో

---

("ఇలా మిగిలేం"
—చలసాని ప్రసాదరావు-రచన
140 పేజీలు – రూ. 15/-
ప్రచురణ : పర్‌స్పెక్టివ్స్, హైదరాబాద్
సోల్ డిస్ట్రిబ్యూటర్స్ : నవోదయ బుక్‌హౌస్,
ఆర్యసమాజ్ ఎదురుసందు, కాచిగూడ
హైదరాబాద్-500 027)

అవి అలాగే ఉంటే శత్రువు ఇంత గాఢరాపడకపోను, Class struggle లో Participate చేయడం People responsibility గా స్వీకరించారు. ఈ కోణం అంతగా Reflect కాలేదు. అట్లాగే Repression విషయంలో 'మద్యపాన నిషేధం' భూస్వాముల పట్టాభూముల ఆక్రమణ పాత్రను తడిమింది కానీ, అట్టడుగు వర్గాలు విప్లవంలో కీలకమైన పాత్ర వహిస్తుంటే వాళ్ళను Lumpen Sectionsగా REC మేధావులు సైతం Comment చేస్తే ఆ పరిణామాన్ని "సృజన" వివరించలేదు. New Economical, Industrial Policy రేపు రేపు దేశాన్ని ఏం చేయబోతోంది ప్రజలకు వివరించాలని సృజన ఎక్కువగానే తపన పడింది, అయితే ఇంకా "ఆచరణాత్మకమైన వివరణల్ని"ని Expect చేసాను. "ముద్రారాక్షస"ది సంపాదకీయంగా వెయ్యాల్సిన స్థాయి లేదని అనిపించింది. మీలో చాలామంది దాని కన్నా బాగా రాయగల్రు ఇక్కడి బడా బూర్జువాల "జీర్ణశక్తి" పెరగడం వల్ల కూడా ఈ మార్పులు వచ్చాయన్న విషయం వివరంగా చెప్తే బావుండు. కొన్ని సంఘటనల మీద Editorial వస్తుందనుకుంటే రాలేదు. ఉదాహరణకు Los Angels పరిణామాలపై, American Imperialism ఇప్పుడు ఉన్న దశలో దానికి చాలా లోతైన అర్థమే ఉంది కదా! Washington Post సంపాదకీయంలో (ఆ సంఘటనలపై) నల్లవాళ్ళకు నైతిక విలువలు లేవనీ, పెంపకం సరిగ్గా ఉండదనీ, అసలు ఆ పుర్రెల్లోనే క్రౌర్యం ఉందనీ, ఎక్కువమంది "లంజకొడుకులే"నని రాసింది. మనమూ నల్లవాళ్ళమేగా! కనీసం వ్యాసమైనా రాయించాల్సింది! ఆఫ్రికాలో ఇప్పుడు జరుగుతున్న పరిణామాల్నీ, జర్మనీలో జరిగిన National Wide General Strike ని ఇప్పటికీ మీరు వ్యాసరూపం ఇవ్వొచ్చు.

వ్యాసాలు : సోషలిజం మీద చర్చ చాలా ఉపయోగకరమైనది. చాలా వ్యాసాలు అవసరమైనవే! కార్మికులు సృజన చదువుతున్నారన్న విషయం ప్రతి వ్యాసకర్తకీ గుర్తు చెయ్యండి. Not too hard but still....J.C. వ్యాసాలు మళ్ళీ మళ్ళీ చదివాను. ఒక మిత్రుడు ఆ సందర్భంలో నన్ను ఏమయ్యా "సాహితీమిత్రులు" మీద కోపం పోయిందా? అన్నాడు నాతో. అప్పుడు అవి చాలా అవసరమైనవి. టాబ్లెట్లు బాగానే పని చేసాయి. కాని Allopathy మందయిపోయినట్టు ఉంది, Extra Dosages అవసరం, ప్రకృతి వైద్యమయితే మరీ మంచిది.

కథల మీద బాగానే శ్రద్ధ తీసుకున్నారు. చాలా కథలు చదివిన తరువాత అవి నన్ను "కథలు రాయిర చై కవితల మీద పడ్డవు" అని మందలించినట్టు కూడా అనిపించింది. కథలు చాల టైమ్ తీసుకుంటది రాయాలంటే, కవితలైతే సైకిల్ మీద

గూడా రాయొచ్చు. సీరియస్‌గా ప్రయత్నిస్తాను. (మర్చిపోతానేమో, ఇక్కడే రాస్తాను సావిత్రక్క Life Significance మంచిగ వివరిస్తూ జోహార్లు చెప్పాలి. ఈశ్వరక్క సావిత్రక్క Life styles లోనూ, ఆలోచనా విధానమూ చాలా గొప్పవి.)

ఇక కవితల గురించి.... ఒక మిత్రుడు అన్నాడు. "ఏమంట నువ్వు వచ్చినవో.... ఇప్పుడు సృజన రాంగనే కవితల మీద పడుతున్నరు, నోటుబుక్కులు నింపుతున్నరు. మిగితాయి సదుపుతున్నరో లేదో అన్నాడు. Most of the Poems are sincere, real. ఒకోసారి వస్తువుని బట్టి "form" విషయంలో ఉదారంగానే వ్యవహరిస్తారని జ్యోతక్క మీద చార్య కవిత చూసి అనిపించింది. (Frankly, not because of me, పదేళ్ళ వరకు సృజనలో నా కవిత రాక పోయినా పదకొండవ ఏట సైతం ప్రయత్నించే ఓపిక నాకు ఉంది, సృజన Standards కి అనుగుణంగానే Print అవుతాయన్నది జగద్విదితమే కదా! వస్తువుని సరిగ్గా వివరించడంలోనో, form లోనో లోపాలు ఉండటం వల్లే నావి రాలేదని ఖచ్చితంగా By-heart తెల్సు.)

ఇక Complaint's list : 1) సాహిత్య ప్రపంచంలో ప్రజలకు వ్యతిరేకంగా, విప్లవ సాహిత్యానికి వ్యతిరేకంగా అన్ని కుట్రలు జరుగుతుంటే మీరు గట్టిగా ప్రతిఘటించరేందన్నా! మన విప్లవ రచయితలకు అవసరం కదా! స్థలాభావం వల్ల అన్ని ఒలకబొయ్యలేను కాని కనీసం కొన్నైనా రాస్తాను. చేరాతల మీద వేణు(గారు) అరుణతారలోనూ కృష్ణుడు పుస్తకాన్ని సమీక్షించారు. అంతే! సమగ్రంగా వాటిని వివరిస్తూ, వాటి దుష్ప్రభావాల్ని రుజువు చెయ్యొచ్చు కదా! ఎందుకా Soft corner?

ఒకవైపు Revolution Middle Class ని Sweeping గా Uplift చేసే సన్నివేశం రాబోతుంటే Peti Bourgeoise Writers ని ప్రక్షాళన చెయ్యాల్సిన బాధ్యత మన మీద లేదా? పాలూ నీళ్ళు వేరు చెయ్యాల్సిన Time ఇది.

విప్లవ కవిత్వం మీద ఏ పక్షం నుంచి వచ్చినా, వచ్చిన ప్రశ్నల మీద సృజన చర్చ నిర్వహించాలి. లోపాలను ఆత్మవిమర్శ చేసుకుని సరిదిద్దుకుందాం. కుట్రలను బలంగా తిప్పికొడదాం.

ఎక్కడెక్కడి బండలన్ని మా నెత్తిమీద వేసినవేమయ్యా అనొద్దు మీరు. సృజన విప్లవ సాహిత్యోద్యమానికి ప్రతీక. అందుకని మీకు తప్పక ప్రతి చిన్న విషయం మీద బాధ్యత ఉంటుంది. Most of the times, your silence is not only misunderstood but also misinterpreted. So, please "BE IN ACTION, SPONTANEOUSLY ALWAYS"

అందరి అక్షరాలు ప్రజల ముందు తేటతెల్లంగానే ఉంటాయి. శిక్షల్ని మనం స్వీకరించక తప్పదు. As I wrote in my last letter, workers are entering the arena.

నేను స్వయంగా రాసాను ఒక కవితలో, కవిత్వీకరించాలి వాక్యాన్ని అన్న దుగ్దలో మొన్న మహిళా కార్మికులు గురించి "అలవోకగా కుప్పగొడ్తూ వడ్ల వర్షంలో తడిసిన చేతులకు" ఎత్తుకున్నాను. ఎంత భయంకరమైన పొరపాటు! కుప్పగొట్టుడు "అలవోకగా" ఉంటదా? నేను కుప్పగొట్టిన దృశ్యం తల్చుకున్న తరువాత తెల్సిరాలే ఎంతకష్టమో అది! అది కనీసం "అప్పుడో ఏడాదీ, ఇప్పుడో ఏడాది అయినా" అని మార్చాలి. అందుకని మీరు చెక్ చేసుకోండి సాహితోద్యమాన్ని చెక్ చేయండి.

అట్లాగే ఈ "నేను" కవితలు గురించి నిజంగ సిగ్గనిపిస్తది. ఇట్ల రాయాలంటే కాని మా గురించి ఒక వికృత haphazard చిత్రాన్ని Expose చేస్తున్నందుకు వ్యక్తిగతమైనవీ రాయాలనిపిస్తుంది. మరొకవైపు "నేను" అన్న పదం నిషేధించు కోకపోతే కార్మికవర్గ పుత్రుడ్ని కానేమో, మొత్తం ప్రజల గురించి, ఉద్యమం గురించే రాయాలేమో అనిపిస్తది. విప్లవ కవిత్వం మీద ఈ కోణంలోనూ చర్చ చేయాలి.

మాకు అప్పజెప్పిన బాధ్యతలు "నువ్వెందుక తీసుకోవు" అన్న ఒక ప్రశ్న నా వైపు వేలు చూపిస్తూ ఉంటుంది. నిజమే. తప్పకుండా కృషి చేస్తాను.

కొన్నాళ్ళు క్రింద కవిత్వం రాయడమే మధ్యతరగతి చైతన్యానికి చిహ్నం అని బందు పెట్టుకొని పనిలో పడ్డాను. May 5 సుప్రభాతం తరువాత మధ్యతరగతి ప్రజల్ని కవిత్వం ద్వారా రెగ్యులర్‌గా చేరుకోవాలని తీర్మానం చేసుకున్నాను. అట్లాగే కథలు రాయడానికి సీరియస్‌గా ప్రయత్నిస్తాను. I shall "create" time for literature. "రాజ్యం" అన్ని రంగాలలోనూ దాడి చేస్తది. తప్పదు అని చేతులు ముడుచుకొని కూర్చోను. ఇక్కడ కవులం కళాకారులం తయారవుతాం.

సంవత్సరంన్నర క్రింద విరసంను నిషేధిస్తే ఎట్లా? అని ఒక సభ్యున్ని అడిగాను. "ఏం చేస్తాం ఊరుకుంటం" అన్నాడు. అది వాస్తవం కాకూడదని ఆకాంక్షిస్తూ సృజన సజీవంగా నిర్భీతితో వ్యవహరించాలని కోరుతూ (పైన నేను వ్యక్తపరచినవి కరక్టే అనుకోవటంలేదు. తప్పుడు అవగాహనయైతే దిద్దుకుంటాను.)

మీ

28 జూన్ '92 M.S.R.

(Surely, a last letter from M.S.R)

(4వ పేజీ తరువాయి)

సమాజాల్లో ఈ దేవుళ్ళూ, ఋషులూ, పురోహితులూ, రాజులూ - శాపాలూ, వరాలూ, యజ్ఞాలూ, యుద్ధాల పేరుతో కష్టజీవులైన ప్రజలపై ఎంత అణచివేతను, హింసను అమలుచేసారో ప్రజల అనుభవానికి తెలియంది కాదు.

ఒక దశాబ్దంగా-ముఖ్యంగా పంజాబ్‌లో బ్లూస్టార్ ఆపరేషన్ కాలంనుంచీ ఇవ్వాళ బాబ్రీమసీద్ కూల్చివేత దాకా హిందూ మతోన్మాదం ప్రత్యక్షంగా రాజకీయాల్లో ఒక విధ్వంసకర సాధనంగా పని చేస్తున్నది. ఇందిరాగాంధి హత్య తరువాత ఢిల్లీ మొదలుకొని దేశంలో పలుచోట్ల వేలాదిమంది సిక్కుల ఊచకోత (అప్పుడు హోంమంత్రి పి. వి. నర్సింహరావని మర్చిపోకూడదు), 1990 డిసెంబర్‌లో హైదరాబాద్ నగరంలో మతంపేరిట మారణహోమం - ఈ మతకలహాలు వోట్లు తెచ్చుకునే, సీట్లు కాపాడుకునే లేదా పోగొట్టే మార్గాలయినవని స్పష్టం చేస్తున్నాయి. బాబ్రీమసీదు కూల్చివేసేదాకా లక్షలాదిమంది "కరసేవ"కులను అనుమతించి, అద్వానీ, జోషీ, సింఘాల్ వంటివాళ్ళను రెచ్చగొట్టే ప్రసంగాలు చేయనిచ్చి, స్వయంగా పోలీసు మిలట్రీలను కూడా "కరసేవ"లో పాల్గొననిచ్చి, తర్వాత కేంద్ర ప్రభుత్వం చేసిందేమిటీ- ఉత్తరప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలన, దేశమంతటా ముఖ్యంగా నగరాల్లో మిలట్రీ, పారా మిలట్రీల మోహరింపూ, వందలాది పట్నాల్లో పోలీసు కాల్పులూ, నిషేధాజ్ఞలు. ఇవన్నీ సెక్యులరిజం పేరిటనైనా, మత సామరస్యం కోసమైనా నిజమైన ప్రజాస్వామ్యవాదులు హర్షించజాలని అప్రజాస్వామిక చర్యలు. సమస్యలకు ప్రజాస్వామిక విధానాల ద్వారా పరిష్కారాలు వెతకడానికి నిరాకరించే ప్రభుత్వాలు ఉన్మాదాన్ని, రాజ్యాంగ యంత్ర ఉన్మాదంతోనే ఎదుర్కోవాలని చూస్తాయ్. ఇందువల్ల దోపిడీ పాలకవర్గాలకు రెండు ప్రయోజనాలు నెరవేరుతాయి. ప్రజల్లో చైతన్య స్థాయి కాకుండా ఉన్మాదస్థాయి పెరుగుతుంది. ఈ ఉన్మాదాన్ని అదుపుచేసే నెపంతో అణచివేత సాధనమైన రాజ్యాంగయంత్రం మరింత బలపడుతుంది.

ఆంధ్రప్రదేశ్‌లో సారా వ్యతిరేక పోరాటంలో ఉద్యమిస్తున్న ప్రజలు ముఖ్యంగా మహిళలు, గ్రామీణ ప్రాంతాల్లో నిషేధాలకూ, నిర్బంధాలకూ, 'ఎన్‌కౌంటర్' హత్యలకూ, పారామిలిటరీ బలగాల కోంబింగ్ చర్యలకూ పోలీస్

క్యాంపులకూ వ్యతిరేకంగా కదులుతున్న, సంఘటితమౌతున్న ప్రజలు, ప్రజాస్వామిక, విప్లవ ఉద్యమాల్లో రాటుదేలుతున్న ప్రజలు శీతకాల అసెంబ్లీ సమావేశాలు ప్రారంభం మయ్యే ఈ రోజు రాష్ట్రమంతటా సభలూ, సమావేశాలూ, ర్యాలీలు నిర్వహించ డానికి వీలులేని నిషేధ పర్వంలో ప్రవేశించారు. మత సంస్థలు ఎలాగూ నిషేధింప బడ్డాయి అవి రహస్య కార్యకలాపాల్లో నిమగ్నమయ్యాయి. ఇంక ఈ నిషేధ ప్రభావం దేటిమీదా ? ప్రజా ప్రదర్శనల మీద. మత సామరస్యం కోసం శాంతి సుహృద్భావాల కోసం, నష్టపరిహారాల కోసం, పునరావాస చర్యల కోసం ప్రదర్శనలు చేయడానికీ, సభలూ, సమావేశాలు పెట్టి చెప్పడానికీ వీలులేదు. రాష్ట్రమంతటా తాండవిస్తున్న కరువు, అధిక ధరలు, నిత్యావసర వస్తువుల కొరత, పెరిగిన విద్యుత్, బస్ ఛార్జీలకు వ్యతిరేకంగా ప్రదర్శనలు చేయడానికి వీలులేదు. గ్రామీణ ప్రాంతం నుంచి ప్రారంభమై ఇవ్వాళ హైదరాబాదు పాతబస్తీదాకా కర్ఫ్యూ సాకుతో కనిపిస్తే కాల్చివేత అజ్ఞలతో విచ్చలవిడి విధ్వంసనానికి పూనుకున్న పోలీసు చర్యల్ని ఖండించడానికి వీలులేదు. అన్నిటికన్నా ముఖ్యంగా కొన్నాళ్ళుగా సాగు తున్న సారా వ్యతిరేక పోరాటాన్ని సమరశీలంగా నిర్వహిస్తే ఇప్పుడది నేరమవు తుంది. నిషేధాజ్ఞలతో, కర్ఫ్యూలతో, పారా మిలట్రీ పహరాలతో పోలీసు బందో బస్తుతో కమెండోల భద్రతతో ఈ రోజు అసెంబ్లీ, 16న పార్లమెంట్ మళ్ళీ ప్రారంభమవుతాయి.

అయోధ్యలో బాబ్రీమసీద్ పునర్నిర్మాణమవుతుందా, అ స్థలంలో గుడీ, మసీదు రెండూ వస్తాయా- అది ఎన్నికల రాజకీయ ప్రయోజనాలను బట్టి ఉంటుంది. కానీ పార్లమెంట్ రద్దవుతుంది. మళ్ళీ ప్రజలమీద ఓపలేని బరువుగా ఎన్నికలు వస్తాయి. మతోన్మాదాల ప్రాతిపదికపై కుల సంకులసమరంగా "మతదాన్" కోసం డబ్బు, సారా, నెత్తుర్లు ప్రవహిస్తాయ్. అమరకవి గోరఖ్‌పాండే చెప్పినట్లు- ఈ సంవ త్సరం మతకలహాల రక్తవర్షం చాలా కురిసింది. ఓట్ల పంట బాగా పండుతుంది. ఈ పంట ఏ జెండా పార్టీకి, ఏ రంగు పార్టీకి పదవీ, అధికారం తెస్తుందని కాదు, ఈ పంట ప్రజల నెత్తికెత్తనున్న గంప అయినప్పటికీ ఇల్లు చేరేది మాత్రం దోపిడీవర్గాల కృత్రిమ ఆకలి తీర్చడానికే. ఇల్లు గుల్లయ్యేది మాత్రం ప్రజలదే. కనుక ప్రజల వివేకం మీద భరోసా పెట్టుకుందాం

14-12-92

— సంపాదకుడు

సంస్మరణ :

# కామ్రేడ్ ఎం. ఎస్. ఆర్. కు జోహార్లు

మాకు శ్రీను పరిచయమయింది 1989లోనే. చిత్రకళ, సాహిత్యం, సినిమాల గురించి మాతో గంటలకు గంటలు చర్చించాలని ఆయనకుండేది. అప్పుడాయన వాసవి ఇంజినీరింగు కాలేజి విద్యార్థి. మా పనుల ఒత్తిడిలో ఆయన ఉత్సాహం చూపినంత వ్యవధి మాకు చిక్కేది కాదు. పాత సృజనలన్నీ తీసుకవెళ్ళి అసాంతం చదివి ఇంక రోజుల తరబడి ఆ అనుభూతులు పంచుకోవడానికి సిద్ధమయి వచ్చేవాడు. ఒక్కసారి పట్టుమని పదినిముషాలు మాట్లాడే అవకాశం కూడా వుండేది కాదు.

ఇరవయ్యేళ్ళ విరసం సభల సందర్భంలో ఆయనతో పరిచయం పనుల్లోనే బలపడింది. జననాట్యమండలి 18వ వార్షికోత్సవాల సందర్భంగా ప్రజా కళల సంచికగా తెచ్చిన సృజనలో ఎం. ఎస్. ఆర్. రాసిన గల్పిక అచ్చయింది. అంతే.

జూన్ 90 తర్వాత శ్రీను మాకు కనిపించలేదు. పోస్టులో రెగ్యులర్‌గా రచనలు వస్తుండేవి. దాదాపుగా అన్నీ కవితలే. అప్పుడప్పుడూ సాహిత్య సంబంధమైన విషయాలమీద ఉత్తరాలు కూడ రాస్తుండేవాడు. కవితల మీద అభిప్రాయాలు కానీ, ఉత్తరాలకు జవాబు కానీ రాయడానికి ఆయన అడ్రసు వుండేది కాదు. ఆయన రచనలో క్రమంగా పరిణతి వస్తున్న విషయం తెలుస్తూనే వున్నది. కాని ఏదో ఒక కారణంవల్ల ఆయన కవితలేమీ వేయలేకపోయాం. ఆయనతో కమ్యూనికేషన్ లేకున్నా ఎంత సరిగా ఈ అంశాన్ని అర్థం చేసుకున్నాడో.

"ఇక కవితల గురించి.... సృజన Standardsకి అనుగుణంగానే Print అవుతాయన్నది జగద్విదితమే కదా. వస్తువుని సరిగ్గా వివరించడంలోనో, form లోనో లోపాలు వుండడం వల్లే నావి రాలేదని నాకు ఖచ్చితంగా By-heart తెలుసు."

ఆశ్చర్యమూ విషాదమూ ఏమంటే జూన్ '92 (200) సంచికకు ఆయన మూడు రచనలు ఎన్నికయ్యాయి. పైన ఉదహరించిన 'సాహితీమిత్రులు'కు రాసిన లేఖతోపాటు 'దృశ్యం చెరిగిపోదు, మచ్చమాసిపోతుంది' కవిత, 'కరుణాకర్' పేరుతో రాసిన పాట. కవిత ఎన్నిక కావడమే కాదు. అందులో ప్రతిపాదించిన ఆత్మ

విమర్శనాత్మక విలువలు, లక్ష్యం, నిజాయితీ వల్ల వచ్చిన సంక్షోభాన్ని వ్యక్తం చేసే శైలి, పశ్చాత్తాపంలోని నిష్కాపట్యం వల్ల రచనలో వచ్చిన తీవ్రత మమ్మల్ని కదిలించాయి. చాల రోజుల తర్వాత అరుదుగా ఇటీవలి కాలంలో ఒక రచనపై ఆసక్తిదాయకమైన చర్చ సా. మి. లో ఈ కవితపైననే జరిగింది. అట్లాగే 'సాహితీ మిత్రులు' కు ఆయన రాసిన లేఖలోని సూటిదనం, విమర్శ, ఆత్మ విమర్శ కూడ మేం కామ్రేడ్లీతో స్వీకరిస్తూ ప్రచురించాలనుకున్నాం. ఈ అంశాలు, ఇదివరకు ఎన్నిక చేయని కవితల గురించిన అభిప్రాయాలు ఆయనకు తెలపాలనుకున్నాం. దురదృష్టవశాత్తు అనివార్య కారణాల వల్ల, సెప్టెంబరు నాటికి కూడ జూన్ సృజన వెలువడనే లేదు. 200 సంచికను ఎక్కువ పేజీలతో ప్రత్యేక సంచికగా తేవాలన్న మా ఆత్యాశే ఆలస్యానికి కారణం. ఇప్పుడు శ్రీను లేడు. శ్రీనూ– ఒకేసారి నీ మూడు రచనలు కవిత, పాట, లేఖ సృజనలో వచ్చాయి చూడు అని ఇప్పుడు ఎట్లా చెప్పాలి. నువ్వింక పదకొండేళ్ళ దాకా ఎదురు చూడనక్కర్లేదు. నువ్వు 28 జూన్న రాసావు. నిజానికి జూన్ సంచికకే నీ రచనలు ఎన్నికయ్యాయి అని ఎట్లా చెప్పడం. శ్రీశ్రీ 'మరోప్రస్థానం' చెరబండరాజుకు అంకితం ఇవ్వాలని అనుకొని కమ్యూనికేట్ చేయడంలో ఎక్కడో జరిగిన లోపం వల్ల అది చెరబండరాజు బతికుండగా జరగలేదు. వేదన ఏమిటంటే శ్రీశ్రీ బతికుండగానూ జరగలేదు.

జీవితంలోను, సాహిత్యంలోను ఇటువంటి వేదననీ అందరికన్నా బాగా శ్రీను అర్థం చేసుకోగలడు. కాని ఆ అర్థం చేసుకునే 22 ఏళ్ళ పసివానికి నూరేళ్ళు నిండాయి.

90-92 లలో రెండేళ్ళు విప్లవ కార్మికోద్యమంలో పనిచేసిన కామ్రేడ్ ఎం. ఎస్. ఆర్. ను బొలారం పారిశ్రామిక ప్రాంతంలో పట్టుకొని పోలీసులు 'ఎన్కౌంటర్' చేశారు. ఏడేళ్ళ క్రితం పసిపిల్లల డాక్టర్ రామనాథం గారిని హత్య చేసిన సెప్టెంబర్ 3వ తేదీ రోజే ఈ పసిబాలుణ్ణి కూడ చంపేశారు.

మనిషిగా మాలో మసిలి, కవిగా మాలో నిలిచిన మా ఆత్మీయుడు శ్రీను-

# స్వీకారం

**చరిత ప్రచురణలు :**

* మళ్ళీ కన్యాశుల్కం గురించి - కేతవరపు రామకోటి శాస్త్రి, 120+ X పేజీలు, 1/8 డెమ్మీ, రు 20.
* నూరేళ్ళ కన్యాశుల్కం- కె.వి.ఆర్. 69+V పేజీలు, 1/8 డెమ్మీ, రు. 15.

పై రెండు పుస్తకాలకు : చరిత ప్రచురణలు, 5-8-300, చిరాగ్ అలీ లైన్, అబిడ్స్, హైదరాబాద్ 500001

**సోషలిస్టు పబ్లికేషన్స్ :**

* అగ్నికణాలు– సుబ్బారావు పాణిగ్రాహి గేయసంపుటి, అమరుడు పాణిగ్రాహితో అరనిమిషం, పాణిగ్రాహి ఊహాగానం, 52 పేజీలు, 1/8 డెమ్మీ రు. 2-50
* మావో సూక్తులు - 164 + XX పేజీలు, 1/8 డెమ్మీ, రు. 12.00

పై రెండు పుస్తకాలకు : సోషలిస్టు పబ్లికేషన్స్, విజయవాడ-520002

మంజీరా రచయితల సంఘం, మెదక్ జిల్లా ప్రచురణలు :

* గెలిచి తీరాలి మనం - మద్యపాన వ్యతిరేక పాటలు - రచన : కోమల్, 12 పేజీలు, 1/8 డెమ్మీ రు. 1
* సంతకం - కవితా సంకలనం - మోతుకూరి అశోక్‌కుమార్, 58+VIII పేజీలు, 1/8 డెమ్మీ రు. 12.
* నేల తడవని వాన - కవితా సంకలనం - ఏశేశ్వర నాగభూషణాచార్య, 60+VIII పేజీలు, 1/8 డెమ్మీ, రు. 12.

---

(ఎం. శ్రీనివాసరావు, ఎం. ఎస్. ఆర్., కరుణాకర్– ప్రభాకర్)కు వినమ్రంగా కన్నీటి జోహార్లు చెప్తున్నాం.

మేమెన్నడూ చూడని వాళ్ళమ్మ, తండ్రి, తమ్ముడు ఈ పిడుగుపాటు వంటి వార్తను విని తట్టుకోగలగాలని అన్యాయంగానే కానీ ఇంక చేయగలిగేది ఏమీలేక ఆశిస్తున్నాం.

నవంబర్ 13, 92

—'సాహితీమిత్రులు'

పై మూడు పుస్తకాలకు : మంజీరా రచయితల సంఘం, 7-3-18/1, హెడ్ పోస్టాఫీసు పక్కన, సిద్దిపేట, 502103.

* చిత్రహింసల కొలిమిలోంచి - అష్రఫ్ దెహానీ, స్వేచ్ఛాసాహితి ప్రచురణ, 168+X పేజీలు, 1/8 డెమ్మీ, రు. 10, ప్రతులకు: ప్రగతి బుక్ హౌస్, మ్యూజియం రోడ్, గవర్నరు పేట, విజయవాడ - 520002.
* పరాధీన భారతం - ప్రభుత్వ నూతన ఆర్థిక విధానాల విశ్లేషణ - ఎ.బి.కె. పర్‌స్పెక్టివ్స్, 214+VIII పేజీలు, 1/8 డెమ్మీ, సాదాప్రతి, రు. 25, మేలు ప్రతి రు. 50, ప్రతులకు : నవోదయ బుక్ హౌస్, 3-3-865, ఆర్యసమాజ్ ఎదురు రోడ్డు, కాచిగూడ, హైదరాబాద్ 500027.
* నెత్తుటి జెండాలు. కవితలు-పాటలు, ప్రజారస, అరుణోదయ సాహితీ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణ : 84 పేజీలు, 1/8 డెమ్మీ, రు. 8. ప్రతులకు- ప్రజాపంథా, కొరిటెపాడు, గుంటూరు.
* ఒక వేకువ కోసం-స్మృతి గీతాలు-అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణ, 38+VI పేజీలు, 1/8 డెమ్మీ, వెల లేదు. ప్రతులకు : మైత్రీ బుక్ హౌస్, ఏలూరురోడ్డు, మసీదు వీధి, విజయవాడ.
* సిటీలైఫ్ - కార్టూన్ కవితలు - అలిశెట్టి ప్రభాకర్, 94 పేజీలు, 1/8 డెమ్మీ రు. 18, ప్రతులకు : అలిశెట్టి ప్రభాకర్, 1-8-3/22/2, బిసైడ్ నారాయణ గూడ బ్రిడ్జి, చిక్కడపల్లి, హైదరాబాద్ 500020.
* వర్తమానం - కవితా సంకలనం - ఎండ్లూరి సుధాకర్, మానస ప్రచురణలు, 86+XVI పేజీలు, 1/8 డెమ్మీ, రు. 15. ప్రతులకు : వై. సుధాకర్, తెలుగు యూనివర్సిటీ, బొమ్మూరు, రాజమండ్రి - 533124
* అగ్నిశ్వాస - కవితా సంకలనం - వి. సి. రాములు- రవిచంద్ర పబ్లికేషన్స్, 60+XX పేజీలు, 1/8 డెమ్మీ, రు. 12, ప్రతులకు : శ్రీమతి రమాదేవి, సి-18, ఎచ్. బి. కాలనీ, ఆదిలాబాద్. 504001.
* ప్రవహించే జ్ఞాపకం - కవితా సంకలనం - యాకూబ్, శిలాలోలిత ప్రచురణలు, 82+VI పేజీలు, 1/8 డెమ్మీ, రు. 10. ప్రతులకు : యాకూబ్, ఫ్లాట్ నెం. జి 1, స్వాతి శిఖర అపార్ట్ మెంట్స్, హుడా కాంప్లెక్స్, సరూర్ నగర్, హైదరాబాద్ 500660

వెలువడినవి

# విరసం ప్రచురణలు

**సిటీ యూనిట్ ప్రచురణలు :**

**1) ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర :**

ఒక నిర్మాణ ప్రయత్నం
కె. వి. ఆర్. వ్యాసాలు
సాదా ప్రతి రు. 30/- మేలు ప్రతి రు. 50/-
ప్రతులకు : నవోదయ బుక్ హౌస్, కాచిగూడ, హైదరాబాద్ 500027

---

* గోదావరి నా ప్రతిబింబం - కవితా సంకలనం అద్దేపల్లి రామమోహనరావు. 62 పేజీలు, 1/8 డెమ్మీ, రు. 15 ప్రతులకు : జీవన సాహితి, 29-6-13-డి, పురాణపండవారి వీధి, రాజమండ్రి, 533104.

* చైతన్య కవిత - 11-12, చైతన్య కవితా వేదిక, బెంగుళూరు - 58+4 పేజీలు, 1/8 డెమ్మీ, రు. 10. ప్రతులకు : ప్రొ. టి. వి. సుబ్బారావు, తెలుగు శాఖ, బెంగుళూరు విశ్వవిద్యాలయం బెంగుళూరు 560056

* సావిత్ర - సావిత్రి రచనలు — 142 పేజీలు 1/8 డెమ్మీ రు. 15, ప్రతులకు : ఎస్. నటరాజ్, సృజన హౌస్, 9-5-2/1, పితనివారిపాలెం, విశాఖ పట్నం-3

* ప్రవాహం - కవితా సంకలనం - దర్భశయనం శ్రీనివాసాచార్య 60+IV పేజీలు, 1/8 డెమ్మీ, రు. 12. ప్రతులకు విశాలాంధ్రబుక్ హౌస్, బ్యాంకు స్ట్రీట్, హైదరాబాద్.

* సంతకాలు - కవితా సంచిక 2, 40 పేజీలు, 1/8 డెమ్మీ, రు. 5. ప్రతులకు : పసుపులేటి వెంకటరమణ, సిద్ధు స్క్రీన్ ప్రింటర్స్, టి. బి. రోడ్డు, తెనాలి 522201

* అగ్నిశిల్పి - కవితా సంకలనం — వుయ్యూరు రామకృష్ణ శ్రీనిధి, వినోదిని ప్రచురణలు, 64 పేజీలు, 1/8 డెమ్మీ, రు. 5. ప్రతులకు : వినోదిని పబ్లికేషన్స్, రాజుపేట, తిరువూరు - 521235

**2) కాగడాగా వెలిగిన క్షణం :**

అమరుడు ఎం. ఎస్. ఆర్. కవితలు, ఇతర రచనలు రు. 20/-
ప్రతులకు : నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ, హైదరాబాద్ 500027

**3) కల్లోల కలల మేఘం :**

నారాయణ స్వామి కవితా సంకలనం రు. 15/-
ప్రతులకు : నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ, హైదరాబాద్ 500027

**విశాఖ యూనిట్ ప్రచురణలు :**

**4) ప్రజా-సామ్య - సంస్కృతి :**

నిన్న నేడు రేపు
కాకరాల రు. 2/-

**5) ప్రమాద సంగీతం :**

ఇంద్రవెల్లి రమేష్ కవితా సంకలనం
చిత్తూరు యూనిట్ ప్రచురణ రు. 10/-
ప్రతులకు : రమేష్, ప్రభుత్వ ఆస్పత్రి ఎదురుగా, మదనపల్లె 517325

**6) 'సారాజ్యం'**

సారా వ్యతిరేకోద్యమ సాహిత్యం
విశాఖ యూనిట్ ప్రచురణ రు. 2/-
ప్రతులకు : టి. కృష్ణాబాయి, 15 ఎల్ ఐ జి, ఎచ్. బి. కాలనీ, విశాఖపట్నం 530022

**7) సారా రాజ్యం కాదు ప్రజారాజ్యం కావాలి :**

వి. చెంచయ్య
నెల్లూరుజిల్లా యూనిట్ ప్రచురణ రు 2/-
ప్రతులకు : వి. చెంచయ్య, 6-5-13, కావలి -524201 నెల్లూరుజిల్లా

# సృజన ప్రచురణలు

## కొ త్త పు స్త కా లు

## కవిత్వంలో నిబద్ధత

ఇతర సాహిత్య సిద్ధాంత వ్యాసాలు

కె. వి. ఆర్.

104 పేజీలు — 10 రూపాయలు

## సారా కథలు

చారిత్రక నేపథ్యం

**1973, 83-92 సారాపై పోరాట సాహిత్యం**

106 పేజీలు — 7 రూపాయలు

త్వ ర లో

## రాగో

నవల

సాధన

ప్రతులకు :

నవోదయ బుక్ హౌస్

3-3-865, ఆర్యసమాజ్ ఎదురురోడ్

కాచిగూడ

హైదరాబాదు-500 027

SRJANA Telugu Monthly 200
Regd. No. with the Registrar of Newspapers for India 10953/67

# సృజన పాఠకులకు సంజాయిషీ - విజ్ఞప్తి

1992 జూన్‌లో సృజన 200 సంచిక వెలువడవలసింది. మామూలుగా 64 పేజీలతో అయితే కొంచెం వెనుకా ముందుగా వచ్చి వుండేదే. ప్రత్యేక సంచికగా మూడువందల పేజీలకు తగ్గకుండా తేవాలనుకోవడంతో ఆలస్యం అయింది. ఆరు నెలల ప్రయత్నం తర్వాత ఇంక ప్రస్తుతానికి రెండువందల సంచికను మామూలుగానే తెచ్చి, ఈ సంచికతో కూడ కలిపి రెండువందల సంచికల నుంచి ఎన్నిక చేసిన రచనలతో ప్రత్యేక సంచికను ఆర్థిక వనరులు సమకూరినపుడు తేవాలని నిర్ణయించుకున్నాం.

ఇప్పటికిది 25 ఏళ్ళ నక్సల్బరీ, శ్రీకాకుళాలు, ఆంధ్రప్రదేశ్‌లో విప్లవోద్యమంపై నిర్బంధ నిషేధాలు, సూరేళ్ళ 'కన్యాశుల్కం' నాటక ప్రదర్శన, సారాపై పోరాటం, ఎం.ఎస్.ఆర్ సంస్మరణ, అయోధ్య పరిణామాల నేపథ్యంలో వస్తున్న మామూలు సంచికే.

ఈనాటి సాహిత్య సాంస్కృతిక అవసరాల దృష్ట్యా, ఒక తరంపై ఇరవై ఐదు సంవత్సరాల నక్సల్బరీ ప్రభావం - సృజనలో ప్రతిఫలించిన తీరును ఒకచోట చదువగల రెండువందల సంచికల సృజన మంజూష మూడు వందల పేజీలయినా రావచ్చు. అంటే కనీసం ముప్పైవేల రూపాయలైనా కావాలి. అంత పెద్ద మొత్తం సృజనకు ఎప్పటికి సమకూరేనూ ! అది పాఠకుల అభిమానంపై ఆధారపడి వుంటుంది.

సృజన ఎప్పుడూ కేవలం చందాలతోనే స్వయంచాలకంగా వెలువడలేదు. కొంతమంది సాహితీ మిత్రుల ఇతోధిక ఆర్థిక సహకారం వల్లనే అది సాధ్యమైంది. పైన పేర్కొన్నటువంటి సంచిక అవసరమని భావిస్తే అందుకు అవసరమైన ఆర్థిక సహాయం అందించవలసిందిగా పాఠకులకు విజ్ఞప్తి చేస్తున్నాం.

డిసెంబర్ 15, '92. — 'సాహితీ మిత్రులు'